


19-25, జూలై, '85
రు. 2/-

విదేశాలలో
విజయభేరి మోగిస్తున్న
హిప్నో థెరపీ





లక్ష్మీఫిలింస్ డివిజన్

# వజ్రాయుధం

కె.రాఘవేంద్రరావు బి.ఏ.

పరుచూరిబ్రదర్స్ · చక్రవర్తి · కె.యస్.ప్రకాష్

లక్ష్మీఫిలింస్

LAKSHMI PUBB.

"నాకు ఇంచుమించుగా
ఆడది కోరుకునేవన్నీ ఉన్నాయి.
అయితేనేం, అడక్కుండానే
మరింత దొరుకుతోందంటే
ఎందుకు కాదనాలి?"




**'మోర్' డిటర్జెంట్ సబ్బు**

'మోర్' కొనండి. మీ రూపాయికి మరింత విలువ రాబట్టండి.

మరింత తెలుపు. మరింత మెరుపు.
మీ రూపాయికి మరింత తెలుపు చేసే శక్తి.

'మోర్' ధర మరే మంచి డిటర్జెంట్
ఖ్చకన్న కొద్దిగానే ఎక్కువ. అయితేనేం,
ఇది సైజులో రెండింతలు పెద్దది.
దీంతో మరి రెండింతలు బట్టలు
ఉతికే వీలు వుంది!

**రెట్టింపు సైజు. అయినా ధర కేవలం
రూ.3.25 పైసలే (పన్నులు అదనం)**

## పంజాబ్ రాజకీయాలు

అందాల తార కుమారి శ్రీదేవి ముఖచిత్రం (21–27) ఈ సంచికకే అందాన్ని చేకూర్చింది. ఈ సంచికలో "సూరి" గారు వ్రాసిన "పంజాబ్ రాజకీయాలు" గురించి వ్రాసిన వ్యాసం బాగుంది. అంత తక్కువ మెజారిటీ కల అకాలీలు తమకు ప్రత్యేకరాష్ట్రం కావాలనడం అనాలోచితం అర్ధరాహిత్యంగా ఉంది.

సింగం దత్తాయమూర్తి,
రఘురామారావ్. ఒంగోలు.

## జ్ఞాన సుధ

"ధర్మ పథం" శీర్షికలో వారం వారం ఆధ్యాత్మిక విష చర్చ మూలముగా జ్ఞాన సుధ పంచుతున్న శ్రీ ములుసు వేంకటరమణయ్య గారికి కృ తాభివందనలు.

నర్రా రాజేంద్రప్రసాద్, కోయంబత్తూరు.

## న్యూఢిల్లీ లేఖ

14–20 జూన్ 85 ఆంధ్ర సచిత్ర వార పత్రికలో "పంజాబ్ సమస్యకాదు అకాలీ సమస్యే" చదివిన తరువాత ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. అకాలీలు భారతీయులు అవునా కాదా? అన్నది వారు మొదట నిర్ణయం తీసుకొనవలసిన విషయం.

కొమ్మన శ్రీరాములు, బరంపురం.

* * *

జయసుధ (31–6) ముఖచిత్రంతో వెలువడిన పత్రిక మమ్మల్నెంతగానో ఆకట్టుకుంది. సంస్కృతిని విస్మరిస్తే సమస్యలు తప్పవు! 'డా. జయుదుబాషిగారి న్యూఢిల్లీ లేఖ చాల బాగుంది.

దాసరి మంగాదేవి, పాలమూరు:

## సీరియల్స్

"జయసుధ" ముఖచిత్రం ఎంతో చక్కగా ఉంది. 'మల్లిక' సీరియల్ ద్వారా మాకు తెలియని ఎన్నో




విజ్ఞాన దాయకమైన విషయాలను తెలుసుకున్నాము. రచయిత(త్రి) "యార్లగడ్డ కిమీర" గారికి మా మనః పూర్వక అభినందనలు.

చావా వేంకట చక్రపాణి, నెల్లూరు.

* * *

31 మే–6 జూన్ 85 తేది సంచికపై నటి జయసుధ ముఖచిత్రం చాల బాగుంది. మల్లిక సీరియల్ నన్ను మొదట్లోనే ఆకట్టుకుంది. రచయిత్రి "యార్లగడ్డ కిమీర" గార్కి నా అభినందనలు.

సంగడి శివన్నారాయణ, వేల్పూరు.

* * *

**ఆంధ్రసచిత్రవారపత్రికలో** ప్రచురిస్తున్న **సీరియల్ "మల్లిక" అత్యంత రమ్యంగా వుంది. 'కిమీర'** గారి రచన చక్కని సాంఘిక చలన చిత్రం **చూస్తున్న అనుభూతి కలుగుతూంది.**

**ఏ. విజయలక్ష్మిరెడ్డి, ప్రొద్దుటూరు.**

## కథలు

31–5–85 నాడు వెలువడిన జయసుధ ముఖచిత్రము గల వారపత్రిక చాలా ఆకర్షనీయంగాయుంది. "భిక్షగాడి భిక్ష" కథ చాలా బాగుంది. భిక్షగాడి యొక్క ధర్మబుద్ధిని చాలా బాగా వ్రాసిన రచయిత "మహబూబ్ బాషా" గార్కి అభినందనలు.

పుప్పాల హన్మంతరావు, కాగజ్‌నగర్.

**(66 వపేజీ చూడండి)**




**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

(1938-1972)

శుక్రవారం : 19-25 జూలై, 1985

శ్రీ క్రోధన నామ సం. అధిక శ్రావణం శు. విదియ

సంపుటము 77 : సంచిక 46

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2-00 |
| ఆరు మాసాల చందా | రు. 55-90 |
| పోస్టులో ఏడాది చందా | రు. 111-80 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :

హిందీ నటి:మందాకిని

(ఫోటో : పి. రవిచందర్)

కథలు :



సీరియల్ నవలలు:



వ్యాసాలు, శీర్షికలు :

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# 1985 దీపావళి కథల పోటీ

## మొత్తం బహుమతులు రు. 6,600/-

ఎప్పటిమాదిరే ఈ సంవత్సరం కూడా దీపావళికి కథల పోటీ నిర్వహిస్తున్నాము గత సంవత్సరంలాగే ఈసారి కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఆరు కథలని ఆంధ్ర సచిత్ర వార పత్రిక దీపావళి సంచికలోనూ, ఆ తర్వాతి సంచికలోనూ ప్రచురిస్తాము అటు తరువాత ఆ కథలపై పాఠకుల బాలట్ నిర్వహిస్తాము

**ముగింపు తేది : 24 ఆగస్టు 1985**

పోటీలో ఎన్నికైన ఆరు కథలకు ఒకొక్క దానికీ రు 650/- చొప్పున బహుమతి లభిస్తుంది ఆ తరువాత పాఠకుల బాలట్‌లో మొదటి, రెండవ, మూడవ స్థానాలలో వచ్చిన కథలకి వరుసగా రు 700/-, రు 600/-, రు 500/-లు వంతున అదనపు బహుమతులు అందజేస్తాము మిగతా మూడు కథలకీ ఒక్కొక్క దానికీ రు 300/-లు చొప్పున ప్రత్యేక బహుమతిగా ఇస్తాము

### నిబంధనలు

1 కథా వస్తువు తెలుగువారి సామాజిక జీవితానికి సంబంధించినదై ఉండాలి

2 కథ పన్నెండు అరఠావులకి మించి ఉండరాదు (అరఠావు అంటే ఎక్సర్‌సైజు పుస్తకం పేజీకి రెట్టింపు) కాగితానికి ఒక వైపే సిరాతో లేదా బాల్‌పెన్‌తో రాయాలి కథ వ్రాతప్రతిపైన "1985 దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి

3 అనువాదాలు, అనుసరణలు, కాపీ కథలు పంపరాదు గతంలో ప్రచురింపబడిన, రేడియోలో ప్రసారం అయిన కథలని, ఇతర పత్రికల పరిశీలనలో ఉన్న వాటిని పంపకూడదు ఈ మేరకి తమ కథల వ్రాత ప్రతులతో పాటు రచయిత(త్రు)లు హామీ రాసి సంతకం చేసి పంపాలి హామీ పత్రంలేని రచనలు పరిశీలింపబడవు.

4 రచయిత(త్రు)లు కలం పేరు వాడినా తమ అసలు పేరు, పూర్తి చిరునామా స్పష్టంగా రాయాలి

5 సంపాదకుని ఎన్నికలో బహుమతి పొందిన ఆరు కథలని ఆయా రచయిత(త్రు)ల పేర్లు లేకుండా ప్రచురిస్తాము బాలట్ ఫలితాలతో పాటు వారి పరిచయాలు ఫోటోలతో సహా తరువాత ప్రచురిస్తాము

6 పోటీలో గెలుపొందిన కథా రచయిత(త్రు)లు తమ ఫోటో, జీవిత విశేషాల ప్రచురణకి అంగీకరించాల్సి ఉంటుంది

7 రచనలపై వచ్చే ఎటువంటి పేచీలకైనా ఆయా రచయిత(త్రు)లే బాధ్యత వహించవలసి ఉంటుంది

8 పోటీకి పంపే కథలు 24 ఆగస్టు 1985 నాటికి కాని, ఆలోగా కానీ మా కార్యాలయానికి చేరాలి ఆ తేదీ తరువాత అందిన కథలని సాధారణ ప్రచురణకి వీలు వెంబడి పరిశీలించడం జరుగుతుంది

9 పోటీకి పంపిన కథలని ఎటువంటి పరిస్థితులలోనూ తిప్పి పంపడం జరగదు కాబట్టి రచయిత(త్రు)లు వాటితో పాటు తగినన్ని తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామా కల కవర్లని జత పరచి పంపనవసరంలేదు

10 పోటీలో బహుమతి పొందని కథలలో కొన్నిటిని సాధారణ ప్రచురణకి స్వీకరించి వీలు వెంబడి వాటిని ప్రచురించడం జరుగుతుంది ఆ విషయాన్ని ఉత్తరాల ద్వారా ఆయా రచయిత(త్రు)లకి తెలియజేస్తాము

11 పోటీకి పంపే కథలని సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీనగరం, విజయవాడ-520 003 అన్న చిరునామాకి పంపాలి వ్యక్తుల పేర పంపరాదు కవరు పైభాగంలో '1985 దీపావళి కథల పోటీకి' అని స్పష్టంగా రాయాలి

రచయిత(త్రు)లందరూ ఉత్సాహంగా ఈ పోటీలో పాల్గొని దీనిని జయప్రదం చేయగలరని ఆశిస్తున్నాము

–సంపాదకుడు

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

# గూండాలు రాజ్యం చేస్తున్న గుజరాత్!

ఈ ప్రపంచంలో బజారు రవుడీలకి, హంతకులకి గూండాలకి తప్ప పెదవారికి చోటులేదు గత నాలుగు నెలలుగా మాదవ్‌సింగ్ సోలంకీ గారి గుజరాత్‌లో ఆయన గూండాలే రాజ్యం చేస్తున్నట్లు కనిపిస్తున్నది వాళ్లు పోలీసు ప్రభుత్వ ఉన్నతాధికార యంత్రాంగాన్ని కూడా తమ చేతులలోకి తీసుకున్నారు ఈ మధ్యే పారిస్, వాషింగ్టన్‌లలో విజయాలని సాధించి తిరిగి వచ్చిన ప్రధాని రాజీవగాంధీ ఆయన సంగతి చూడకపోతే వాళ్ళు సోలంకీని కూడా తమ చేతులలోకి తీసుకుంటారనడంలో సందేహం లేదు అది జరగటానికి ఆట్టే వ్యవధి కూడా పట్టదు

సోలంకీ ఆయన మనుషులు అధికారంలో ఉన్నంత కాలం ఈ గూండాల రాజ్యం కూడా ఉంటుందని అనుకోవాలి కాంగ్రెసు ఆలోచనలలో అతి విధ్వంసమైన నేర ప్రవృత్తి అప్పుడప్పుడు ఈ రకంగా తల ఎత్తుతూ ఉంటుంది దానికి ముఖ్యమైన ఉదాహరణగా అత్యవసర పరిస్థితిని పేర్కొనవచ్చు భారతదేశంలో అత్యున్నత స్థానంలో ఉన్న వ్యక్తి అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని ఒక జైలు నించి యూనస్ కుమారుడిని విడిపించడం మరొక ఉదాహరణ మహాత్మాగాంధి స్వరాష్ట్రం అయిన గుజరాత్‌లో నేరస్తులదే పైచెయ్యిగా ఉన్నది అత్యవసర పరిస్థితికి ముందు వాళ్ళు ఢిల్లీ మిగతా చోట్ల ఉన్నట్లుగానే ఇంతకు పూర్వం గుజరాత్‌లో కూడా ఉన్నారు అయితే రాజకీయ నాయకులు తమ స్వార్థం కోసం వాళ్లని వాడుకోడం మొదలు పెట్టగానే వాళ్ళు బయటికి వచ్చారు 1975 లో శ్రీమతి గాంధీ ఢిల్లీలో వాళ్లని ఉపయోగించి పది సంవత్సరాల తర్వాత ఇప్పుడు అహమ్మదాబాద్‌లో సోలంకీ వాళ్లని ఉపయోగించుకుంటున్నారు భారతదేశంలో ప్రభుత్వం అనేది చీఫ్ కానిస్టేబుల్ స్థాయి వరకూ దోషభూయిష్టంగా తయారైంది కానీ దానికి బాధ్యులు సోలంకీ కాదు ఆయన తమ పైవాళ్లు నేర్పించేది చేస్తున్నారు శ్రీమతి గాంధీదే ఆ బాధ్యత

ఇటీవల గుజరాత్‌లో చెలరేగిన ఆందోళన గురించి చెప్పే మిగతా సిద్ధాంతాలన్నీ ఊకదంపుడు కబుర్లే ఈ మధ్య ఒక బొంబాయి వారపత్రికలో ఢిల్లీకి చెందిన ఒక రచయిత రాసిన వ్యాసంలో గుజరాత్‌లో ఎప్పుడూ అహింస, పవిత్రత అన్నవి లేవు పైకి కనిపించే దాని శాంత స్వభావం వెనుక పూర్తిగా సనాతన సాంప్రదాయాలకి కట్టుబడిన సమాజం ఉన్నది దానికి దిగువ తరగతుల వారిని అల్పసంఖ్యాక వర్గాల వారిని సహించే ఓర్పు లేదు మార్పుకి అది తీవ్రమైన వ్యతిరేకతని ప్రదర్శిస్తుందని అక్కడి వినాశకర శక్తులకి అదే ఆలంబన అయిందని ఆయన వాదించారు తమ వ్యాసంలో

వాస్తవాలు మరో విధంగా ఉన్నాయి గుజరాతీలు సనాతన సాంప్రదాయాలకేమీ బద్ధులై ఉన్న వాళ్లు కాదు అలా ఉండి ఉంటే ఇప్పుడు వాళ్లు ఇలా ఉండరు గుజరాతీలలా మార్పుని వ్యతిరేకించని వర్గాల వారు చాలా కొద్దిమంది ఉండి వుంటారు గుజరాత్‌లో పరిశ్రమల రేటు చాలా ఎక్కువ అక్కడ ఉన్న పరిశ్రమలన్నీ గుజరాతీ వారివే కానీ బయటి వారివి కావు కానీ బెంగాలు మహారాష్ట్రలలో అలాకాదు గుజరాతీ వ్యక్తి అన్ని వ్యవహారాలలోనూ వ్యాపార సరళినే ప్రదర్శిస్తాడు తన రాష్ట్రంలో అయినా బయట అయినా ఎలాంటి మార్పుకైనా అతను సర్దుకుపోగలుగుతాడు భారతదేశంలో మార్పులు శీఘ్రగతిన రాకపోవటానికి కారణం శ్రీమతి గాంధీ వంటివారే అలాగే అభ్యున్నతికి ఏ ఒక్క పథకం సోలంకీ వద్ద లేదు ప్రభుత్వంలో ఎక్కువ ఉద్యోగాలు వాళ్లకి ఇస్తామనే హామీ మాత్రమే ఆయన ఇవ్వగలరు దాన్ని కూడా ఎన్నికల ముందు వారికి ఒక ఎరగా ఆయన ఉపయోగిస్తారు దాన్ని నెరవేర్చాలన్న తలపు కూడా తర్వాత ఆయనకి ఉండదు ఎన్నికలు అయిపోయాయి అగ్రవర్ణాల వారు తమ చేతులని కట్టి వేశారనే భావాన్ని కలిగించేందుకు ఆయన తమ గూండాలు, తదితరుల ద్వారా ఆందోళనకి పురికొల్పారు గుజరాత్ ఆందోళన వర్గపోరాటం కాదు వర్ణపోరాటం కూడా కాదు జాతుల మధ్య జరుగుతున్న యుద్ధం అసలే కాదు తమ ఓట్ల బాంకు చెక్కు చెదరకుండా ఉండేందుకు అధికార పక్షంవారు జాతుల మధ్య వైరాన్ని సృష్టించి ఆడుతున్న నాటకం కేంద్రంలో ఏళ్ల తరబడి శ్రీమతి గాంధీ దీనిని నిర్వహించారు పంజాబ్‌లో కూడా దానిని ప్రయోగించాలని ప్రయత్నించి తామే బలైపోయారు బాగా తెలిసిన వాళ్లమనే వారు చెప్పే మిగతా సిద్ధాంతాలన్నీ శుష్కవాదాలే

సోలంకీ ఏర్పాటు చేసిన కె హెచ్ ఎ ఎం కూటమిలోని ఏ వర్గానికైనా లాభం కలిగితే దానికి నా సానుభూతి తప్పకుండా ఉంటుంది గుజరాత్‌లోని ఆదివాసులు, ముస్లిమ్‌లు ఇంతకు పూర్వం కంటె ఏమీ మెరుగ్గా లేరు ఇదంతా ఓట్ల కోసం గుజరాత్‌లో కూడా మార్పు త్వరగా రాకపోవటానికి కారణం సోలంకీ వంటి వారే ఈ సోలంకీలు గాంధీలు తమ స్వప్రయోజనాల కోసం ఎక్కడి వారిని అక్కడే ఎదుగూబొదుగూ లేకుండా ఉండేలా చేశారు కానీ వాళ్లే ఆధునికీకరణ వల్ల అతి తక్కువ ప్రయోజనం పొందిన ఆ జాతులకి తామే సంరక్షకులమని ఎన్నో ఏళ్ళుగా చెప్పుకుంటున్నారు స్వలాభంతో కూడిన ఈ అల్పసంఖ్యాకులపై ఆసక్తి కేవలం రాజకీయమైనట్టిది వాళ్లు వెనుకబడి ఉంటేనే అధికార పక్షం వారికి లాభం ఈ అల్పసంఖ్యాక వర్గమే వారికి ఓట్లు బాంకులా ఉపయోగపడుతుంది

సోలంకీ ఒక కూటమిని ఏర్పాటు చేశారు దాని పేరు కె హెచ్ ఎ ఎం (క్షత్రియులు (ఆయన కులం) హరిజనులు ఆదివాసులు ముస్లిమ్‌లు) ఈ కూటమి వెనుకబడిన వర్గాలన్నిటినీ ఒక వేదిక పైకి తీసుకురావడానికి ఆయన ఏర్పాటు చేశారు ఇది కేవలం రాజకీయ అవసరాల కోసమే వెనుకబడిన వారి ఓట్లని (ఎన్నికలు వచ్చినప్పుడు) సంపాదించడానికే గానీ ఆర్థికంగా సామాజికంగా వారి అభ్యున్నతి కోసం కాదు తాము కూడా ప్రభుత్వంలో భాగస్వాములేనన్న భ్రమని వారికి కల్పించడానికి తప్ప ఇది వారి సామాజిక ఆర్థిక చూపించే తమాషా అందుకు బదులు ఎవరో తమకి ఇష్టులైన చాలా కొద్దిమందికి ఉద్యోగాలు కల్పిస్తారు తప్ప మరే ప్రయోజనమూ ఉండదు ఇక్కడో జకరయ్యకీ అక్కడో యూనస్‌కీ ఉద్యోగం దొరుకుతుంది అయితే ఆ వర్గంలోని చాలామంది 40 ఏళ్లకి ముందున్న స్థితిలోనే ఉంటారు దీనికంతటికీ కారణం వారు ఇంత కాలంగా ఒకే కుటుంబాన్ని నమ్ముకుని ఉండటమే మిగతా అల్పసంఖ్యాక వర్గాలు ఉదాహరణకి పార్సీలని చూడండి వాళ్లు దేశంలో అత్యంత ధనవంతులైన ఒక వర్గం కానీ వాళ్లెప్పుడూ అల్పసంఖ్యాక వర్గాల లాగా ప్రవర్తించలేదు వాళ్లు ఏ కుటుంబాన్నీ పట్టుకుని వేలాడలేదు ఆ మాటకొస్తే ఏ రాజకీయ పార్టీని కూడా

ఈ నెహ్రూలు, సోలంకీలు ఎంతకైనా తగినవారు అత్యవసర పరిస్థితులని విధించగలరు (పదేళ్లకి ముందు చేసినట్లు) రాజ్యాంగాన్ని రద్దు చెయ్యగలరు ప్రజలని జైళ్లలో పెట్టించగలరు విదేశీ జైళ్లలో ఉన్న నేరస్తులని విడుదల చెయ్యించగలరు వాళ్లు అధికారంలో కొనసాగేలా చూసుకోడానికే ఇవన్నీ చేస్తారు గత ఏడాది ఢిల్లీలో ఒక వర్గానికి చెందిన 2 500 మంది హత్యకి గురైనారు ఇప్పుడు అహమ్మదాబాద్‌లో 200 మంది మరణిస్తే మాత్రం ఏమైంది? □

# వారఫలం

## 19–7–1985 శుక్రవారం మొదలు 25–7–1985 గురువారం వరకు

★ **మేషం :** అధికారం వృద్ధి నొందగలదు ముఖ్యులను కలసికోగలరు ఆదాయమున్నది అనుకూల దినాలు ఉద్యోగంలో కొంత మార్పు రానున్నది వ్యాపారంలో స్వల్పంగా అబివృద్ధి కనిపిస్తుంది స్త్రీలకు కుటుంబానందం, నూతనోద్యోగప్రాప్తి, ఆరోగ్యాభివృద్ధి కార్యాను కూలత చెప్పదగిన అంశాలు

★ **వృషభం :** వివాహ ప్రయత్నాలు అను కూలం నూతన మిత్రుల పరిచయం, అధికార వర్గీయుల పరిచయం, రాజకీయరంగాన అబివృద్ధి, రావలసిన డబ్బు చేతికందే అవకాశాలు, సుఖశాంతులకు అవకాశం స్త్రీలకు అన్యదేశ సంచారానికి కొందరకు అవకాశం పరుల చెత చిక్కిన దనం వసూలయ్యే అవకాశం గలవారం

★ **మిధునం .** మి యింట శుబకార్య ప్రస్తావన లుంటాయి మి ఆరోగ్యమందు అభివృద్ధి చెకూరుతుంధి మితో మనస్తాపం ఏర్పడి దూరమయిన వారు, దాపునకు రాగల దినాలు విద్యాబివృద్ధికి, కళాశాల 'సీట్లకు' యత్నించిన వారికి అనుకూలత చెకూరుతుంది స్త్రీలకు సర్వవిదాలా అనుకూల వారమే

★ **కర్కాటకం .** చుట్టుప్రక్కల వారితో గొడవలు రాగలవెమో గ్రహించండి ఓర్పు సదలే అవకాశమున్నది, జాగ్రత్త! వ్యవహారరీత్యా మీకు అనుకూల దినములు ప్రభుత్వరంగాన మీకు అనుకూలత చేకూరనున్నది కృషి చేయండి, మధ్య మధ్య వచ్చె అవరోధాలకు నిరుత్సాహపడకండి స్త్రీలకు ధన వాహనాలు సమకూడె అవ కాశాలున్నాయి

★ **సింహం :** స్థితియందు, భూస్థితి యందు, ధనాదాయమందు, ఉదోగ యత్నాలు సాను కూలమగుట యందు మీకు అనుకూల వారం క్రితపు రోజుల కన్నా 'సోమ మంగళ' వారాల నుండి మేలు చేకూరనున్నది మీదారికి అడ్డు వచ్చే వారున్నారుగా, గమనించండి స్త్రీలకు ఉద్యో గాభివృద్ధి

★ **కన్య :** దూరబంధువులను కలిసికో నున్నారు, చంతానం కొరకు చెసె విద్యాయోగ్యతా యత్నాలు ఫలింపగలవు స్త్రీల వలన ఏదో మనస్తాపం చేకూరగల సమయం, గ్రహించి, ఓర్మి వహించి మెలగండి స్త్రీలకు పోయిన ఉద్యోగం లభ్యం కావటానికి అవకాశమున్నది ధనరూపకంగా పెంపుగలదు స్థితి యందు పెంపు రాగలదు. గమనించి మెలగండి.

★ **తుల ·** 'క్రియారూపంగా ఒక్క పనినీ నెరవేర్పలేకపోయా'మని ఆవేదన పడుతారు, అనవసరమే స్థితి యందభివృద్ధికి, ఆరో గ్యాభివృద్ధికి, దనవసతికి యింకా సమయం రాలేదు స్త్రీలకు ఇటీవల ఉద్యోగ మందు కనిపించిన అవరోధం తొలగుతుంది ప్రగతి సాధనకు యత్నించండి

★ **వృశ్చికం ·** ఆరోగ్యమందు పెంపు కనిపింపనున్నది మీరు ఎంతో కాలంగా కొనవలెనని ఉబలాటపడే వాహనమో, వస్త్రాలో, విలువ గల వస్తువులో సాధించుకోగలరు కొందరకు అప్రయత్న ధనాదాయానికి వసతి ఏర్పడుతుంది 'స్పెక్యులేషన్' ఫలిస్తుంది స్త్రీలకు ధనాదాయం, ఆనందం, సుఖశాంతులు

★ **ధనుస్సు :** ఎన్నివిధాల మేలు జరిగినా, ఆశించినంత డబ్బు చిక్కినా, వృత్తి యందు అవరోదాలు తొలగినా, పుణ్యకార్యతత్పరతకు బాట ఏర్పడినా, ఎందుకో మనశ్శాంతి లభించుట లేదని బాద పడుతారు స్త్రీలకు గృహానందం, ద్రవ్యా దాయం, స్థితి యందు స్వల్ప పెంపు

★ **మకరం :** నూతన వ్యవహారాలందు మీకు చొరవ ఏర్పడుతుంది వృత్తి యందు అంతో యింతో అభివృద్ధి ఏర్పడుతుంది రాజకీయ మిత్రుల మూలాన అనుకూలత ఏర్పడుతుంది అభిమానుల ఆదరణ చేకూరుతుంది ఒకానొక వ్యవహారమందు మధ్యవర్తిత్వం ద్వారా మీకు అనుకూలం స్త్రీలకు గృహానందం, ఆరోగ్య రీత్యా వృద్ధి

★ **కుంభం :** రాజకీయ వ్యవహారాలందు తలదూర్చుట మీకలవాటు, అందెలాంటి మేలు చెకూరలెదని కూడా గ్రహించారుగా! అయినా ఉబలాట పోదు కీర్తి కొరకు ప్రాకులాట కూడా తప్పదు ఏదో మేలు జరుగుతుందని పరులకు సాయం చేయుటంలో కాలం వ్యయిస్తారు పుణ్యకార్యాచరణ తత్పరులవుతారు. స్త్రీలకు దనవంతులు, బంధువర్గీయుల ఆదరాభి మానా లుంటాయి

★ **మీనం :** నూతన వ్యక్తుల పరిచయం, నూతనాంశాలు గ్రహించటం, స్థితి యందు పెంపు పొందటం, అధిక విద్యార్జనకై యత్నించటం, రాబడి యందు పెంపు కనిపించటం గ్రహింపనున్నారు చాళమందికి వృత్తి యందు వికాసమున్నది. అతిధి అభ్యాగతుల నాదరించవలసిన వారం. స్త్రీలకు తమ కొరకో, సంతానం కొరకో చేసిన యత్నాలు సానుకూలం కాగలవు, కృషి చేయండి

—విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# వ్యక్తిగతం



ఈ మద్యనే బ్రెజిల్ దేశంలోని ఎంబు అనే చిన్న నగరంలో పోలీసులు ఒక సమాదిని తవ్వి అందులోని శవం అవశేషాలని వైద్య పరీక్షకి పంపారు

ఆ శవం ఎవరిది? హతుడిదా? కాదు హంతకుడిది! కనీసం ఒక హంతకుడిదే అని చాలామంది అనుకుంటున్నారు ఈ తవ్వకం ప్రపంచం అంతటా ఆసక్తి చెలరేగేట్లు చేసింది ఎందుకంటే పరిశోదకులు ఒక పెద్ద హంతకుడి కోసం వెతుకుతూ తమ ప్రయత్నాలతో ఎంబూ సమాదిని తవ్వి చూశారు పెద్ద హంతకుడు అంటే ఇంతా అంతా కాదు జోసెఫ్ మెంగెలె హిట్లర్ కోసం పని చేసిన బయంకర హంతకులలో ఒకడు ఇతను సుమారుగా 4 లక్షల మందిని చంపించి ఉంటాడని అంచనా హిట్లర్ తేలికగా 60 లక్షల మంది యూదులని చంపించి వేశాడంటారు చంపడం అంటే యుద్ధంలో కాదు బందీలుగా ఉంచిన పౌరులని అన్నమాట బెత్సెన్ ఔష్‌విట్జ్ హిట్లర్ తాను హత్యల కోసం వాడిన కేంద్రాలలో ఎక్కువ పేరు పొందినవి మెంగెలె ఒక బందీల స్థావరానికి అదిపతిగా ఉన్నప్పుడు అందులో ఉన్న వారిని – చిన్నపిల్లలతో సహా – దారుణంగా బయంకరంగా చంపించి వేసెవాడుట అతను 1911 లో జర్మనీలోని గుంజ్‌బెర్గ్ నగరంలో సుప్రసిద్ధ దార్శనికుడు ఇమాన్యుయెల్ కాంట్ మీద పరిశోదనలు జరిపి పి హెచ్ డి తీసుకున్నాడు అంతె కాకుండా ఎమ్ బి బి ఎస్ కూడా చదివి పట్టబద్రుడయ్యాడు ఇంత చదువు చదివి మెంగెలె ఇంత క్రూరుడుగా మారటం ఒక పెద్ద విశేషం యుద్ధం అయిపోయిన తర్వాత తప్పించుకు పారిపోయిన వారిలో మెంగెలె ఒకడు నాట్సీ (నాజీ) నేరస్థులని వెతికి పట్టుకునే ఇస్రాయిలీ పరిశోదకులు – హిట్లర్ యూదులని అందరినీ చంపి వేసేద్దామనుకున్నాడు అతని కోసం దక్షిణ అమెరికా ఖండంలోని కొన్ని దేశాలని గాలించారు చివరికి మెంగెలె బెర్తియోగా అనే ఊరి వద్ద సముద్రంలో ఈదుతూ మునిగి-పోయాడని విన్నారు శవాన్ని ఎంబులో పాతి పెట్టారని కూడా విన్నారు నిజానికి మెంగెలె బతికె ఉన్నాడు! అని ఎందరో అంటే శవాన్ని తీసి వైద్యపరీక్ష చెశారు పాత రికార్డులని కొన్నిటిని పట్టి అది మెంగెలె శవమే అని నిర్ధారణ చెశారు కాని చాలామందే నమ్మటం లేదు ఐక్‌మాన్ ఎక్కడో దాక్కొని ఉంటే అతన్ని పట్టుకు తీసుకు వచ్చిన సంగతి కొందరికి జ్ఞాపకం ఉండే ఉంటుంది అలాగే ఇటీవలే క్లవుస్ బార్బీ అనే నాట్సీ హంతకుడిని పట్టుకున్నారు జోసెఫ్ మెంగెలెని పట్టుకోలేకపోయారు కనీసం అతని శవాన్నయినా పట్టుకో గలిగారా? ☐

సీరియల్

# శుశ్రుత నర్సింగ్ హోమ్

## డాక్టర్ కె. రవీంద్రబాబు

(గత సంచిక తరువాయి)

సుబ్బులు దగ్గరకు వెళ్ళి సుబ్బులు గారంటే మీరేనా? అని అడిగింది

అవునన్నట్లు తలూపింది సుబ్బులు

మీలాంటి అందగత్తెలు అమెరికాలో వుంటేనా? ఎంత ఇదిగా చూసుకుంటారు! ఏంకట! రోడ్డుమీద నడవనిస్తారా! కారుమీదో విమానం మీదో తిప్పుతారు

కావలసినంత సీమసారా తాగిస్తారు!మిస్ శుభ అంటూ మీచుట్టూ కుర్రాళ్ళంతా డాన్సు చేయరూ?

సీమ సారా అంటే ఏందమ్మా!

అయ్యో! ఈ దేశంలో సీమసారా అంటేనే తెలియదా! ఇలా నాతో రండి సీమ సారా రుచిచూపిస్తా అంటూ పక్కలైన్‌లో వున్న బార్‌కు తీసుకుని వెళ్ళి స్కాచ్ విస్కీ ఇప్పించింది మంజు

మంజు పొగడ్తలు వింటూ పెగ్గు మీద పెగ్గు ఖాళీచేసి బార్‌లోనే పడిపోయింది సుబ్బులు

కౌంటర్ దగ్గరున్నతన్ని పిల్చి యీమె కోసం పోలీసులు తిరుగుతున్నారు! విజయవాడలో మొన్న బాంకు దోచుకున్న ముఠాలో మనిషియీమె! మీ బార్‌లో యీమెను చూచారంటే మిమ్మల్నందర్నీ అరెస్టు చేస్తారు! తర్వాత మీ యిష్టం! అంది మంజు

అలాగా! అయితే ఇప్పుడేం చేయాలి? అని క్షణం ఆలోచించి క్లీనర్ని పిలిచి వాడి చెవులో ఏదో చెప్పాడు కౌంటరు దగ్గరతను

క్లీనర్ సుబ్బుల్ని వొక రిక్షావాడి సాయంతో పక్క వీధిలోని బ్రాందిషాపు ముందు పడవేయించాడు

బ్రాందీ షాపుకు వచ్చేవాళ్ళందరూ ముందు సుబ్బుల్ని చూచి నిలబడిపోయి

అరె! నాకప్పుడ్ కేస్! అంటుంటె షాపు వోనర్ బీటు కాన్‌స్టేబిల్‌ని పిలిచి చేతిలో పది రూపాయలుంచి బాయ్! ఈ లంకిణీ ఎవత్తో న్యూసెన్సుగా వుంది కొట్లోతోయ్ అన్నాడు

బీటు కాన్‌స్టేబిల్ రిక్షా వాడిని పిలిచి అతికష్టం మీద సుబ్బుల్ని రిక్షాలో



ఎక్కించి స్టేషన్‌కు తీసుకు వెళ్ళాడు

జరిగిందంతా మంజు చెప్పగానే రవి విరగబడి నవ్వాడు

మంజూ! నువ్వు ప్రాక్టికల్ జోక్స్ వేయడం మానలేదే! అని అంటూంటే అతనికి మంజు సెకండియర్‌లో వుండగా సుదతిని ఎలా రాగింగ్ చేసిందో

**జరిగిన కథ—4:** రచయిత, సర్జన్ అయిన రవితో రచయిత్రి, లెక్చరర్ అయిన ఇందువదనకు హైదరాబాదులో పరిచయం అయ్యింది విజయవాడలో తన ఇంటికి వచ్చిన ఇందూకి చంద్రహాస్ నుంచి వచ్చిన ఉత్తరం సాక్షాత్కరించింది తనకి కడుపు నెప్పి ఎక్కువగా ఉందని, అందు మూలంగా గుంటూరులోని రవిగారి శుశ్రుతా నర్సింగ్‌హోమ్‌లో చేరానని రాసాడు ఇందుకి చంద్ర మొదట తనని ఎలా అల్లరిపెట్టిందీ తుదకు ఏ విధంగా ఆప్తమిత్రుడైనది గుర్తుకు వస్తుంది చంద్రను చూడడానికి గుంటూరు వస్తుంది ఇందువదన రవి ఇంట్లో దిగుతుంది అక్కడినుండి ఆ రాత్రే చంద్రను చూడను నర్సింగ్‌హోమ్‌కి వెళుతుంది చంద్ర ఆమెను చూసి ధైర్యం తెచ్చుకొంటాడు చంద్ర, రాకేష్ ఇందువదన పేరు కలవరించటం విన్న రవి మనసు కల్లోలం చెందుతుంది రవికి మేనకోడలు గీతను పెళ్ళి చేసుకోవటం ఇష్టంలేదు రవి క్లాస్‌మేట్ మంజు అమెరికానుండి వచ్చింది

గుర్తొచ్చింది!

బెదురు చూపుల్తో, తడబడుతూ అడుగులు వేస్తూ గున్న ఏనుగులా నడచి వస్తున్న సుదతిని ఎనాటమీ దియేటర్ ముందు ఆటకాయించింది మంజు

కొత్తగా చేరావా?' అని అడిగింది మంజు

అవునన్నట్లు తలూపింది సుదతి. ఏనుగు దంతాల్లాంటి కోరపళ్ళు కనిపించేలా నవ్వుతూ

నీకు ఎనాటమీ మొదటి చాన్సులో పాసవాలని వుందా?" అని అడిగింది మంజు

'ఉ' అంటూ మూల్గింది సుదతి

అలా అయితే ఇలారా' అంటూ సుదతిని ఎనాటమీ థియేటర్ వెనక్కు తీసుకుని వెళ్ళింది

అక్కడ వినాయకుడి బొమ్మకు ఎముకలతో పూజ చేయించింది సుదతిచేత పూజ అయాక పుర్రెలతో చేసిన హారం సుదతి మెళ్ళో వేసి జడలో చేతి వేళ్ళ ఎముకలు గుచ్చింది రెండు చేతుల్లోను తొడ ఎముకలుంచి-

"ఇక పరిగెడుతూ సరాసరి ఎనాటమీ థియేటర్‌కు వెళ్ళు ప్రొఫెసర్ గారు కనపడగానే పుర్రెల దండతీసి ఆయన మెళ్ళో వేయి' అంతే! ఇక ఎనాటమీ పరీక్ష మొదటిసారే పాసవుతావు' అంది మంజు

తారుడ్రమ్ము లాటి శరీరాన్ని దొర్లించినట్లు ఎనాటమీ దియేటర్ లోకి పరుగెత్తుకు వస్తున్న సుదతిని చూచి లోపల స్టూడెంట్స్, లెక్చరర్లు హడలి పోయారు కొత్తగా చేరిన మెడికో సుశీల దడుచుకుని వేసిన కేకలకు హాలు దద్దరిల్లి పోయింది!

హడావిడి విని బయటకు వచ్చిన హరికృష్ణ గారి మెడలో పుర్రెల దండ వేసి దణ్ణం పెట్టింది సుదతి ఆకస్మికంగా జరిగిన యీ చర్యకు షాక్ తిన్నాడు ప్రొఫెసర్ హరికృష్ణ పొట్ట చెక్కలుగా నవ్వు వస్తున్నా బలవంతాన ఆపుకుంటూ నిలబడి పోయారు హాలులో స్టూడెంట్సు

"హు ఆర్ యు? కోపంగా అడిగాడు హరికృష్ణ

ఐయామ్ సుదతి!" అంటూ రొప్పుతూ సమాధానం చెప్పింది అప్పుడు పరీక్షగా చూచాడు ఆమెను 'వంటి నిండా ఎముకలు అలంకరించుకున్న రాక్షస యువతిలా వున్న ఆమెను చూడగానే నవ్వు ఆపుకోలేక పోయాడు ఎనాటమీ ప్రొఫెసర్ మెడలోని పుర్రెల హారాన్ని తీసి టేబిల్ మీద పడేసి వేరీజ్ దట్ నాటీ గర్ల్ మంజు భాషిణి!" అంటూ హాలంతా చూచాడాయన చిరునవ్వుతో!

ప్రొఫెసర్ గారు నవ్వడం చూచి బిగ బట్టుకుని వున్న స్టూడెంట్సందరూ ఒక్కసారే పగలబడి నవ్వసాగారు ఎవరో మంజును ముందుకు తోసారు

ఏమీ తెలియని అమాయకురాలిలా ముందు నుల్చుని 'సార్' అంటున్న మంజును చూడగానే ప్రొపెసర్ గారికి నవ్వు వచ్చింది

"గుడెపర్ ఫామెన్స్! కీపిటప్! అని ఆయన అనగానే హాలంతా చప్పట్లతో



## శుశ్రుత నర్సింగ్‌హోమ్

దద్దరిల్లింది

ఆ తర్వాత సుదతి మంజుకు నమ్మిన బంటులా వుండేది రాగింగ్ సమయంలో మంజు ఆమెకు ఎనాటమి ఫస్ట్‌చాన్సులో పాసవుతానని చెప్పిన విషయం గుర్తుండి హరికృష్ణ సుదతిని పాస్ చేసాడు కూడాను!

ఏమిటి! మరలా నీలో నువ్వే నవ్వుకుంటున్నావు?' అని అడిగింది మంజు రవిని

సుదతి గుర్తొచ్చింది అన్నాడు రవి మంజు వెంట రాగా ఆస్పత్రిలో వున్న ఇన్‌పేషెంట్లను చూడటానికి బయల్దేరాడు రవి ఒకోరోగి హిస్టరీ. జరుగుతున్న వైద్యం గురించి ఆమెకు చెబుతూ అమెరికాలో అదే రోగానికి ఎలా వైద్యం చేస్తారో ఆమె నడిగి తెలుసుకుంటూ రౌండ్స్ చేయసాగాడు రాకేష్ రూమ్ దగ్గర ఎక్కువ సమయం పట్టింది అతని తలకు దెబ్బ తగిలిన వైనం , మిడిల్ మెనిన్ జియల్ ఆర్టరీ నుండి రక్తస్రావం అవుతుంటే తను ఎలా అరికట్టిందీ ఆమెకు చెప్పాడు

యుడిడ్ ఎ ఫెంటాస్టిక్ జాబ్ అంటూ అతన్ని కంగ్రాచులేట్ చేసింది మంజు

రాకేష్ పరిస్థితిలో బాగా మార్పు వచ్చింది అతను స్పృహలోకి వచ్చి మనుష్యులను గుర్తుబట్ట కలుగుతున్నాడు అతని తల్లి, తండ్రి రవికి మరీ మరీ ధన్యవాదాలు చెప్పారు!

మూళ్ళు ఆరో నంబరు గదిలో అడుగు పెడుతుంటే రవి మనసు అప్రయత్నంగా తల్లడిల్లింది మంజు వచ్చిన దగ్గర్నుండి ఇందు సంగతి పూర్తిగా మరచిపోయాడు!

ఇందూ! ఇక్కడున్నావేం?"

మంజు అక్కా! నువ్వా! ఎప్పుడొచ్చావు?

ఈరోజే!

ఎన్నాళ్ళకు కనపడ్డావక్కా!

'ఇక రెండు నెలలపాటు ఇక్కడే వుంటా! రోజూ కనపడుతూనే వుంటా! అదిసరే! నువ్విక్కడ ఎందుకున్నావు? ఈయన ఎవరు?

ఈయన చంద్రహాస్ అని బి యే లో నా క్లాస్ మేట్! మంచి స్నేహితుడు! నా అన్న వారు లేరీయనకు! అల్సర్ నుండి రక్త స్రావం జరుగుతుంటే డాక్టరు రవి గారు వైద్యం చేస్తున్నారు

అలాగా! మరి నువ్విక్కడ వున్నట్టు అమ్మకు తెలుసా?

లేదన్నట్టు తలూపింది ఇందు! క్షణం సేపు ఆమె వంక ఆశ్చర్యంగా చూచింది మంజు ఇంతలో రవి రోగి విషయమై వివరాలు చెబుతుంటే శ్రద్ధగా వినసాగింది

'ఈయనకు ఇరవై రెండు ఇరవై మూడేండ్లకంటే లేవు! దాదాపు ఎనిమిది సంవత్సరాలుగా డుయొడినల్ అల్సర్‌తో బాధపడు తున్నాడు ఆరు నెలల నుంచి అడపాదడపా రక్తస్రావం జరుగుతున్నది! ఆపరేషన్ చెయించుకోవయ్యా అంటే భయం అని తప్పించుకు తిరుగుతున్నాడు పది రోజుల నాడు విపరీతంగా రక్తస్రావం అయితే వాళ్ళ టొబాకో కంపెనీలో పని చేసే వాళ్ళు తీసుకుని వచ్చి జేర్పించారు రక్తం ఎక్కించి సిమిటిడిన్ వాడేక రక్తస్రావం కట్టుకుంది! కాని వుండి వుడిగి ఒక్క సారిగా విపరీతంగా రక్తం పోతున్నది! అంతలోనే రక్తం కారడం ఆగిపోతున్నది!"

"అలాగా! అల్సర్ బెడెలో ఏదో రక్తనాళం పగిలి ఇలా జరుగుతుండి వుంటుంది వెంటనే ఆపరేషన్ చేయలేకపోయావా రవీ!

"నేను సరిగ్గా అలానే అనుకున్నాను! కాని ఏదీ ఈ మహానుభావుడు నాకు ఆపరేషన్ చేసే అవకాశం ఇచ్చేట్టు లేదు"

"అలాగా! ఏమయ్యా చంద్రహాస్? ఆపరేషన్ అంటే ఏమిటో తెలిసిపోని వూహించుకుని అనవసరంగా భయపడుతున్నావు. నువ్వు భయస్తుడివిలా







వున్నావు భయపడ్డప్పుడల్లా అల్సర్ నుండి రక్తం పోతున్నది

నువ్వు భయపడడం మానుకుంటే నీకు ఆపరేషన్ అవసరంలేదు' కాని భయపడడం నీ సహజ లక్షణం' భయపడకుండా వుద్రేకపడకుండా, వుండలేవు'

అందువల్ల నువ్వు ఇకముందు కూడా ప్రతి దానికీ భయపడుతూ వుండాలి అంటే వెంటనే చిన్న ఆపరేషన్ చేయించుకో'

ఏమంటావు?'

చంద్రహాస్ ముఖంలో చిరునవ్వు వెలిసింది ఇందు వంక చూచాడతను

ధైర్యంగా వుండి ఆపరేషన్ చేయించుకో అన్నట్లు తలూపిందామె

డాక్టర్ రవి వంక చూసాడు'

భయపడకు అన్నట్లు చేయి వూపాడు రవి' చంద్రహాస్ మనసులో ఆ క్షణంలో బయంకరమైన అంతస్సంఘర్షణ జరిగింది చివరకు వివేకం భయాన్ని జయించింది

"నేను ఆపరేషన్ చేయించుకుంటాను'" అన్నాడు తను అతని కంఠస్వరంలో వినిపిస్తున్న దృఢ నిర్ణయానికి డాక్టర్ రవి, ఇందు విస్తుపోయారు'

'మళ్ళీ అతను భయంతో బిగుసుకుపోయి ఆపరేషన్ చేయించుకోను అనే లోపల ధియేటర్ రెడీ చేసేయండి అంది మంజు

చంద్ర, ఇందు, రవి ఫకాలున నవ్వారు ధియేటర్ నర్సుని పిలిచి చంద్రకు ఆపరేషన్ చేయటానికి ఏర్పాట్లు చేయమని చెప్పాడు రవి

"థాంక్స్ అక్కా! నువ్వు ధైర్యం చెప్పబట్టి చంద్ర ఆపరేషన్ చేయించుకోటానికి వొప్పుకున్నాడు" అంది ఇందు

వార్డులలో వున్న మిగిలివున్న రోగులను చూచుకొంటూ వెళ్ళారు డాక్టర్ రవి, మంజు

చంద్రకు ఆపరేషన్ ఏర్పాట్లు చకచకా జరిగిపోయాయి ఆపరేషన్ ధియేటర్‌కు వెళ్ళేంత వరకు ఇందు చేయి పుచ్చుకు వదలలేదతను భయపడే పసి బాలుడు తల్లి చేయి వదలకుండా వున్నట్లు వుండిపోయాడతను'

చంద్రకు ధైర్యం చెబుతూ అతని వెంట ఆపరేషన్ ధియేటర్ దాకా వెళ్ళింది ఇందు సరిగ్గా ధియేటర్‌లోకి తీసుకు వెళ్ళబోయే ముందు కళ్ళ వెంట నీళ్ళు తిరుగుతుంటే నువ్వు నా వెంట లోపలకు రావాలి" అంటూ ఇందును దీనంగా అడిగాడు చంద్ర

"అలాగే చంద్రా' అని ఇందు అన్నాక అతని ముఖం సంతృప్తితో నిండిపోయింది

ఆపరేషన్ బల్ల మీద పడుకోబెట్టి ఎనెస్తటిస్టు నరంలోకి పెంటొథాల్ ఇంజక్షన్ చేస్తుంటే క్రమంగా స్పృహ కోల్పోతూ కూడా ఇందు వంకే చూస్తూ వున్నాడతను

సరిగ్గా పొట్ట మధ్యన బొడ్డు పై భాగంలో ఇన్‌సిషన్ ఇచ్చాడు రవి పదునైన స్కాల్‌పెల్ పొట్టపై చర్మం కండరాల పొరలను దోసకాయను రెండుగా చీల్చినట్లు చీల్చుకుపోయింది డుయొడినమ్ మొదటి విభాగంలో తెల్లగా వున్న పుండును మంజుకు చూపాడు రవి

రక్తం సీసాలోంచి ఒకో చుక్కా రక్తం చంద్ర నరంలోకి ఎక్కుతుంటే ఎనెస్తటిస్టు 'ప్రొసీడ్ ఆన్ అన్నట్లు తలూపాడు

డుయొడినమ్ మీద స్కాల్‌పెల్‌తో నిలువుగా కోసాడు రవి పేగు పొరలను తొలచుకు పోయిన పుండు అడుగున రక్తనాళం చిట్లిపోయి వున్నది అందు నుంచి వుండి వుడిగి రక్తస్రావం అయి చంద్ర ఇన్నాళ్ళు మృత్యుముఖం ముందుకు వెళ్ళి మరలా తిరిగి వస్తూ వున్నాడు సిల్క్‌తో రక్తస్రావం అవుతున్న ధమని కిరువైపులా కుట్టవేశాడు రవి టాప్ కట్టి వేసినట్లు రక్తస్రావం ఆగిపోయింది

నిలువుగా కోసిన డుయొడినమ్‌ను అడ్డంగా కుట్టవేశాడు అంతా అయాక ఆహారం పోవటానికి ఏమాత్రం అవరోధం ఏర్పడలేదని గ్రహించాక పొట్టకు సరిగా మధ్య బాగంలో అన్నవాహికకు దిగువ బాగాన ఉదరవితానం కింద వున్న పొరలను కత్తిరించి అన్నవాహికకు పైన కింద వున్న వేగస్ నర్వ్‌లను కత్తిరించి వేశాడు పొట్టపై పెరిటోనియమ్‌ను, రెక్టస్‌షీద్‌ను కుట్టి పై చర్మాన్ని కూడా కుట్టి ఎనస్థటిస్ట్ వంక చూచాడు రవి

వెల్‌డన్ డాక్టర్ రవి' అంతా నలభై నిముషాలు పట్టలేదు రోగి పరిస్థితి చాలా బాగుంది బతికినంత కాలం కడుపు నొప్పి బాధనుండి నివారణ పొందాడు ఇతని జీవిత కాలం నిన్ను తలచుకుంటూ వుంటాడు అన్నాడు ఎనస్థటిస్ట్

డాక్టర్ మంజు రవీ' నువ్వు ఎం బి బి యస్ అవగానే అమెరికా వచ్చి వున్నట్లయితే యీ పాటికి సర్జన్‌గా అక్కడ ఎంతో పేరు సంపాదించుకుని వుండేవాడివి' అంది

డాక్టర్ రవి అమెరికా వస్తే మరి ఇక్కడ నిర్భాగ్యులయిన మన దేశస్థులు ఏమవాలి? ఇప్పటికే మంచి మంచి డాక్టర్లలో ముప్పాతిక మువ్వీసం విదేశాలకు వెళ్ళిపోయారు' ఐ డోన్ట్ ఎగ్రీ విత్ యు డాక్టర్ మంజు అన్నాడు ఎనస్థటిస్టు

ఆపరేషన్ అయిన అయిదు నిముషాలలో నే తెలివిలోకి వచ్చాడు చంద్ర

చుట్టూ వున్నవారిని పరిశీలనగా చూడసాగాడు కాప్‌మాస్కులు వుండడంతో ఎవరెవరో పోల్చుకోలేక పోయాడు కాని ఇందు కళ్ళను చూడగానే గుర్తుపట్టినట్లు అతని ముఖంలో చిరునవ్వు వెలిసింది 'ఏం పర్వాలేదు అన్నట్లు సంతృప్తిగా చూస్తున్న ఇందు వంక చూసాక ధైర్యంగా కళ్ళు మూసుకున్నాడతను అదే సమయంలో ఎనెస్థటిస్టు అతనికి పెథిడిన్ ఇంజక్షన్ చేసాడు ఆపరేషన్ తాలూకు నొప్పి తెలియకుండా మగత కమ్ముకు వస్తుంటే తల్లి వొడిలాంటి నిద్రాదేవి అతన్ని సేద దీర్చింది

చూసావా ఇందూ' మీ చంద్ర ఇక అల్సర్ గురించి బయపడవలసిన పనిలేదు' ఆపరేషన్ ఆర్నెల్ల క్రితం చేయించుకుంటే ఎంతో బాగుండేది అతను

# కర్మయోగం

ఈ జీవన ప్రగతి క్షేత్రంలో
నిరర్థకంగా నిలచిపోకు
నిష్క్రియుడవై నిస్పృహతో కృంగిపోకు
అవిశ్రాంతంగా కర్తవ్యపాలన చేసే
మహోన్నత ప్రకృతి శక్తి తత్వాలను అవలోకించు
నిరంతం కార్యశీలతే
నిఖిల ప్రపంచ సృష్టికీ మూలం
మరచి పోకు నీ వొక మహోల్లాస బీజానివని
అదుగో నీలో నే ఉంది
అనంత విశ్వ విజ్ఞాన భాండాగారం
అందులోంచి వినవస్తోంది మనోహర గంధర్వగానం
అమృత మధు రాగం
ఆత్మ శక్తిని మేల్కొలిపావో
అఖండ జ్ఞాన జ్యోతినే సందర్శిస్తావు
తీవ్రకర్మ పరతత్వంలో
నిశ్చల ఏకాంతాన్ని అనుభూతం చేసుకోవాలి
మౌనములో నే
కర్మ పరతంత్రుడవు కావాలి
అదే కర్మ యోగ రహస్యం!

–పి. ఆదిలక్ష్మి

# శుశ్రుత నర్సింగ్‌హోమ్

అనవసరంగా బయపడి ప్రాణం మీదకు తెచ్చుకున్నాడు అంది మంజు

'పోనీలే అక్కా! ఇప్పటికైనా వొప్పుకున్నాడు! నువ్వలా నచ్చ చెప్పగానే చంద్రలో మార్పు వచ్చింది! ఇక చంద్రకేమీ ఫరవాలేదు గదా?

ఏమీ పరవాలేదు'

థాంక్స్! అంటూ వెళ్ళిపోయింది ఇందు ఇందు వెళ్ళిపోగానే రవి మంజూ కొంచెం కాఫీ తీసుకుందాం!, అంటూ తన రూమ్‌లోకి దారి తీసాడు అప్పటికే అక్కడ ఎనస్థటిస్ట్ శంకరరావు కూర్చుని వున్నాడు నర్సు కప్పులలో కాఫీ పోసి ఇచ్చింది

ఏమ్మా మంజూ! ఎన్నాళ్ళు శెలవుపెట్టి వచ్చావు? అని అడిగాడు డాక్టర్ శంకరరావు

బహుశ అమెరికా నుండి పిలుపు రాకపోతే మూడు నెలలుంటాను

అదేమిటమ్మా?

'అమెరికాలో డెట్రాయిట్ నగరంలో నలుగురు డాక్టర్లం కలసి గ్రూప్ ప్రాక్టీస్ మొదలెట్టాం! ఒక పీడియాట్రీషియన్ ఒక గైనికాలజిస్ట్ ఒక ఎనస్థటిస్ట్ నేను డ్రిమటాలజీ చూస్తుంటాను మాకు సర్జన్ ఒకడే దొరకలేదు! సర్జన్ కూడా మా గ్రూప్‌లో చేరితే మా యూనిట్‌కు నిండుదనం వస్తుంది! అన్ని రకాలయిన కేసులూ చూడడానికి వీలవుతుంది

నాకు ఇండియా తిరిగివెళ్ళి మనవాళ్ళందర్నీ చూడాలని అనిపించగానే మిగిలిన డాక్టర్లకు చెప్పాను వాళ్ళు నీ ఇష్టం వచ్చినంత కాలం శెలవు తీసుకో మంజూ! కాని ఇండియా నుండి వచ్చేప్పుడు మంచి సర్జన్‌ను వెంట తీసుకురా అన్నారు

సర్జన్‌ను తీసుకురావటం సంగతి ఏమోగాని ముందు గుంటూరు వచ్చి పాత స్నేహితులందరినీ చూచి వెనకటి విషయాలు గుర్తు చేసుకుంటూ సరదాగా కాలం గడపాలనిపించింది అందుకని ఇలా వచ్చాను నా క్లాస్‌మేట్స్‌లో డాక్టర్ రవి వొక్కడే గుంటూరులో వున్నాడు!

అందుకే వుదయం ఇంటికి రాగానే అమ్మతో కొంచెంసేపు మాట్లాడి వెంటనే రవి దగ్గరకు వచ్చేసాను వంటరిగా ఇంట్లో వుంటే ఏమీ తోచేట్లు అనిపించలేదు ఇక్కడ వున్నన్నాళ్ళూ డాక్టర్ రవి నర్సింగ్‌హోమ్‌లో పనిచేస్తూ వుందామని ఇప్పుడే అనుకున్నాను!

అలాగా! అయితే కొన్ని నెలల పాటు డాక్టర్ రవి నర్సింగ్‌హోమ్‌లో నిన్ను చూస్తుంటానన్న మాట అన్నాడు డాక్టర్ శంకరరావు ఆయన వయసులో మంజు రవిల కంటే పెద్దవాడు అందుకని చనువు తీసుకుని మాట్లాడడం అలవాటు ఆయనకు రవి, మంజు యం బి బి యస్ చదివేటప్పుడు వాళ్ళకు ఎనస్థియా క్లాసులు తీసేవాడాయన

శంకరరావు గారటు వెళ్ళగానే రవి మంజూ! నువ్వీ రోజు భోజనానికి మా ఇంటికి రావాలి" అన్నాడు

సారీ రవీ, పొద్దున అమ్మతో సరిగా మాట్లాడకుండా సరాసరి మీ ఇంటికి పరిగెత్తుకు వచ్చాను ఈ రోజు నువ్వే మా ఇంటికి రా! అమ్మ సంతోషిస్తుంది మనం కబుర్లు చెప్పుకుంటూ సరదాగా కాలం గడపవచ్చు

రేపు మీ ఇంట్లో భోంచేస్తాను! ఏం?'

అలాగే మంజూ! అంటూ వొక్కొక్కరే తరగకుండా వస్తున్న పేషెంట్లను చూడసాగాడు రవి అతన్ని, పేషెంట్లనూ పరిశీలనగా చూస్తూ కూర్చుండిపోయింది మంజు

మధ్యలో వొకసారి వెళ్ళి సీరియస్ కేసులన్నింటినీ చూచి వచ్చాడు రవి మల్లిక పరిస్థితి బాగా మెరుగయింది సరోజ ఆమెకు సుబ్బుల్ని డాక్టర్ మనీషా ఎలా పోలీస్ స్టేషన్‌లో పడవేయించిందీ చెప్పిందిలా వుంది వేట కుక్కలాంటి సుబ్బులు బెడద తీరిందన్న సంగతి వినగానే మల్లికకు ఎంతో సంతోషం కలిగింది

క్రితం రోజు భర్త, సుబ్బులు కలసి తనను పెడుతున్న ఆరళ్ళు భరించలేక విరక్తితో ఆత్మహత్యా ప్రయత్నం చేసినా, సరోజ అక్క ధైర్యం చెప్పడం, డాక్టర్ రవి ఎంతో శ్రద్ధతో తనకు వైద్యం చేయడం గమనించాక ఆమెకు మరలా జీవించాలన్న కోర్కె కొత్త చిగుళ్ళు తొడిగింది! డాక్టరు రవి 'ఎలా వుందమ్మా' అని అడగగానే 'బాగానే వున్నాను' అన్నట్లు తల వూపి కృతజ్ఞతా భావం నిండిన కళ్ళతో అతని వంక చూసింది

గర్భకోశం పగిలిపోయి హిస్టెరెక్టమీ ఆపరేషన్ చేసిన సుశీల పరిస్థితి చాలా బాగున్నది కాని ఆమెకింక సంతానం కలిగే అవకాశం లేదని తెలిసినట్లున్నది డాక్టర్ రవిని చూడగానే కళ్ళ నీరు పెట్టుకున్నది. కష్టపడి విపత్కర పరిస్థితిలో వున్న ఆమె ప్రాణాలు నిలిపాను అనే ఆలోచనలను తోసివేస్తూ 'ఈమె జీవితాంతం సంతానం కోసం కుమిలిపోతుంది' అనే ఆలోచన మనసులో అనిపించి బాధ కలిగింది

ఉదయం లారీ కింద పడినతని యక్స్‌రే తీసుకువచ్చారు నుజ్జయిన ఎముకలు పాటుకు వచ్చాయి నాలుగయిదు నెలల్లో అతను లేచి నడవగుల్గుతాడు!

రాకేష్ పరిస్థితి బాగా వున్నది! అతని తల్లీతండ్రీ డాక్టర్ రవికి మరీ మరీ కృతజ్ఞతలు తెల్పారు ఆఖరుకు చంద్ర గదిలో అడుగుపెట్టాడు రవి రక్తం డ్రిప్ పెట్టిన చంద్ర చేతిని పుచ్చుకుని కూర్చుని వున్న ఇందును చూడగానే అతని మనసు ఎందుకో క్షణంసేపు చివుక్కుమంది!

ఛ! ఇదేమిటి నా మనులో ఎవరి మీద ఎప్పుడూ ఇలా అసూయ కలుగలేదు! చావుబ్రతుకుల మధ్య కొట్టుకుంటున్న ఒక నిర్భాగ్యుడికి సేవ చేస్తున్న ఇందును చూడగానే చంద్ర మీద నాకు అసూయ కలుగుతున్నది అనుకున్నాడతను

అతని ఆలోచనలను చదివినట్లుగా ఇందు చంద్ర మంచానికి దూరంగా కుర్చీ జరుపుకున్నది!

చంద్ర పరిస్థితి చాలా బాగా వున్నది! అప్రయత్నంగా వాచి వంక

# ధర్మపథం



## సంఘాల ప్రయోజనం

జాతి మత విభేదాలు, ప్రాంతీయాభిమానాలు విస్మరించి, అందరూ ఒకే మానవ జాతికి చెందిన వారమనీ, అందరూ భారతీయులే అనీ భావించాలనే ప్రబోధాలు సర్వత్రా వినబడుతున్నవి పెద్దలు వేదికలపైకెక్కి ఉపన్యాసాలిస్తూనే ఉన్నారు సంకుచిత భావాలు ఉండరాదని ఒకప్రక్క ప్రచారం జరుగుతూ ఉన్నప్పటికీ, మరొకప్రక్క ప్రాంతీయ సంఘాలూ, కుల మత సంఘాలూ, ఆ కులాల్లోనూ అంతశ్శాఖా సంఘాలూ ఉంటూనే ఉన్నాయి జాతి సమైక్యతను కోరేవారు ఈ సంఘాలలోనూ ఉన్నారు ఇట్టి విభిన్న భావాలను సమన్వయ పరచడం ఎలాగు? విశాల హృదయం గల ఉదార స్వభావం గల కొందరు ప్రత్యేక సంఘాలకు సర్వవిధాలా ప్రోత్సాహ మివ్వడం జరుగుతున్నది ఇది సరియైన పద్ధతియేనా? – ఇట్టి సందేహాలు కలుగుతున్నవి

ప్రాంతీయ దురభిమానాలు మాని దేశ సమైక్యతకు కృషి చెయ్యవలసినదే! దురభిమానం ఉండకూడదు గాని, తమ ప్రాంతం పైని అభిమానం ఉండడం తప్పుకాదు అది అవసరం కూడాను ఉదార హృదయం గల దేశనాయకులందరూ పొరుగు ప్రాంతాలతో తగాదాలు పడుతూ ఉండడం మనం చూస్తున్నాము అలా తగాదాలు లేకుండా సులభ మార్గాన వాటిని పరిష్కరించుకొన్నప్పుడే దేశ సమైక్యతకు తగిన దోహదం చేసినట్లవుతుంది

తమ ప్రాంతాల అభివృద్ధికి కృషి చేసినట్లే తమ సంఘం యొక్క అభివృద్ధికి అన్ని విధాలా కృషి జరపడంలో తప్పులేదు స్వయం తీర్వా పరాం స్తారయతి" అనే లోకోక్తి ప్రసిద్ధంగా ఉన్నదే కదా! తమ వారిని ఉపేక్షించి, ఇతరులకు పాటుపడడం సంఘం అసంతృప్తికి కారణమవుతుంది ఇతరులతో విరోధం పెట్టుకోకుండా స్నేహాన్ని పెంపొందించుకొనడం ఎంతో అవసరం ఇట్టి అవసరాలకు సంఘాల వల్ల కొంత ప్రయోజనం ఉంటుంది అట్టివి సమైక్యతకు విరుద్ధాలు కావు అట్టి సంఘాలను సరియైన మార్గంలో నడిపించడం, నడిపించే నాయకుల బాధ్యత! ఆ బాధ్యతను విస్మరిస్తే – అట్టి సంఘాలను నడపకుండా ఉండడం మేలు!

సమైక్యతకు విభిన్న సంఘాలు అడ్డురావు

**–బులుసు వేంకట రమణయ్య**

---

చూసుకున్నాడు రవి రెండు గంటలయింది 'ఇందూ భోంచేసావా? అని అడిగాడు రవి

సావిత్రమ్మగారు పన్నెండింటికే కారియర్ పంపించారు ఇందాక భోంచేసాను

చంద్రకేం ఫరవాలేదు గదా!'

'ఇక బహుశ అతని జీవితంలో అల్సర్ పెయిన్ రాదు ఆ విషయమై నిశ్చింతగా వుండొచ్చు అన్నాడు రవి

'ఇంతవరకు అతని జీవితం కల్లోల సాగరంలో కొట్టుమిట్టాడే నావలాగా వుండిపోయింది ఇకముందైనా అతని జీవిత నావ వొడిదుడుకులు లేకుండా సాగిపోతే బాగుండును

రవి వులికిపడి ఇందు వంక చూచాడు ఇందు మాటలలో వ్యక్తమవుతున్నది జాలీ, అభిమానమూనా? ఆమెమాటలలో చంద్ర అంటే ప్రేమ వ్యక్తం కావడం లేదు కదా?

ఏమిటి ఇలా ఇందు విషయం వచ్చేసరికి నా మనసు వశం తప్పిపోతున్నది? అనుకుంటూ తన రూమ్‌కు వెళ్ళాడతను

మంజూ ఇక ఇంటికి వెళ్దాం అన్నాడతను

"ఏం రవీ? అప్పుడే మర్చిపోయావా? ఇవ్వాళ నువ్వు మా ఇంటికి భోజనానికి రావాలి!"

ఓ మర్చిపోయాను! అలాగే వెళ్దాం

(ఇంకా ఉంది)

## ఎన్ ఎన్ హొన్నూరు

★ మరణించిన ఆత్మలు బ్రతికివున్న శరీరంలోకి ఆవహిస్తాయంటారు ఇది నిజమేనా?

● నాకెలా తెలుస్తుంది? నన్నే ఆత్మ ఆవహించినట్టు లేదింకా (లేక ఆవహించిందా? కొంపదీసి!)

★ దేవుడు సృష్టించిన మనిషి కంటే మనిషి సృష్టించిన డబ్బుకి ఈ కాలంలో ప్రాధాన్యత యిస్తున్నారు అప్పుడిక మానవుడికి దానవుడికి బేధమేమిటి?

● లేదు అది డ్యూయెల్ రోల్

## పి ఎన్. ఎస్ బి హైదరాబాదు

★ మనసులు కలిసి మనువునాటికి తల్లి దండ్రుల పంతాలవల్ల కలవలేకపోతున్న దం తీన హృదయాలు కలత చెందడం నిత్యం గవ న్నాం కదా? మరి ఎవర్నీ లెక్క చేయకుండా సుదూర తీరాలకు పోయి బ్రతక కల్గుతున్న జంటలు కేవలం సినిమా కథలకే పరిమితం అయిపోతున్నాయి నిజ జీవితంలో సాధ్యపడడం ఎన్నడంటారు?

● ఆర్థిక స్వాతంత్ర్యం వున్నప్పుడు పిరికితనం లేనప్పుడు – సాధ్యం ఇతరులపై ఆధారపడే వాళ్లకి ప్రేమాలేదు, స్వేచ్ఛా లేదు

## జి. వి కె. ఆర్ సికింద్రాబాదు.

★ శ్రీమతికి కుమారికి మధ్య తేడా ఏమిటి?

● మానే!

## డి బి. హెచ్ పాపరాజుపల్లె

★ దేవుడికే ఎందుకు టెంకాయ కొడతారు?

● భక్తి ఆవేశంలో తల పగులకొట్టుకోలేం కదా? అందుకని!



# ప్రశ్నావళి

కె. రామలక్ష్మి

## ఎస్. ఎల్. పి వైజాగ్

★ మీలాంటి సలహాలిచ్చే సూరమ్మలని చాలామందిని చూశాం మీరు ఆడదైనందుకు సిగ్గుపడుతున్నాం

● అలాగా? నే నాడదాన్నని ఎవరు చెప్పారు? ముందు మనిషిని – తరువాతే ఆడదాన్ని అంచేత సిగ్గుపడండి ఫరవాలేదు!

## ఎస్. ఎ. కావలి

★ నేను మగవాడిని అయినా మగవాడినే విమర్శిస్తున్నా మీ యొక్క ప్రశ్నావళి చదవాలని వుంటుంది ఆ ఆకర్షణ ఏమిటో అర్థం కాదంటేదు

● అదే గమ్మత్తు నే రాసే వాట్లో నిజం తప్ప యింకోటి లేదు కనుక – యిష్టంవున్నా లేకున్నా – మీరు చదవాలని అనుకుంటారు

## సి హెచ్. జి. టిట్లాఘర్

★ కొంతమంది ఆడాళ్ళు కొన్ని సమయాలలో ఏ పాపం చెయ్యకుండానే మగవారికి బలి అయిపోతూ వుంటారు అప్పుడూ ఆమెనే నిందిస్తారంతా ఏమిటీ అన్యాయం?

● అది లోకనీతి మెత్తనివాడిని మొత్తు బుద్ధి అన్న మాట ఎప్పుడూ వినలేదా?

## పి. ఎమ్ పి. విశాఖపట్నం

★ మీరు స్వాభావికంగా చాలా మంచివారని మీతో పరిచయం వున్నవారు చెప్పగా విన్నాను కాని ప్రశ్నావళిలో మీరు (కోపంగా) సరిగా సమాధానాలివ్వరని కొందరి అభిప్రాయం ఎందుచేత?

● మీ ప్రశ్న వింటే గుడ్డివాళ్ళు ఏనుగు కథ జ్ఞాపకం వస్తుంది నేను మంచిదాన్నే! కాని ఎవరి స్వభావాన్ని పట్టి వాళ్ళు – నా సమాధానాలు చదువుతారు – అంచేత ఒక్కొక్కరికి ఒక్కొక్కలాగా అనిపించడం సహజమే కద

★ తల్లి గుణవతి తెలివి కలది అయితే బిడ్డలు అదృష్టవంతులు అంటాను (ముఖ్యంగా మీ పిల్లలు) మీరేమంటారు?

● తల్లి చదువుసంధ్యలకీ పిల్లల అదృష్టాలకీ ఏం సంబంధం లేదనడానికి నిదర్శన నేనే! మా అమ్మ పత్రికల్లో ప్రకటన బొమ్మలే చూసేది!!

## ఎస్ ఎమ్. అనంతపురం

★ అత్తా కోడళ్ల పోట్లాటలపై మీ అభిప్రాయం ఏమిటి?

● సిల్లీగా వుంటాయి తల్లిగా ఆవిడా పెళ్లాంగా యీవిడా ప్రేమించేది ఒక వ్యక్తినే కద! వారిలా దెబ్బలాడుకున్నాక – సిగ్గెందుకు వేయదు? నా కర్థంకాదు అత్తా కోడళ్ళమన్న విషయం మరిచిపోతే – హాయిగానే వుండొచ్చు

## పి. ఎస్ బి ఖుర్దారోడ్డు

★ నేను కట్నం తీసుకోకుండా పెళ్లి చేసుకోవాలని అనుకుంటున్నాను మరి నాకు ఇద్దరు చెల్లెళ్ళు వున్నారు వారికి కట్నం తీసుకోని, భర్తలు వస్తారని నమ్మకం ఏమిటి?

● వాళ్ల పెళ్లిళ్ళు చేసేదాకా – మీరు ఆగడం

## ఎం. ఎస్ వాల్తేరు

★ ఒక అవివాహిత స్త్రీతో నాకు శారీరకంగా, మానసికంగా సుమారు పది సంవత్సరాల నుంచి సంబంధం వుంది మాది కులాంతరం ఆమెకిప్పుడు పెళ్లి చేయాలని చూస్తున్నారు

● మీరు హాయిగా చేతులు ముడుచుకుని కూర్చోండి! పది సంవత్సరాల కాలం కలిసి వున్న స్త్రీ భార్య కాక ఏమవుతుందని – మీ భావన? మీరు పెళ్లి చేసుకోకపోయినా' – మీది పెళ్లే 'కుడి యెడమ' 'కలిసి వుండడం' – కళ్యాణమే కాస్త పౌరుషం ప్రదర్శిస్తే – చెప్పుకుందుకు సిగ్గుగా వుండదు – ఆ పది సంవత్సరాల శారీరక సంబంధానికి! ☐



## మీరు ఎంతో వివేకవంతమైన పథకానికి ఎందుకు పెట్టుబడి పెట్టాలి?

**14.25%**

యూనిట్స్ ప్రతి సంవత్సరం లాభాలు పెంచుతూ వస్తున్నాయి.

# UNITS

## 1984-1985 లకు అది 14.25%

మీ పెట్టుబడికి అధిక లాభం చేకూరడమే కాకుండా మిమ్మల్ని జూలై 31 వ తేదీ లోపలే యూనిట్స్ కొనమనడానికి మరో కారణం వుంది ప్రత్యేకమైన తక్కువ ధరకు, కేవలం రూ 12.75 లకే లభిస్తున్నాయి

యూనిట్స్ అత్యధికమైన లాభాలు అందిస్తున్నాయి. మీకు అత్యవసరంగా డబ్బు అవసరమైనప్పుడు, తేలికగా సమయానికి డబ్బు తీసుకోగలగటం, పన్నులపై ప్రత్యేకమైన కన్సెషన్‌లు, మీ పెట్టుబడికి ఖచ్చితమైన భద్రత వుంది

అంతేకాదు యూనిట్స్ పొందడం చాలా తేలిక మీరు చేయవలసిందల్లా, మా కార్యాలయాలకుగానీ, ప్రముఖ బ్యాంకులకుగానీ, ముఖ్య తంతి తపాలా ఆఫీసులకుగానీ వెళ్లండి లేదా మా ముఖ్య ప్రతినిధులనో, ఏజెంట్లనో సంప్రదించండి!

జ్ఞాపకం వుంచుకోండి! 15 లక్షల మందికి పైగా పెట్టుబడిదారులు యూనిట్స్‌కు పెట్టుబడి పెట్టారు. ఇప్పుడు పెట్టుబడి పెట్టవసిలిన వంతు మీదే!



**యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా**

హెచ్. ఓ. బొంబాయి-20

(ఎ పబ్లిక్ సెక్టర్ ఫైనాన్సియల్ ఇన్‌స్టిట్యూషన్)

ప్రాంతీయ కార్యాలయం:
"రెజీనా మ్యాన్‌షన్" 46 సెకెండ్‌లేన్ బీచ్, మద్రాసు-600 001
టెలిఫోన్ నంబరు: 27433/24146

ఆంధ్రప్రదేశ్ కార్యాలయం 27-11-6B, మేరీ స్ట్రీట్
గవర్నర్‌పేట, విజయవాడ-520002 టెలిఫోన్ నంబరు 63964

**మీ పొదుపులు ధనాన్ని - యూనిట్ యూనిట్‌గా పెరగనివ్వండి!**

---

ఆంధ్రప్రదేశ్‌లోని ముఖ్య ప్రతినిధులు

శ్రీ కె. బి. తిలక్, గుంటూరు, ఫోన్ · 23439 (ఆ). శ్రీ వై. సోమసుందరరావు, తణుకు, ఫోన్ 106 (ఆ)
శ్రీ సి. నారాయణస్వామి, 15-5-4, క్రిష్ణనగర్, వైజాగ్. శ్రీ యస్. వీరరాఘవులు, గుంతకల్లు, ఫోన్: 579 (ఆ).
శ్రీ ఎ. ఆర్. కృష్ణారెడ్డి, కడప, ఫోన్ 2766 పి.పి. (ఆ) శ్రీ కె. వి. కోటి వీరయ్య, తిరుపతి, ఫోన్ 3004 (ఆ)

Sista's - UTI 328 85 TE A

# మలుపు

ఇందూ రమణ

డియర్ రవిశంకర్!

బాగున్నావా? అయినా, ఏం బాగులే! మన బ్రతుకు ఎలా ముగుస్తుందోనని భయంగా ఉంది

నిన్న జరగరానిది జరిగింది మనం వూహించని విషయం! మా నాన్నగారు మనల్ని ఆశీర్వదిస్తారనుకున్నాం కానీ ?

నిన్న మా నాన్నగారు నా పెళ్ళి గురించి మా అమ్మతో ఏదో అన్నారు. మా ఒరియా అబ్బాయి ఎవరో ఎక్కడో . పన్నెస్తున్నాడట ఆయన్ని చూడ్డానికి వెళ్లానని చాలా బావున్నాడని మంచివాడని తనని బాగా మర్యాద చేసాడని మా నాన్నగారు తెగ మెచ్చేసుకుంటున్నారు

ఏదో నవల చదువుతూ కూర్చున్న నేను కుతూహలం అణుచుకోలేక తలుపు చాటున నక్కి అంతా విన్నాను

విషయం విన్నాక షాక్ తిన్నాను

మనసు బాగులేక ఆ మాటల్ని తట్టుకోలేక బయంతో వ్రాస్తున్నానీ ఉత్తరం నాకు ఆ అబ్బాయితో పెళ్ళి కుదిర్చేస్తారట తాంబూలాలు తీసేసుకుందామని అనుకుంటున్నారు

ఆ కుర్రాడికి నా ఫోటో నచ్చిందట ఇక అమ్మాయిని చూడనక్కర్లేదని అనేసాడట రేపో ఎల్లుండో వాళ్ళ వాళ్ళు మా ఇంటికి వస్తారట

ఏం చేయను?

నీ జవాబు కోసం ఎదురు చూస్తూ

నీ ప్రియమైన 'అరుంధతి'

ఉత్తరాన్ని పదే పదే చదివాడు రవిశంకర్

అక్షరాలు ముత్యాల్లా ఉన్నాయి నక్షత్రాల్లా మెరుస్తున్నాయి గాబరాగా వ్రాసినట్టుంది బాధతో వ్రాసినట్టుంది కొన్ని . అక్షరాలు అలుక్కుపోయినాయి

మళ్లా – ఉత్తరాన్ని చదివాడు రవిశంకర్

పాపం! అరుంధతి ఎంత వ్యధతో వ్రాసిందో?

ఇప్పుడు తనేం చేయాలి?

ఆలోచిస్తూ కళ్ళు మూసుకున్నాడు

అర్ధరాత్రి!

గోడ గడియారం రెండు గంటలు కొట్టింది

రవిశంకర్ ఉలిక్కిపడ్డాడు

వరండాలో వాలు కుర్చీలో జారగిలబడి నిద్ర రాక ఆలోచిస్తూ కూర్చున్నాడు

లోపల గదిలో నిద్ర పట్టక నిమిషాలు లెక్కపెడుతూ కళ్ళు మూసుకుని ఉంది అతని తల్లి

ఆ మంచం ప్రక్కన క్రింద చాప మీద వెళ్లకిలా పడుక్కొని ఉంది అతని చెల్లి

తల్లి వేపు చూసాడు రవిశంకర్

రేపో మాపో రాలిపోయే పండుటాకుల్లా ఉంది ఆమె

మాయని గాయాన్ని మోస్తూ – భయంకరమైన నరకాన్ని భరిస్తూ – క్షణాలను యుగాలుగా లెక్కపెడుతూ బ్రతుకుతోంది అతని తల్లి

స్త్రీ యోనిలో కేన్సర్ గడ్డ

కరెంటు పెట్టించినా ఆమెకి విముక్తి లభించలేదు

ఆర్నెళ్ళు ఆసుపత్రులన్ని త్రిప్పినా లాభం లేకపోయింది

డాక్టర్లెందరు ఎన్ని విధాలుగా తలలు బద్దలు చేసుకున్నా ఫలితం దక్కలేదు ఇక ఆమెకు ప్రాణగండం తప్పదని తేల్చేసారు

రోజులు లెక్క పెట్టమని చెప్పారు డాక్టర్లు

ఆ రోజు –

ఆ వారం రోజులూ ఎంత బాధపడ్డాడు తను

కన్నతల్లి కళ్ల ముందు కన్ను మూయడానికి సిద్ధంగా – కేన్సర్ రాకాసికి బలైపోబోతోందని తెలిసి ఎలా కుమిలిపోయాడు

ఆ వారం తర్వాత కొంచెం కొంచెంగా మనసు కుదుటపడింది

ఇప్పుడు –

తల్లి ఎంత వేగంగా చచ్చిపోతే అంత మంచిదనిపిస్తోంది ఆమె పడే వేదన చూడలేక ఆమె భరిస్తున్న నరకయాతన చూసి తట్టుకోలేక ఈ క్షణం చచ్చిపోతే ఎంత బావున్ను!

మంచం మీద బాధతో మెలికలు తిరుగుతుంటే ఎవరూ ఏమీ చేయలేక దీనంగా చూడటం తప్ప వేరే ఏమీ చేతకాక – నిర్వికారంగా నిశ్చేష్టులై నిల్చోవడం తప్పా తామేం చేయగలరు?

ఎన్నాళ్ళూ మందులు వాడినా ఏం ప్రయోజనం?

తాత్కాలిక ఉపశమనం కోసం వేలకు వేలు అప్పు చేసి ఖర్చు చేయవలసివస్తోంది

తాను సంపాదిస్తున్న అయిదొందలూ ఏ మూలకి వస్తాయి తాత తండ్రులు సంపాదించిన ఇంటి మీద ఎవరైనా ఎన్ని వేలు ఇవ్వగలరు?

లైటు ఆర్పేసి వాలు కుర్చీలో అలాగే కళ్ళు మూసుకుని పడుకున్నాడు

కానీ, అతని కళ్లల్లో అరుందతి కదుల్తూనే ఉంది ఆమె వ్రాసిన ఉత్తరం అతని మెదడులో మెదుల్తూనే ఉంది

ఏం చేయడం?

ఇటు అరుంధతి – అటు అమ్మా చెల్లి

అరుందతి ప్రేమను తను వదులుకోగలడా? ,

చెల్లెలికి పెళ్ళి చేసి ఆ తర్వాత తను పెళ్ళి చేసుకోవాలనుకున్నాడు కానీ, ఇప్పుడు పరిస్థితి ఇలా విషమించింది

ఈ సమస్యని ఎలా పరిష్కరించడం?

తల్లి చూస్తే ఇలా ఉంది

అమ్మ ఈ క్షణంలో చచ్చిపోతే ఎంత బావున్ను

ఆ ఆలోచనకు రవిశంకర్ ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు ఎటు పయుగులెడుతుందో తెలీని మెదడుని – మనసుని అదీనంలోకి తెచ్చుకున్నాడు

ఇదేవిటి ఇలా ఆలోచిస్తున్నాడు? తల్లిని బ్రతికించుకోలేకపోయినా నాలుగు వారాలైనా తన కళ్ల ముందు ఉంటే చాలన్న ఉద్దేశ్యంతో కద్దూ – వేలకు వేలు అప్పు చేసి మందులు వాడుతున్నాడు

కానీ, తను ఇలా ఆలోచిస్తున్నాడేవిటి?

అరుంధతి!

అందని ఆకాశంలో కనీ కనిపించకుండా మెరిసే అరుందతి . ఎందరి గుండెల్లోనో ఆశగా మాత్రమే మెరిసే అరుంధతి తనని కటాక్షించి కరుణించి కవ్వించి మరీ తన హృదయం మీద వాలింది

ఎన్నో జన్మల అదృష్టంగా ఆ రోజు భావించాడు

ఆ అరుంధతిని ఈ రోజు కులం కాలనాగు కాటేయాలని కూర్చుంది

ఎలా రక్షించడం?

తననుండి అరుందతిని వేరు చేయబోతోంది విధి

ఎలా ఎదిరించటం?

తల్లి చావు ఖాయమైంది

చెల్లి పెళ్ళి కూడా ఖాయమైతే ఎంత బావున్ను?!

చీ! తన ఆలోచన్లో ఎక్కడో ఏదో అపశృతి పలుకుతోంది

తల్లి చావుతో తనకి విముక్తా?

రవిశంకర్ ఆలోచన్లు గజిబిజిగా సాగుతున్నాయి

అరుందతిని పరాయి మగాడితో ఊహించగలడా?

తేనెలొలికే ఆమె అధరాలని తను తప్ప ఎవరైనా చుంబిస్తే తను భరించగలడా? తల్లితోనే తనూ 'పాడె' ఎక్కడూ?!

ఆ వూహే ఊరి బిగిస్తోంది తన బ్రతుక్కి!

భగవాన్! ఏమిటి ఈ సమస్యకు పరిష్కారం!

తల్లి సంగతి సరేసరి మరి చెల్లో!

తను అరుంధతిని లేవదీసుకుపోతే, చెల్లి గతేం

కాను?

పరి పరి విధాలా ఆలోచిస్తున్నాడు రవిశంకర్

అప్పుడు - రవిశంకర్ అతని ప్రాణమిత్రుడు గుర్తుకొచ్చాడు ఆ తర్వాత తన నిర్ణయాన్ని మననం చేసుకున్నాడు

గోడ గడియారం మూడు గంటలు కొట్టింది

వాలు కుర్చీలోంచి లేచి చొక్కా తొడుక్కున్నాడు రవిశంకర్

ఆ వీదిలోనే చివర్లో ఉన్న కుమార్ ఇంటికి బయలుదేరాడు

బైట వరండా అరుగు మీద ఒక్కడే ఒంటరిగా పడుకుని ఉన్న కుమార్‌ని తట్టి లేపాడు రవిశంకర్

కుమార్ చటుక్కున లేచి కూర్చుని కళ్ళు నులుముకొని చూసాడు మిత్రుడ్ని

ఏరా?' ఆశ్చర్యంగా అన్నాడు కుమార్

పనుందిరా' రా' అని వీది లైటు క్రిందకు తీసుకువెళ్ళి అరుందతి వ్రాసిన ఉత్తరం కుమార్‌కు చూపించాడు రవిశంకర్

ఆతృతగా ఉత్తరం చదివాడు కుమార్ ఏం' చెస్తావ్' ప్రశ్నించాడు

అందుకేరా' ని సహాయం కోసం వచ్చాను చెప్పు'

నేనూ అరుందతి ఈ వూరు వదిలి వెళ్ళిపోతాం ఎక్కడో ఏదో గుళ్ళో పెళ్ళి చేసుకొని ఆ వెంటనే నీకు లెటర్ వ్రాస్తాను ఇక్కడి పరిస్థితులు నాకు వివరంగా తెలియజేస్తూ ఉండు ఎప్పటికప్పుడు మా ఇంటికి వెళ్ళి మా ఇంటి పరిస్థితి నాకు కబురు చెయ్యి

ఓ నెల్లాళ్ళు పోయాక ఇద్దరం కలిసి ఊర్లోకి వస్తాం ఈ నెల్లాల్లూ మా వాళ్ళకి నువ్వే దిక్కు అరుంధతి వాళ్ళ ఇంట్లో వాళ్ళు నిన్ను మా గురించి



అడగితే తెలీదని చెప్పు ఆఫీసుకు నెల రోజులు సెలవుపెడతాను

మా అమ్మకు ఏదైనా జరిగితే టెలిగ్రాం ఇవ్వు'

తన నిర్ణయాన్ని తెలియజేసాడు రవిశంకర్

బాగా ఆలోచించరా'' కుమార్ అన్నాడు

ఆలోచించానా' పోయె తల్లిని కాపాడుకోలేక పోయినా చేజారిపోతున్న నా అదృష్టాన్ని అరుందతిని మాత్రం వదులుకోలేను చెల్లి సంగతంటావా'' తర్వాత కాలం అనుకూలిస్తే కట్నం వేల మీదైనా అనుకూలుడైన వ్యక్తిని చూసి పెళ్ళి చేస్తాను చెప్పాడు రవిశంకర్

నీ ఇష్టం నేనీ విషయంలో ఎటువంటి సలహా ఇవ్వలేను అన్నాడు కుమార్

కుమార్‌కి తన నిర్ణయం తెలిపాక గాని రవిశంకర్‌కి నిద్ర పట్టలేదు

ఇంటికి చేరుకోగానే వాలుకుర్చీలో వాలిపోయాడు రవిశంకర్

ఆ మర్నాడు –

ఆఫీసుకు సెలవు పెట్టి వచ్చేసాడు తల్లి మందులకోసం అప్పు చేసి దాచిన డబ్బులో సగం తీసి మిగతా సగం చెల్లి చేతికిచ్చాడు దాచమని

నాకెందుకన్నయ్యా' ఆశ్చర్యంగా అంది చెల్లి

నీ దగ్గరుంచమ్మా' అవసరానికి నేనుంటానో''! ఉండనో?!

# సంఘం పోకడ!

**మెతకగా కనబడితే**
**ఉతకాలని చూస్తుంది సంఘం**
**ఘటికుడని తెలిస్తే**
**ఘనకీర్తిని చాటుతుంది లోకం!**

**—యస్. యస్. రెడ్డి**

# మలుపు

చెల్లిని ఎలాగో మభ్యపెట్టగలిగాడు రవిశంకర్

అన్నాచెల్లెల్ల మాటలు వింది రవిశంకర్ తల్లి

ఒరేయ్ రవీ! బాబూ! రవీ! ఇలారా! నాయనా! ఏదో చెప్పాలని నానా అవస్థపడి పిలవలేక పిలవగలిగింది ఆమె

ఆర్నెళ్ళుగా తిండిలేక బల్లిలా మంచాన్ని కరుచుకొని కొనవూపిరితో కొట్టుకుంటున్న గుండెలో నుండి కీచుగా లో గొంతుతో తల్లి పిలిచేసరికి రవిశంకర్ ఉలిక్కిపడ్డాడు క్షణం తొట్రుపడ్డాడు

తల్లి మంచం దగ్గరకు వెళ్లాడు

కొత్తవాళ్లెవరైనా అయితే ఆమెని చూడ్డానికి వచ్చినా ఆ గదిని ఆక్రమించుకున్న దుర్గంధాన్ని భరించలేక బయపడి దూరంగా వెళ్ళిపోతారు

రవిశంకర్ కళ్లకి తల్లే కన్పిస్తోంది

కన్నకొడుకును రెప్ప ఎత్తి కూడా చూడలేని దీన పరిస్థితిలో ఉన్న ఆ తల్లి నీర్సంగా మూలిగి అలాగే కళ్ళు మూసుకుంది

బట్టలు తనకి ముఖ్యంగా అవసరం అనుకున్న వస్తువులు బ్యాగ్‌లోనూ వేరే ఇంకో సూట్‌కేస్‌లోనూ సర్దుకున్నాడు రవిశంకర్

సాయంత్రం ఓ కుర్రాడితో తమ ఇంటికి ఆరిల్లు అవతల వున్న ఇంట్లో ఉంటున్న అరుంధతికి ఏకాంతంగా ఉన్నప్పుడు ఇమ్మని చెప్పి ఉత్తరం వ్రాసి పంపించాడు ఆ కుర్రాడికి అలా వాళ్ల ఉత్తరాలు మోయడం అలవాటే!

రాత్రి వరకూ ఆతృతగానే గడిపాడు రవిశంకర్

పరిస్థితులు ఎలా విషమిస్తాయోనని భయంగానే వుంది రవిశంకర్‌కి

భోజనం చేసి పడుకున్నాడు పడుకుంటున్నప్పుడు చెల్లికి కన్పించకుండా బ్యాగూ, సూట్‌కేస్ తీసుకువచ్చి మంచం క్రింద దాచాడు రవిశంకర్

అర్ధరాత్రి!

గోడ గడియారం పండ్రెండు గంటలు కొట్టగానే మంచం మీద నుండి లేచాడు రవిశంకర్ ఉదయం

రవిశంకర్ చెప్పిన ప్రకారం కుమార్ గోపాలపట్నం వెళ్ళి ఆటో తీసుకువచ్చాడు ఆ వూర్లో ఆటోలు దొరకవు

రవిశంకర్ మంచం మీద నుండి లేచి బట్టలు వేసుకునేసరికి వీధి చివర ఆటో ఆగిన శబ్దం విన్పించింది ఆటో దగ్గరకు పరుగు పరుగున వెళ్ళాడు కుమార్ ఎదురొచ్చాడు రవిశంకర్‌కు

బ్యాగూ సూట్‌కేస్ ఆటోలో పెట్టాడు రవిశంకర్

అరుందతికి వ్రాసిన ఉత్తరంలో రాత్రి పండ్రెండు అయేసరికి వీధి చివరకు రమ్మని వ్రాసాడు తను కానీ, ఇంకా రాదేం? రవిశంకర్ ఆలోచిస్తున్నాడు

ఏదో కీడు జరగబోతోందనిపించింది రవిశంకర్‌కి

కుమార్‌కి చెప్పి అరుంధతి వాళ్ళింటికి బయలుదేరాడు రవిశంకర్

ఇంటి చుట్టూ ఎత్తైన ప్రహరీ ఇంటి ముందు రకకరకాల పూలమొక్కలు లక్కపిడత బోర్లించినట్టూ ఉందా పెంకుటిల్లు

ఇంటి ముందు వాకిట్లో నిలబడి ఉంది అరుందతి

తన రాక కోసమే ఎదురు చూస్తోన్నట్టుంది

గేటు శబ్దం కాకుండా తీసి నెమ్మది నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ అరుంధతి దగ్గరకు వెళ్ళాడు రవిశంకర్

కిటికీ ప్రక్కన నిలబడి అరుంధతి తండ్రి అంతా గమనిస్తున్నాడన్న విషయం పాపం రవిశంకర్‌కు తెలీదు

అరుంధతి కళ్ళల్లోకి తీక్షణం చూసాడు రవిశంకర్

"అరుంధతి! రా! వేగంగా రా! రవిశంకర్ నెమ్మదిగా నోట్లోనే సణుగుతున్నట్టూ అన్నాడు రవిశంకర్

**అరుంధతి మాట్లాడలేదు**

**దగ్గరగా వెళ్ళి** చెయ్యిపుచ్చుకొని "రమ్మన్నట్టు" **లాగాడు రవిశంకర్.**

**ఆ క్షణం –!**

**అరుంధతి కళ్ళల్లోకి చూసిన రవిశంకర్ ఉలిక్కిపడ్డాడు.**

**ఆమె కళ్ళల్లో అతనికి తెలీని ఏదో మహత్తు** అప్రయత్నంగానే పట్టుకున్న చేతిని వదిలేసాడు

అదే చెయ్యి గాల్లోకి లేచి రవిశంకర్ చెంపని తాకింది

రవిశంకర్ నిశ్చేష్టుడై పోయాడు

ఏవిఁటి? అరుంధతికి దెయ్యంగాని పట్టలేదు కదా! తనని . తనని కొట్టడమా? అనురాగంతో తన బుగ్గల్ని ముద్దులతో ముంచెత్తే అరుంధతి–?

'అరుంధతీ! నీకేం పిచ్చెక్కలేదు కదా! కోపంగానే అన్నాడు

పిచ్చి! పిచ్చి నాకు కాదు నీకు ఛీఁ! ఇంతటి నీచుడవని నేను గ్రహించలేదు నిన్ను నమ్ముకుంటే నట్టేట్లో మునగడమే అన్న నా తండ్రిని ఎదిరించి– నువ్వు ఉన్నతుడివని వాదించాను

మనిషివని మానవత్వం మూర్తీభవించిన మహానుభావుడవని నీ గురించి గొప్పగా కీర్తించాను

కానీ, నువ్వు నయవంచకుడివి. నర రూప రాక్షసుడివి నవమాసాలు కని పెంచిన తల్లిన్నే వదిలేసి వచ్చిన మాతృద్రోహివి.

నీమీదే ఆశలు పెట్టుకొని తన కడుపు కట్టుకొని నిన్నింతవాణ్ని చేసిన తల్లిని చెల్లిని వదిలేసి వచ్చిన వంచకుడివి

పెళ్ళి చేసి అత్తారింటికి పంపించి ఆమె ఆలనా పాలనా చూడవలసిన అన్నవి నువ్వు ఆమె మానాన ఆమెని వదిలేసి వచ్చేసావు ఒంటరి ఆడదాని కోసం నక్కల్లా కాచుక్కూర్చొనే మగ మృగాల మధ్య ఎవరూలేని అనాథగా నీ చెల్లిని వదిలెయ్యడానికి నిర్ణయించుకున్న నువ్వు మనిషివా?

పో! ఇక్కడినుంచి పో!

వాళ్ళనే . నీ తోడపుట్టినదాన్ని . నీకు రక్తాన్ని పంచిచ్చిన తల్లిని వంచించడానికి పూనుకున్న నీకు. నీకు నేను నేనూ అంతే!

ఈ జన్మలో ఇక నీ ముఖం నాకు చూపించకు

నీకోసం ఇంట్లో వాళ్ళని ఎదిరించి నీ దాన్నవాలని– నీలాంటి ఉన్నతుడి భార్యగా బ్రతకాలని నిర్ణయించుకున్న నా నిర్ణయం మంచిదికాదని తేలిపోయింది

నా తండ్రితో పందెం వేసి నేనే ఓడిపోయాను

బేబీ! నిన్ను అతను సుఖపెట్టలేడమ్మా! నువ్వు అనుకున్నంత ఆదర్శవంతుడు ఆత్మీయుడూ కాదమ్మా అతను అని నా తండ్రి అంటే కాదని వాదించాను

కేవలం ఆడదానికోసం. ప్రేమించిన అమ్మాయి కోసం నీ బాధ్యతల్ని– బంధాల్ని త్రెంచుకోవడానికి ప్రయత్నించావ్!

తర్వాత ఇంక దేనికోసమో నన్నూ వదిలించుకుంటావేమో!

నీ ప్రాణం కోసం నిన్ను కనడానికి నీ తల్లి ప్రాణాలే లెక్క చేయలేదు ఆనాడు తన స్వార్థం కోసం ఆమె నిన్ను కడుపులో పడగానే అబార్షన్ చేయించుకుని ఉంటే– నువ్వీ భూమ్మీద మనగలవా?!

అరుంధతి కళ్ళల్లో నిప్పులు కురిసాయి

రవిశంకర్ అస్తమిస్తున్న సూర్యుడిలా నిర్వీర్యుడై నిలబడిపోయాడు

ఆ క్షణం –

ఆ నిశ్శబ్ద నిశీధిలో –

చప్పట్లు!

వరుసగా మూడుసార్లు చప్పట్లు లయబద్ధంగా విన్పించేసరికి ఉలిక్కిపడి తలఎత్తాడు రవిశంకర్

అరుంధతి తండ్రి

నవ్వుతూ ద్వారం దగ్గర నిలబడి చప్పట్లు కొడుతున్నాడు

అరుంధతి ఏడుస్తూ వెళ్ళి తండ్రి గుండెల మీద వాలిపోయింది

'డాడీ! యూ ఆర్ గ్రేట్ మీరే గెలిచారు మీరు చెప్పిందే కరెక్టు అతను అతను ఏదో రోజూ నన్నూ వాళ్ళను వదిలేసినట్టే వదిలేస్తాడు,

ఏడుస్తూ కుప్పకూలిపోయింది అరుందతి □

సీరియల్:

# జిగి-బిగి

ఎమ్. హారా



(గత సంచిక తరువాయి)

ప్రజాసేవ కంపెనీ ఆపీసులో కాపీ పలహారాల ప్రోగ్రాం కడుపునిండా జరిగిన తరువాత పరాచికాలు ఆడుతూనే అన్నాడు ప్రజాపతి

బక్కపాలెంలో మా యిల్లూ, పంచాయితి ఆపీసూ, మా ఆస్తీ, వోటర్లని చూడాలని సౌభాగ్యవతి ముచ్చటపడుతోంది ఎటూ మనం శుభం అనుకున్నాం కాబట్టి అమ్మాయిని నాలుగు రోజులపాటు పంపించు ఉభయం ఎటూ యిప్పట్లో ముహూర్తాలు లేవుగా

మీ అమ్మాయిని మీ ఇంటికి పంపించడానికి నాకెటువంటి అభ్యంతరం లేదు తాతయ్యగారు ముహూర్తాలు పెట్టడంలో దిట్ట వారిని అడిగి మంచి ముహూర్తం చూసి మీ వూరు పంపిస్తాను గడుసుగానే అన్నాడు ఉభయం

నాన్నా మీరింకా యిక్కడే వున్నారా? వొంటి గంటకి పంచాయితిబోర్డు మీటింగ్ ఉందన్నారు వెంటనే బయలుదేరండి అంటూ లోపలి గదిలోంచి వచ్చిన అబ్బాయి తండ్రిని తొందర చేశాడు అతను అంతవరకు తండ్రి చూపులకు అందకుండా లోపల గదిలో తలదాచుకున్నాడు తండ్రి పట్ల వైరంతో అబ్బాయి ముఖం చాటు చేశాడని అపోహపడుతున్నాడు ఉభయం మావగారింటి వాసాలు లెక్కిస్తున్నాడని సంతోషపడుతున్నాడు ప్రజాపతి

తాతగారికి చెప్పి మీరెప్పుడు వస్తారో తెలుసుకుని మరీ వెళ్తాను' అన్నాడు ప్రజాపతి

"ఆయన ఇప్పట్లో రాడు సహస్రనామ పూజ చేసిగాని గుడి నుంచి బైటపడరు అయినా నిశ్చయ తాంబూలాలు పుచ్చుకోవడానికి మళ్ళీ వస్తారుగా అప్పుడు తాపీగా మాట్లాడుదురు గాని అంటూ ఇక వెళ్ళండి అన్నట్లు చూశాడు ఉబయం

ఆయన్ని తరిమేసి అబ్బాయిని దుర్వి దత్తత చేసుకోవాలనే దురాలోచనలో వున్న ఉబయం కాబోయే వియ్యంకుడికి అతి శీఘ్రంగా వీడ్కోలు చెప్పడానికి రెడీగా వున్నాడు

తాతయ్య వచ్చేవరకు మీరిక్కడ ఆగితే మీకోసం పంచాయితిబోర్డు మీటింగ్ ఆగదు సర్పంచ్ కుర్చీ ఖాళీగా వుంటే అపోజిషన్ పేట్రేగిపోతుంది మన పార్టీ పొజిషనే తారుమారవుతుంది వెళ్ళండి నాన్నా వెళ్ళండి లేకపోతే నాకు సర్పంచ్ పదవి దక్కదు అంటూ తండ్రిని రోడ్డెక్కించాడు అబ్బాయి

తండ్రిని బజారుపాలు చేసిన అబ్బాయి తాపీగా యింట్లోకి వచ్చి తన గళం విప్పాడు-

మీ పక్కింటి అమ్మాయిని పంపి నేను ఇంటర్వ్యూకి వెళ్ళకుండా చేశారు మా నాన్నపై పగ దీర్చుకొనే అవకాశం లేకుండా చేశారు అయినా మిమ్మల్ని క్షమిస్తున్నాను ఎందుకంటే సౌబాగ్యవతి అంటే నాకు చాలా యిష్టం ఆ యిష్టం గురించి వివరణ అడగకండి మీరు అతి తెలివైనవారు దుర్మార్గుడైన మా నాన్నపై పగ నాకింకా చల్లారలేదు నా కడుపు మండిపోతున్నది మా నాన్నపై పగ సాదించాలి ఎలా? ఎలా అన్నదే సమస్య నా సమస్యకి మీరే పరిష్కార మార్గం చూపించాలి

నువ్వు నాకు దత్తత వస్తే మీ నాన్న శవానికి కర్మకాండలు జరగవు దిక్కులేని చావు చస్తాడు యింతకన్నా పెద్ద శిక్ష ఈ బారతదేశంలో లేదు ఈ కర్మభూమిలో లేదు ఉభయతారకంగా సలహా యిచ్చాడు ఉభయం

అయితే వెంటనే మా నాన్న నుంచి నన్ను దూరం చేయండి నన్ను దత్తత తీసుకోండి మీ ఆస్తికి వారసుడ్ని చేయండి ఈ రోజు నుంచి మీరే నాకు నాన్న అంటూ ఉబయం కాళ్ళపై కుప్పలా కూలాడు అబ్బాయి

యిది కదా? సినిమానా? నిజమా? ఈ శుబ ఘడియ కోసమే ఎదురు చూస్తున్నాను నా తలకి కొరివి నువ్వే పెట్టాలి పున్నామ నరకం నుంచి నన్ను నువ్వే తప్పించాలి నా తదనంతరం నా స్థిరచరాస్తులన్నీ నీకే చెందాలని ఈ రోజే వీలునామా రాస్తాను అవదులు దాటిన ఆనందంతో అబ్బాయిని కౌగలించుకున్నాడు ఉభయం

ఈ నిమిషం నుంచి మీరే నాకు న్నాన్న మీ డబ్బుతో మిమ్మల్ని తగలబెట్టి విరివిగా దానాలు చేసి వైతరిణిని దాటిస్తాను కాకులకి పిండాలు పెడతాను మీకు తద్దినాలు పెడతాను

యిది శూన్య మాసం, ముహూర్తాలు వుండవు వచ్చే మాసంలో అతి రహస్యంగా నిన్ను దత్తత చెసుకుంటాను నా తదనంతరం నా ఆస్తికి నువ్వే ఏకైక వారసుడవి' అతి జాగ్రత్తగా మాటలు వదులుతున్నాడు

తదనంతరం అనే పదాన్ని పదే పదే వాడి నన్ను బాదించకండి నాన్నగారూ ఏ నిముషాన ఏం జరుగుతుందో ఎవరూహించగలరు ఈ రోజు నుంచె మీ ఆస్తిని నా పరం చెస్తూ వీలునామా వ్రాయండి నాన్నా అలా చేయకపోతే మీరు కన్నుమూయగానే మీ బందువులు మన ఆస్తిపై కాకుల్లా వ్రాలి కోర్టు కెళ్తారు యిప్పటనుంచి మీ ఆస్తిపై నాకు సర్వాదికారాలు వుంటే నోరు మెదపదు మీ బంధుకోటి ఆస్తి నా పరంకాగానే మీ బందుమిత్రులె గాక విరోధులు కూడా దడుచుకునేటట్లు పితృసెవ చెస్తాను

అబ్బాయి వాదనలో పసని పరీక్షిస్తూ ఏం చేయాలో పాలుబోక ఆలోచిస్తున్నాడు ఉభయం

మేం ఎల్లుండి బక్కపాలెం వెళ్తాం మీరు ఆశించే విధంగా, మీ కుమారుడిగా మా నాన్నపై అల్లుడి అధికార్ధం చూపిస్తాను అయన గుండె పగిలేలా చెస్తాను నాలో రగిలె పగకి ప్రతీకారం తీర్చుకుంటాను యిక మీదే ఆలస్యం వెంటనే మీ ఆస్తిని నా పరం చెయండి నాన్నా

అతని మాటలకి అడ్డు వస్తూ అబ్బాయిగారు యింతగా చెబుతూంటె

**జరిగిన కథ–6:** సీనియర్ క్లర్క్స్ పరీక్ష రాయడానికి వెళుతున్న అమ్మాయికి అదే పరీక్ష రాయడానికి వెళుతున్న అబ్బాయి పరిచయం అవుతాడు 'ప్రజా సేవ కంపెనీ' నడిపే బ్రహ్మచారి ఉబయానందం తన పినతల్లి మనుమరాలు సౌభాగ్యవతిని చేరదీశాడు సౌబాగ్యానికి పెళ్ళి చేసి ఆమె భర్తని దత్తత చేసుకోవాలని ఉభయం కోరిక సూర్యనారాయణ మనుమరాలు అమ్మాయి సౌభాగ్యం, చిరంజీవి ప్రేమించుకున్నారు అమ్మాయి, అబ్బాయి ప్రేమించుకున్నారు సౌభాగ్యవతి పేరుతో అబ్బాయి రూముకి వెళ్ళిన అమ్మాయి అత్తనికి ఉభయానందం పథకం వివరించింది అంతా విన్న అబ్బాయి ఇదంతా తన నాన్న ఆడుతున్న నాటకమేనని తన కథంతా చెప్పసాగాడు అబ్బాయి తండ్రి ప్రజాపతి దగ్గరికి వెళ్ళి అబ్బాయి తన కోడలు సౌభాగ్యవతిని ప్రేమిస్తున్నాడని చెప్తాడు ఉభయం ఉభయం పెద్ద ఎత్తులో వ్యూహం పన్నుతున్నాడని పసిగట్టిన ప్రజాపతి తను వచ్చి అబ్బాయి ప్రేమను పరీక్ష చేసి పెళ్ళి చేస్తానని చెప్తాడు అబ్బాయి, అమ్మాయి, చిరంజీవి, సౌభాగ్యం ఏదో ఒక సాకుతో హైదరాబాద్‌కి చెక్కేయ్యాలని ప్లాను వేస్తారు ప్రజాపతి కొడుకు దగ్గరికి వస్తాడు ఆయన అమ్మాయినే సౌభాగ్యవతిగా భావిస్తాడు నాటకం ప్రారంభమవుతుంది

యింకా ఏమాలోచిస్తున్నావు మావయ్యా అంతా నువ్వనుకున్నట్లే జరుగుతోంది మావయ్యా అంటూ వంత పాట పాడింది సౌభాగ్యం

మత్తు మత్తుగా వినబడుతున్న నాన్నా మావయ్యా అనే పిలుపులకి ఉన్మత్తుడైన ఉభయం తన వివేకాన్ని పూర్తిగా కోల్పోయాడు

16

నలుగురు ప్రేమికులు చేస్తున్న గూడుపుఠాణి మూసా కాలగర్భంలో రెండు రోజులు యిట్టే కలిసిపోయినాయి

ఆ రోజు రాత్రి సత్రకాయ సూట్‌కేసు ఊపుకుంటూ అమ్మడు యింటి తలుపు నెట్టాడు తాతయ్యా అంటూ సూర్యనారాయణగారి పక్కలో పోటు వేసుకున్నాడు

తాతయ్యా ఎవరి దగ్గరా నా పెళ్లి వూసెత్తకు మనం ఆ రోజు గుడికెళ్లి వచ్చేసరికి ఏదో రాజకీయం చేసి ప్రజాపతిని తోలేశాడు ఉభయానందం నాకిప్పుడు రికమండేషన్ లెటరిచ్చి రేపు హైదరాబాద్ పంపిస్తున్నాడు నువ్వేమి కంగారుపడకు అంతా మన మంచికే అబ్బాయిగారు నాకు తోడుగా హైదరాబాదు వస్తున్నారు మాతో చేతులు కలిపారు సౌభాగ్యవతి, చిరంజీవి ఎంత యిట్టే వారం రోజుల్లో ఉద్యోగాలు సంపాదించుకుని వచ్చేస్తాం ఝామ్మని పెళ్లి చేసుకుంటాం నువ్వు కొంచెం ఓపిక పట్టాలి నా మాట విని యింతవరకు ఉభయం పట్ల మౌనంగా వున్నావు యింకో వారం రోజులుంటే చాలు అన్నీ చక్కబడతాయి నీకు తోడుగా సత్రకాయ వుంటాడు అంటూ తాతయ్యని బుజ్జగించి నచ్చచెప్పింది అమ్మడు అసలు విషయం చెబితే తాతయ్య కంగారుపడి తమ నాటకాన్ని రసాభాసం చేస్తాడని ఆమె భయం

అమ్మడు మాటపై, చేతపై గురివున్న సూర్యనారాయణగారు మనుమరాలు చెప్పినట్లే మసులుకోవాలని తీర్మానించుకున్నారు

మర్నాడు ఉదయం ప్రయాణానికి సిద్ధమైనారు అమ్మాయీ సౌభాగ్యవతి ఆడపిల్ల లిద్దర్నీ వెంటబెట్టుకుని ఉభయానందం బస్‌స్టాండ్‌కి చేరేవేళకి అబ్బాయి అక్కడ రెడీగా వున్నాడు వారికి చేరువలో తచ్చాడుతున్నాడు చిరంజీవి

బస్‌స్టాండ్ నిండా బస్సులు నాట్యం చేస్తున్నాయి కుయ్యో మొర్రో అంటూ ఏడుస్తున్నాయి చీదుతున్నాయి అరుస్తున్నాయి ఉభయానికి కావలసిన బస్సులు మాత్రం అక్కడలేవు

అమ్మాయిగారూ ఏ రాచకార్యం మీద రాజధాని వెళ్తున్నారు' ఈ ప్రపంచంలో మొగపీనుగు లందరూ ప్రవరాఖ్యుడి వారసులు కారు ఈ విశ్వంలో విశ్వామిత్రులు ఎక్కువ యింతకీ తమ రెవరి తపస్సు భగ్నం చేయడానికి వెళ్తున్నారో తెలుసుకోవచ్చా శృతిమించని చలోక్తులు విసరసాగాడు అబ్బాయి

ఆ చలోక్తుల చెర్నాకోల దెబ్బలకి తట్టుకోలేక, ఎదురు దెబ్బ కొట్టడానికి



# జిగిబిగి

స్వంత డైలాగులు వాడితే ఏ ప్రమాదం ముంచుకు వస్తుందోనని నోటిని గట్టిగా మూసుకుంది అమ్మడు

అబ్బాయిగారూ మీరు మాటలు దుబారా చేస్తున్నారు మన ప్రేమ కద కంటిన్యూటీ దెబ్బ తింటుంది అంటూ మందలించింది సౌభాగ్యవతి

ఆమె హెచ్చరికని తన స్వంత బుద్ధితో అర్థం చేసుకున్న ఉభయానందం, అబ్బాయి భుజంపై చేయివేసి కొంచం దూరంగా తీసుకెళ్ళి హితబోధ ప్రారంభించాడు

పెళ్ళీడు కొచ్చిన పుత్రుణ్ణి ఫ్రెండ్‌లా చూసుకో మన్నారు బజారులో ఒళ్ళమ్ముకునే అమ్మడిని చేరదీసి గౌరవంగా ప్రజా సేవ చేసి బ్రతకమని దారి చూపిస్తే నాకె ఎసరు పెడుతున్నది అందుకే హైదరాబాద్ పంపిస్తున్నాను బజారు స్త్రీలపై మోజు ఆసుపత్రికి దారి చూపిస్తుంది నీపై ఎన్నెన్నో ఆశలు పెట్టుకున్నాను నా ఆస్తి అంతా నీకు దారపోశాను నన్ను అన్యాయం చేయకు మా భాగ్యాన్ని ఏలుకో

ఎవరినో వెతుకుతున్నట్లు నటిస్తూ కావాలని నాలుగుసార్లు సౌభాగ్యవతి శౌరీని చుంబించిన చిరంజీవి మేను శృంగారంగా పులకరించింది అతను మత్తుగా చూస్తూ, సారీ సారీ' అంటూ రాగాలాపన అందుకున్నాడు చూడు బాబయ్యా యితగాడి పోకిరీ వేషాలన్నట్లు ఉభయం వంక దిగులుగా చూసిందామె

వాట్ మిష్టర్ కళ్ళు కనబడ్డం లేదా? గుడ్డివాడివా అని ఎద్దేవా చేస్తూ కళ్ళెర్ర చేస్తూ గబగబా అడుగులు వేశాడు ఉభయం

పత్తికాయల్లా రెండు కళ్ళున్న మీరు చెప్పిన తరువాత ఒప్పుకుంటున్నాను నేను గుడ్డివాడినే అందమైన కోల కళ్ళున్న ఈ సౌభాగ్యవతి, నాలాంటి గుడ్డివాళ్ళని చూసి, పక్కకి తప్పుకుని దారి యివ్వకుండా నా పర్స్ చేజిక్కించుకోవాలనే దుర్బుద్ధితో డాష్ యిస్తున్నది నేను కళ్ళున్న గుడ్డి సీక్రెట్ ఏజంట్‌ని యింతకీ తమ రెవరు అంటూ ఎదురు దెబ్బ కొట్టాడు చిరంజీవి

ఆ దెబ్బకి బొప్పి కట్టిన తలని నిమురుకుంటూ మాటలకోసం తడుముకుంటున్నాడు ఉభయం యిక ఎటువంటి జాప్యం చేయకుండా గొంతు సవరించుకున్నాడు అబ్బాయి

'ఈ సి ఐ డి ఆఫీసర్‌తో అనవసరంగా పేచీలకి దిగకు డాడీ మీ ఆస్తినంతా నా పేరున రిజిస్ట్రేషన్ చెయించిన కాగితాల యింకు తడి యింకా ఆరలేదు ఈ గుడ్డి సీక్రెట్ ఏజంట్‌తో గిల్లి కజ్జాలు పెట్టుకుంటే మనకే ప్రమాదం మన ప్రజాసేవ కంపెనీ తవ్వేసి మిమ్మల్ని జైలుకి పంపిస్తాడు కోరి వైరం తెచ్చుకోవడం అవివేకం కాబట్టి ఆ బడుద్దాయిని మంచి చేసుకుందాం' అంటూ ఉభయం చెవిలో గొణిగాడు

అతి లౌక్యంగా సౌభాగ్యం చేతుల మీదుగా చిరంజీవికి కాఫీ యిప్పించి, తానేమో యించక్కా అమ్మాయి చేత కాఫీ తాగించాడు అబ్బాయి

అంతలో వాళ్ళు ఎక్కవలసిన బస్సులు వచ్చాయి అబ్బాయి, సౌభాగ్యం బుక్కపాలెం వెళ్ళే బస్సెక్కారు అమ్మాయి, చిరంజీవి హైదరాబాద్ బస్సులో కూర్చున్నారు బస్‌లు కదిలాయి కళ్ళల్లో పడిన దుమ్ముతో ఆనందంగా యింటిదోవ పట్టాడు ఉభయానందం

వూరి పొలిమేరలో రిక్వెస్టు బస్‌స్టాప్‌లో నలుగురు ప్రేమికులు దిగారు అద్దె సైకిల్ మీద వచ్చిన సత్రకాయ వాళ్ళని కలుసుకున్నాడు అయిదుగురు కలిసి తమతమ పోర్షన్లు అప్పగించుకున్నారు దశమినాటి ఉదయానికి బెజవాడ చేరుకుని ఏకాదశి ఘడియలు దాటకుండా హైదరాబాద్ అద్దె యింట్లో గృహప్రవేశం చేయాలని తీర్మానించుకున్నారు

అమ్మాయి, అబ్బాయి బుక్కపాలెం వెళ్ళే బస్సెక్కారు " చిరంజీవి,







నౌ బాగ్యవతి వూరికి వుత్తరాన వున్న హెూటల్ అబిలాష్‌లో రూం తీసుకున్నారు

సత్రకాయ కాకా హోటల్లో టీని చప్పరిస్తూ, సిగరెట్ వూదేస్తూ సుదీర్ఘంగా ఆలోచిస్తున్నాడు

## 17

హోటల్ అభిలాష్‌లో అరవై ఆరో నెంబరు రూంలో సంయుక్త, చిరంజీవి కాపురం చేస్తున్నారని వేగంగా రమ్మని శ్రీమతి సాధ్వికి ఫోన్ చేసింది సౌబాగ్యం

ఆవిడ వెంటనే అతి శీఘ్రంగా గంటన్నర దాటకుండా మేకప్పు నాలుగు నిమిషాల్లో హోటల్‌కి చేరుకుంది

యువరాణి పూర్తి వివరాలు సేకరించాలని, సంయుక్త కదా కమామిషు చెప్పమని రిసెప్షనిస్టుని గిల్లింది సాధ్వి

'యూ వాంట్ టు నో ది హిస్టరీ ఆఫ్ సామర్లకోట అంది రిసెప్షనిస్ట్ తెలుగు యాసతో ఇంగ్లీషుని కూనీచేస్తూ

నో నో సామర్లకోట

యస్ యస్ సామర్లకోట అంటూ వికారంగా ఎత్తుపళ్ళని యికిలించి పెద్ద బైండ్ పుస్తకంలో పేజీలు త్రిప్పసాగింది రిసెప్షనిస్ట్

స్టీల్ పార్లల్లా మిలమిలా మెరుస్తున్న ఆపిల్ల ఎత్తు పళ్ళనిచూస్తూ, ఆ మెరుపులకి అసలు రహస్యం తెలుసుకోవాలనే అసూయతో 'మీరేటూత్ పౌడర్ వాడతారని, అడిగేసింది సాధ్వి

రిసెప్షనిస్ట్ సుదీర్ఘ చిరునవ్వుని ఎత్తుపళ్ళతో అతిశయంగా చిందించి అంది

కచికాప్లస్ వేపపుల్ల వేపపుల్లని ముందు నమిలేసి బ్రష్‌గా తయారుచేసి, కచిక పొడితో పళ్ళురుద్దుకుంటాను కచికని ఎలా తయారు చేస్తారో మీకు తెలుసా? మీకేకాదు కాన్వెంట్ పిల్లలకి కూడా తెలియదు కచిక ప్రస్తావన పాఠ్య పుస్తకాలలో వుండదు పిడకనికాల్చితే కచిక అవుతుంది పిడకలు సినిమా వాల్‌పోస్టర్లపై విరివిగా దొరుకుతాయి వాల్‌పోస్టర్లు అధికంగా టాప్ హీరో సినిమాలకే అచ్చు వేస్తారు టాప్ హీరోలకి దురభిమాన సంఘాలుంటాయి

ఆ సంఘాలు ఎరువుకి పనికివచ్చే పేడతో –

"అపుతల్లీ నీ గోల స్త్రీకి పెట్టని ఆభరణ మైన ఈర్ష్యతో బుద్ధి లేక నీ పళ్ళని కదిలించాను యింతకీ సంయుక్త ఏరూంలో వుంటున్నారో చెప్పారుగాదు'

"ఎస్ ఎస్, సంయుక్త" అంటూ పుస్తకంలో పేజీలు త్రిప్పుతూ "అం రూం నెంబర్ అరవై ఆరు అంది.

గది వసతిగా వుంటుందా? ఆ రూంలో ఎవరెవరుంటున్నారు

"సింగిల్‌రూం నో అటాచ్డ్ బాత్ కపుల్‌కాట్ విత్ అవుట్ బెడ్ నో సోపాస్ బట్ స్టూల్స్ ఫోర్ ఫామిలీ ప్లానింగ్ టాబ్‌లెట్స్ ఫ్రీ ఆన్ రిక్వెస్టు వోన్లీ రెసిడెంట్స్ సంయుక్త, చిరంజీవి, సౌభాగ్యవతి, ఎడ్రెస్, కోటబవంతి బిట్వీన్ కృష్ణారివర్ అండ్ దుర్గకొండ బెజవాడ ఆంధ్ర

ఆమె మాటలకి అడ్డువస్తూ విసుగ్గా-

ఏ పనిమీద వచ్చారో– అంటూ దీర్ఘం తీసింది సాధ్వి

మెడమ్ మీరు సి ఐ డి/నా? మీ వేషం, బాషా, వాలకం చూస్తుంటే మీరు పత్తేదారని చెప్పకుండానె చెబుతున్నాయి నేను చాలా స్పై ఎక్సర్స్ చూశాను ఈ వూళ్ళో ఇంగ్లీషు సినిమాని శవాని చూపించకూడదు అంతా దగా మోసం పది రీళ్ళ ఇంగ్లీషు సినిమా కొనేసి నాలుగైదు అడ్వర్‌టైజ్ మెంట్స్ అండ్ న్యూస్ రీల్స్ అప్పుగా తెచ్చి అన్నింటిని కలగాపులగం చెస పది వారాల పాటు ఆ పదిహేను రీళ్ళని ముందూ, వెనకా, అటూ యిటు చేస చూపసూ, పది సినిమా పెర్లతో ఆడిస్తారు తుపాకీ వీరుడు వీర తుపాకీ తుపాకీ- వీరుడు తుపాకీ లెని వీరుడు వీరుడె తుపాకీ నన్ను ఫాలో అవుతున్నారా అందామె గబగబా

లేదు నా దోవన నేను పోతున్నాను అంటూ కదిలింది సాధ్వి లిఫ్ట్‌లో ఎక్కి మహా స్త్రీలా వెళ్ళేకన్నా పది మంది కళ్ళల్లో పడితే తన అందానికి సార్ధకత లబిస్తుందని కష్టపడి మేడ మెట్లు ఎక్కసాగింది

నాలుగో అంతస్తు కార్నర్‌లో మీరేనా నా కోసం వస్తున్నదని ఓ బాబ్డ్ హెయిర్ ప్రశ్నించగానే కుదురుగా నిల్చోలేక పోయింది సాధ్వి

కట్టుకున్న పట్టు చీరెనీ, వొంటినిండా పెట్టుకున్న నగల అందాన్ని, అతి మోరంగా కూనీచెసె, అపిల్ల అతి వికారంగావుంది అనాకారిగా వున్న కురచజుత్తు గల ఆ అమ్మాయిని చూడగానె చీదరించుకుంది సాధ్వి యువరాణి వారు చింపిరి జుట్టు పనిమనిషి కూతురని గుర్తుకు రాగానే లెంపలు వెసుకుని, బలవంతపు చిరునవ్వుతో బలహీనంగా అంది

నేనే శ్రీమతిసాధ్విని తమకోసం వస్తున్నాను

సాధ్వి అంటె పతివ్రత శ్రీమతి పతివ్రత కుమారి పతివ్రతలు కూడా వుంటారా? మి పెరు బలేగావుంది రూం కెళ్ళండి నేనిప్పుడే వస్తాను' అందాపిల్ల

తమరు ఎక్కడికి వెళుతున్నారో తెలుసుకోవచ్చా

అంతా రహస్యం ముందు రూంకి వెళ్ళండి అంటూ వడ్డాణం సవరించుకుంటూ గబగబా గెంతులు వేస్తూ క్రిందికి దిగిందా పిల్ల

ఈ పెద్ద వాళ్ళ పోకిరీ పోకడలె అర్థం కావని గొణుక్కుంటూ రూం నెంబర్ అరవై ఆరుకి చేరుకుంది సాధ్వి

బార్లా తెరిచివున్న తలుపుపై చెతివెళ్ళతో పారిన్‌స్టైల్‌తో చప్పుడు చెస్తూ

# టైం పాస్ ఖరీదు!

"శంకర్ విలాస్" హోటల్లో
టిఫిను, కాఫీ సేవించి
హోటలు ముందు, సెంటర్లో
టైం పాసు చేస్తున్నాను

గుడాఫ్టర్‌నూన్ సార్! బాగున్నారా!
ఇంకా జాబ్ చేస్తున్నారా!
పిల్లా జల్లా చదువుతున్నారా!
అంటూ ఓ పూటాయన నా ప్రక్క చేరి-

మీ శ్రీమతిగారు, మా దొడ్డ ఇల్లాలు
చెయ్యెత్తి మ్రొక్కొచ్చు ఆ మహాతల్లికి
దాన ధర్మాల్లో మీకు సరిజోడు
ఆంధ్రదేశానికే అన్నపూర్ణమ్మ –

ఈ ఆత్మబందువు ఎవరా అనుకొని
కర్చీసి అడ్డొచ్చి, వివర మడగలేక
గుర్తుపట్టగించిచూస్తుండి పోయాను
ఆల్ ఆర్ వెల్ అంటు అన్సరిచ్చాను –

మూడేళ్ళ ముందుగనే రిటయరయ్యాను
రెండేళ్ళు అయినా పింఛను రాలేదు
పిల్లల చదువు ఫ్యామిలి ఖర్చులకు
అప్పులు చెస్తూ నిండుగా మునిగాను –

అయ్యో పాపం! ఎంత దురవస్థ?
బ్యాడ్ డేస్ అంటూ సింపతి చూపాడు
పాలించే నేతలను తిట్టిపోశాడు
రండిసార్! అంటూ బలవంతపెట్టాడు –

ఇంద్రభవనం లాంటి కూల్ డ్రింకు షాపులో
బహుకాల దర్శనం! మీరు నా గెస్టంటు
కాస్ట్లీ డ్రింకు ఆర్డరిచ్చాడు
తన (బాగు) సంగతి చెప్పసాగాడు–

మీలాంటి పెద్దల ఆశీస్సులతో
రెండేళ్ళ క్రితమే ప్రమోషనొచ్చింది
డీసెంటు జీతంతో పైన వచ్చేదాంతో
మూడు పువ్వులు– ఆరుకాయలు నా లైఫు–

గ్లాసులో డ్రింకును ఖాళీ చేశాడు
నా వాటాను నేను సిప్ చేస్తుంటే
రోడ్డు మీదికి చూచి ఎవరినో పిలుస్తూ
వస్తాను సార్! అంటూ నిష్క్రమించాడు!

మరొక్కసారి నే నిలువుగుడ్లేసి
బ్యాడ్ డేస్‌లో బ్యాడ్‌లక్ అనుకుంటూ
జ్వరపడ్డ పిల్లకు మందుకు బ్రెడ్డుకు
తెచ్చిన డబ్బుతో బిల్లు చెల్లించాను!

—తుళ్ళూరి రామమోహనరావు

## జిగిబిగి

అంది సాధ్వి-

మే ఐ కమిన్

ఎస్ కమిన్' అంటూ చెక్కట చెయి జెర్చి కిటికీలోంచి బయటకి చూస్తున్న సౌభాగ్యం గభాల్న ఏడ్పు ముఖంతో ఆమెని ఆహ్వానించింది

ఫుల్ సూట్ దరించి స్టూల్ మీద కూర్చున్న చిరంజీవి ఏమాత్రం నామర్దా పడకుండా దర్జాగా తెలుగు దిన పత్రికలో ఇంగ్లీషు ప్రకటనలు చూస్తూ ఎవరొచ్చారని ప్రశ్నించాడు

తమ మాతాజీగారు వెంచేశారు

సంయుక్తగా యాక్టు చేయడానికి ఓ మంచి అమ్మాయిని పంపించమని సత్రకాయని పురమాయించాడు చిరంజీవి యాక్టర్ సంయుక్త రాకపోగా తల్లి వచ్చినందుకు తనవితీరా తల్లడిల్లుతూ తీవ్ర కోపంతో అన్నాడు.

సౌబాగ్యం నోర్మూసుకో నీ యిష్టం వచ్చినట్లు పెలకు జీ అంటే గారని అర్థం మమ్మీ యు హావ్ కమ్, టు మినిట్స్ ఎర్లీగా వస్తే యువరాణి కలిసేది యు ఆర్ లేట్

వారు రాలేదా నంగనాచిలా స్టూల్‌పై చతికిలపడింది సాధ్వి

'రెప్పపాటు కాలంలో లిఫ్ట్‌లో క్రింది కెళ్ళి యిప్పుడే గాల్లో కలిసి పోయారు ఐమీన్ ప్లైట్‌లో బొంబాయి వెళ్ళారు చిరంజీవిని ఫాలో అవుతూ అతి క్లుప్తంగా అబద్ధం అల్లింది సౌభాగ్యం

యిప్పుడే వస్తానంటూ మెట్ల దగ్గర నాకు టా టా.. చెప్పిన యువరాణి బొంబాయి వెళ్ళారా? ఎంత గింజుకున్నా ఈ పెద్దవాళ్ళ వ్యవహారాలు మనలాంటి సామాన్యుల తలకెక్కవు

ఆవిడ మాటలకి తెల్లబోయిన మొహాలతో వొకరి నొకరు చూసుకున్నారు ఆ గదిలో వున్న మిగతా యిద్దరూ.

సంయుక్తని నేనే స్వయంగా లిఫ్ట్ ఎక్కించాను విమానం గాల్లో కలిసి పోవడం కిటకీలోంచి చూశాను యువరాణి నీ కెక్కడ దర్శన మిచ్చింది మమ్మీ బెరుకు బెరుగ్గా గొణికాడు చిరంజీవి

నాలుగో అంతస్తు కారిడార్‌లో కనబడ్డారు వారి అందం బయటికి పారిపోకుండా పట్టు చీరెతో చుట్టేశారు వొంటినిండా నగలుతో కట్టేశారు అప్ టు డేట్ కురచ వెంట్రుకలతో అనాకారిగా నా కంటికి ఆనలేదు యువరాణి వారు పని మనిషి డాటర్‌నైనా మీరు నా కోసం వస్తున్నారా అంటూ ప్రేమగా పలుకరించారు

సాధ్వి చిలుక పలుకులు వింటూ చెవులు మూసుకున్నాడు చిరంజీవి సౌబాగ్యవతి కళ్ళు తేలేసింది అంతా మీరనుకున్నట్లు జరిగితే యిక నేనెందు కన్నట్లు గోడకి తగిలించిన కాలండెర్‌లో నిల్చున్న దేవుడు మందహాసం చిందించాడు

ఎవరీ యువరాణి. సత్రకాయ పంపించాడా? పంపిస్తే రూంకి వచ్చి తన పోర్షన్ రాసుకుని బట్టీపెట్టి యాక్షన్ చెయ్యాలి గాని మేడ మెట్ల మీదే రెండు డైలాగులు వల్లించి వెళ్ళిపోవడమేనా? నటుడే, రచయితా డైరక్టరైతే, రంగస్థలం మీద మిగతా యాక్టర్ల పని గోవింద అందుకే నాటక రంగమిలా తగలబడింది యిక ఈ నాటకాన్ని రక్తి కట్టించడం తనవల్ల కాదని యధాశక్తిగా

కుమిలిపోతున్నాడు చిరంజీవి

అతని విషాద ముఖ భంగిమలు చదివిన సౌభాగ్యం అధైర్యంగా కృంగిపోలేదు సత్యభామలా నడుమున కొంగు బిగించింది ఉద్రేకంగా విజృంభించింది

వెంటనే రమ్మని ఫోన్ చేస్తే మీరు తీరిగ్గా మేకప్ చేసుకుని రెండు గంటలు ఆలస్యంగా వచ్చారు యువరాణి మీ కోసం వెయిట్ చేసి. చేసి. కళ్ళు కాయలుగా మారగానే దిగులుబడి. ఆ కాయలు పండి. ఎండి రాలిపోతాయని భయపడింది జీవితాంతం గుడ్డిగా బ్రతకలేని యువరాణి అలా షికారుగా బొంబాయి వెళ్ళారు యిప్పట్లో యిక్కడికి రావచ్చును లేక రాకపోవచ్చును

యిదేం కర్మరా బాబూ మాటా, కాలు నిలకడ లేని ఈ పిల్లతో కాపురం ఎలా చేస్తావురా? మి కెలా పెళ్ళవుతుందిరా బుడి బుడి రాగాలు తీసింది సాధ్వి

'పది లక్షల కట్నం పుచ్చుకున్నాం కట్నమేగాక వంద ఎకరాలు రాయించుకున్నాం పొలమేగాక వాళ్ళ యింటిని ఆక్రమించాం యింటినేగాక పండుగ ఇనాంకోసం వియ్యంకుడిచేత పాతిక వేలకి ప్రోనోటు రాయించుకున్నాం ఆయన అప్పు తీర్చకపోతే కోడలు పిల్లని తగలెట్టి మా అబ్బాయికి పునఃవివాహం చేస్తామని గొప్పలు చెప్పుకునే మీలాంటి వాళ్ళకి పిల్లల ముద్దు ముచ్చట్లు అనవసరం అంటూ ఏకిపారేస్తూ తల్లి దృష్టిని మళ్ళించాడు చిరంజీవి

ఎక్స్క్యూజ్ మిస్టర్ చిరంజీవి మీకీ కట్నాల పెళ్ళి యిష్టం లేదా? యువరాణి వారికి మీరు అమ్ముడుబోరా అంటూ మనసా వాచా అతన్ని అనుసరించింది సౌభాగ్యం

పిల్లల యిష్టా యిష్టాలతో ఎటువంటి ప్రమేయం లేకుండానె పెద్దలు పెళ్ళిళ్ళు చేస్తున్నారు ఆ కోవకు చెందిందే నా వివాహం యువరాణి అంటే నాకు పెద్దగా యిష్టం లేకపోయినా మా మమ్మీ మాట కాదనలేక పోతున్నాను పైగా యువరాణి వారి నగలు నట్రా పొలాలు పుట్రా, బ్లాక్‌మనీ గట్రా, నన్ను విపరీతంగా ఆకర్షిస్తున్నాయి అతను ఎటువంటి పొంతన లేకుండా నోటికి వచ్చినట్లు వాగేస్తున్నాడు

శబాష్ చిరంజీవి ఎల్లలు లేని మా యువరాణి అన్నాని మేసేసి అచ్చోసిన ఆబోతులా దేశంమీద పడతావా? ఎంత మోసం ఎటువంటి కల్తీలు లేని స్వచ్ఛమైన దగా ఆమె గుండెలు బాదుకుంది

నువ్వు గుమాస్తా పిల్లవి నీ హద్దుల్లో నువ్వుండు ఈ దేశంలో సగటు మగ వెధవ బుద్ధే యింత అయినా భార్య హోటల్లో తింటూంటె యింట్లో భర్త పొయ్యిపై ఎసరు బెడతాడా? అంటూ అమెపై విరుచుకుపడి కొడుకుని వెనకేసు కొచ్చింది శ్రీమతి సాధ్వి.

అంతలో గణగణమని ఫోన్ మ్రోగింది తడబడే చేతో రిసీవర్ అందుకుంది సౌభాగ్యం

హలో రూం నెంబర్ అరవై ఆరు అటెంక్షన్ ప్లీజ్ పట్టుచీరె కట్టుకుని, కత్తిరించిన కురచ వెంట్రుకలతో నా కోసమేనా మీరు వస్తున్నారే వూతపదంతో, గెంతులు వేస్తూ వొక అనాకారి పిల్ల ఈ హోటలంతా కలియ దిరుగుతున్నట్లు మా కిప్పుడె రూఢిగా తెలిసింది ఆ అమ్మాయిని పిచ్చాసుపత్రిలో చేర్చడానికి ఈ వూరు వచ్చిన ఆమె తల్లిదండ్రులు రెండు గంటల క్రితమే రూంని ఖాళీ చెసినట్లు మాకు ఆలస్యంగా తెలిసింది ఆ పిల్ల వొంటిపై వున్నవి బంగారు నగలు కావు గోల్డ్ కవర్ నగలు స్టీల్ సామాన్లు కొనడానికి పనికివచ్చె పట్టు చీరె కట్టుకున్న ఆ పిల్లకి పొట్టి వెంట్రుకలు లేవు అది విగ్గు యిక చివరగా ఆమె పిచ్చమ్మాయి కాదు రేప్ చేయడానికైనా పనికిరాదు ఎందుకంటారా ఆమె పిచ్చి అబ్బాయి అందుకని ఆ పిచ్చివాడు మీ కెక్కడైనా కనబడితే మాకు ఫోన్ చేయండి సదా మీ శ్రేయస్సుకోరే హోటల్ మెనేజ్‌మెంట్ అంటూ అవతల ఫోన్ పెట్టేసిన చప్పుడు వినబడగానే బాహ్య లోకంలోకి వచ్చిన ఆమె ముఖం రంగు రంగుల పూల మతాబాలా వెలిగింది

(ఇంకావుంది)

# సుభాషితాలు

ఆరంభ గుర్వీ క్షయిణీ క్రమేణ
లఘ్వీ పురా వృద్ధిము పైతి పశ్చాత్
దిన స్య పూర్వార్ధ పరార్ధభిన్నా
చాయేన మైత్రీ ఖల సజ్జనానామ్




దుష్టుని స్నేహం ప్రాతఃకాలపు నీడవలె మొదట ఎక్కువగా యుండి వెనక కొద్ది కొద్దిగా తగ్గిపోతుంది. సజ్జనుని స్నేహం మధ్యాహ్నపు నీడ వలె మొదట కొద్దిగా యుండి వెనక కొద్ది కొద్దిగా వృద్ధి చెందుతుంది

ఆకరుణత్వ మకారణ నిగ్రహః
పరధనే పరయోషితి చ స్పృహా
సుజనబంధు జనేష్వ స హిష్ణుతా
ప్రకృతి సిద్ధమిదం హి దురాత్మనామ్




దయ లేకుండుట, నిష్కారణంగా కలహించుట, పర ధనాసక్తి, పరస్త్రీ వ్యామోహం, సజ్జనుల యందు బంధు జనుల యందు ఓర్వలేనితనం, ఈ గుణాలు దుర్జనులకు పుట్టుకతోనే పుట్టినవి గదా!

—ఆయుర్వేద శిరోమణి రాజరాజేశ్వరశర్మ

# "నాకు నచ్చిన నా కార్టూన్"

**20** ఏళ్ళ క్రిందట-

హైదరాబాద్‌లో చదివే రోజుల్లో- ఒకరోజు సాయంత్రం-

అబిడ్స్‌లో - తిలక్‌రోడ్డులో పరిగెత్తుకుంటూ, వెనకాలే వెళ్ళి 'మీరేనాండీ శివలెంక రాధాకృష్ణగారంటే? అన్నాను

'అవును ఏంకావాలి?'

'నేను సత్యమూర్తి నండీ'

'అరె! సత్యమూర్తా? ఇంకా ఏ నలభై ఏళ్ళో ఉంటాయనుకున్నాను ఊ సత్యమూర్తన్నమాట. రండి కాఫీ తాగుదాం అంటూ ఆదరంగా పిలిచారు. కార్టూన్స్ ఏ ఏ సబ్జెక్ట్స్ మీద వేయొచ్చో, ఎలా వెయ్యాలో అన్నీ చెప్పేరు బొమ్మల కథలు కార్టూన్స్, కథలకి బొమ్మలూ నా చేత వేయించి నన్ను ఎంతో ప్రోత్సహించేవారు అప్పట్లో చదువు(రావు కార్టూన్స్ వేసే వాడిని పాఠకులు కూడా చదువు(రావుని , విమర్శిస్తూ , పొగుడుతూ 'ఉత్తరాల' శీర్షికలో ఉత్తరాలు వ్రాసేవారు



'నాదొక చిన్న అనుమానం చదువు(రావుది షార్ట్ సైటా లాంగ్ సైటా'? ఎప్పుడూ కళ్ళజోడు పెట్టుకుంటాడు అయ్యో! చదువు(రావు లేడండి (23-2-62 సంచికలో) కొంపతీసి చదువుకుంటున్నాడా ఏం ఖర్మ?' 'ఎప్పుడూ అమ్మాయిల ధోరణైతే ఒకొక్క క్లాసు ఎన్నేళ్ళు చదువుతాడు? కాస్త కుదురు నేర్చుకోమని మీరైనా చెప్పండి'

22-6-62 సంచికలో చదువు(రావు ప్రక్కన ఉన్న స్త్రీ ఆయన భార్యగారా? లేక స్నేహితురాలా?

మాకు తెలిసినంత వరకూ ఆయనకు పెళ్ళి కాలేదు'-సం

'చదువు(రావు వేసుకున్న షర్టులాంటి షర్టుకై చాలా ప్రయత్నించాను కానీ నాకెచటా లభ్యం కాలేదు చదువు(రావు కవి ఎలా లభ్యమయ్యాయి?'

'ఏమండీ చదువు(రావు ఈ మధ్య కనబడటం లేదు కొంపతీసి చైనా వాళ్ళతో యుద్ధం చెయ్యడానికి వెళ్ళాడేమిటి?'

'మీ చదువు(రావుగారికి మార్చి నెల వస్తుంది కాస్త తిరగడం, గప్పాలు కొట్టడం మాని బుద్ధిగా చదువుకోమని చెప్పండి చదువు(రావు లాంటి సుపుత్రుడు మాఇంట్లో ఒకడున్నాడు- ' ఈ విదంగా పాఠకులు వ్రాసేవారు

ప్రస్తుతం శ్రీ సత్యసాయి డిజైనింగ్ స్టుడియోస్ పేరుతో, అడ్వర్టైసింగ్ కన్‌సల్టెంట్‌గా ఉంటున్నాను

–బి.వి. సత్యమూర్తి

రైలు ఈవేళ్ళైనా లేటేమిటోయ్?

లేదు బాబూ

శెలవు లయ్యాకా కాలేజీలు తెరిచారు కనుక హైదరాబాదు బయలు దేరాడు థర్డ్‌క్లాస్ టికెట్టు కొనుక్కొని

అదే సమయానికి ప్లాట్ ఫారం మీద ఒక అమ్మాయి, ముసలి దంపతులు రైలు కోసం నిరీక్షిస్తున్నారు

భలే! ఆ అమ్మాయి ఎక్కే కంపార్ట్‌మెంట్‌లోకే ఎక్కి ఆ అమ్మాయి ఎదురుగా కూర్చోవాలి

ఇంతలోకి రైలు వచ్చి ఆగింది ఆ అమ్మాయి, ఆ దంపతులూ ఫస్ట్‌క్లాస్ పెట్టెలోకి ఎక్కారు

బాబ్బాం! వీళ్ళు ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్‌లోకి ఎక్కారేమిటి? పోనీలే... నా దగ్గర కాలేజీ జీతం 40 రూ॥లున్నాయిగా దాంతో ఫస్ట్‌క్లాస్ టికెట్ కొనేస్తా

టికెట్ కొనుక్కొని సరిగా ఆ అమ్మాయి ఎదురుగా కూర్చున్నాడు

రైలు కదలడానికి గంట కొట్టేరు నువ్వు ఇంక దిగమ్మా. పాపం చాలా సేపు కూర్చున్నావ్

అయితే జాగ్రత్తగా వెళ్ళిరండి తాతయ్యా వెళ్ళొస్తాను బామ్మా. టాటా

మంచినీళ్ళు మంచినీళ్ళు

బాంబినో ఒక అద్భుతమైన వెర్మిసెల్లిని. పరిశుభ్రమైన పద్ధతిలో అధునాతన ఇటాలియన్ యంత్రములతో తయారు చేయబడినది. మిక్కిలి ప్రొటీన్లు కలిగియుండి క్రొవ్వు పదార్థములు లేకుండుటయే బాంబినో విశిష్టత. వండినప్పుడు కాని, తరువాత కాని ముద్దగా కాకపోవుటమే బాంబినో ప్రత్యేకత. నిమిషములలో బాంబినోతో ఎన్నో రకములైన, నోరూరించే వంటకాలు, ఫలహారాలు తయారు చేయవచ్చును. ఇంకా బాంబినోతో ఎంతో పొదుపు కూడా. నేడే వాడి చూడండి. మీకే తెలుస్తుంది.



**బాంబినో ఉప్మా :–**

బాంబినోను నేతిలో వేయించి ప్రక్కన పెట్టుకోండి. బాణలిలో 2 చంచాల నూనె వేసి కాచండి. దానిలో ఆవాలు, కరివేపాకు, పచ్చిమిర్చి, ఎండుమిర్చి వేసి అరనిమిషం వేయించండి. తర్వాత ఉల్లిపాయ ముక్కలు వేసి ముదరరంగు వచ్చేంత వరకు వేయించండి. తర్వాత వేడినీళ్ళు పోసి, బాంబినోను, ఉప్పును కలపండి. బాంబినో ఉడికేంత వరకు కలిపి మూత పెట్టండి. తర్వాత రుచికి నిమ్మకాయ రసం, క్రొత్తిమీరి కలిపి వేడి వేడిగా తీసుకోండి.




**ఉచితం**

బాంబినో వంటల విధానం తెలిపే పుస్తకం, ప్రతీ బాంబినో డీలరు వద్ద.






**వెర్మిసెల్లిని**

తీపైనా ఖారా అయిన బాంబినోతో రుచే రుచి!

associated/85-1

# బిగిసిన పిడికిళ్ళు

ఇసుకపల్లి సుజాత

గడియారం ఏడు గంటలు కొట్టింది గడియారంతో నిమిత్తం లేని పేరు తెలియని రకరకాల పక్షులు ఎప్పుడో నిద్రలేచి శుభోదయాన్ని ఆకాంక్షిస్తూ పాటలు పాడుతున్నాయి

పూల మొగ్గలు ఒక్కొక్క రేకు విచ్చుకుంటూ తమ రంగుల ప్రపంచంతో చూపరులకు కనువిందు చేస్తున్నాయి రకరకాల పూల సుగంధాలన్నీ కలిసి ఆ పెరటి తోటలో సన్నని తెరలా అలముకున్నాయి

కుర్చీలో కూర్చుని కాఫీ త్రాగుతూ పేపర్ పఠనంలో మునిగిపోయారు కాంట్రాక్టర్ జగన్నాధంగారు

'విద్యార్థుల గుంపు ఆర్ట్సు కాలేజీ కెళ్తున్న బస్సుపై రాళ్ళు రువ్వారు డ్రైవర్ తీవ్రంగా గాయపడ్డాడు బస్ అద్దాలన్నీ పగిలిపోయాయి లాఠీ చార్జితో అనేక మంది విద్యార్థులు గాయపడ్డారు విద్యార్థి నాయకుడైన జయంత్‌ని పోలీసులు అరెస్టు చేశారు '

జగన్నాదంగారి మొహంలో రంగులు మారాయి

కోపంతో పిడికళ్ళు బిగుసుకున్నాయి

కసిగా చేతిలో ఉన్న పేపర్ని ఉండగా చుట్టి నేలమీదికి విసిరి కొట్టారు

అక్కడే ఉండి అంతా గమనిస్తున్న ఆయన అర్థాంగి జానకి గబగబా లేచి ఆశ్చర్యంతో 'ఏంటండీ ఏమైంది ఎందుకలా పేపర్ని విసిరి కొట్టారు?' ప్రశ్నించింది అయోమయంగా

'ఎందుకూ? అని మెల్లిగా అడుగుతావేంటి మన ముద్దుల కొడుకు చేసిన మన కార్యానికి ఆనందం పట్టలేక ' ఇంక మాట్లాడలేక ఒక్క ఉదుటున కుర్చీలోంచి లేచారు

'ఆనందమైతే మరి అలా విసిరేశా రెందుకు ' అర్థంకాక అమాయకంగా అడిగింది

'అయ్యో నా ఖర్మ ఇది చూడవే ఈ పేపర్ చూడు' అంటూ విసురుగా కింద పారేసిన పేపర్ని విప్పి భార్యకి చదివి వినిపించారు జగన్నాదంగారు

జానకి బాధతో తలదించుకుంది

'ఇప్పుడు బాధపడితే ఏం లాభం? నువ్వు చిన్నప్పట్నుంచీ చేసిన గారాబమే వాణ్ణిలా తయారు చేసింది నేనెంత వద్దని చెప్పినా విన్లేదు అయినా నా మాట నీ కెప్పుడు లెక్క ఉంది కనుక' కోపంతో కాస్త గట్టిగానే అన్నారు జగన్నాధంగారు

'అనండి అనండి నన్ను కాక మీరు ఇంక ఎవర్నంటారు అంటే మాత్రం ఎవరు పడ్తారు' జానకి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి

'ఇప్పుడు ఏడ్చి ఏం లాభం? ఈ కాంట్రాక్టర్ పని ఒక్క నిమిషం కూడా నన్నింట్లో ఉండనివ్వదు కదా ఎప్పుడైనా ఇద్దరం కలిసినప్పుడు, ఈ మధ్య ఇంటి పట్టున ఉండట్లేదు ఎక్కడి కెళ్తున్నావురా అని వాణ్ణి నేను కాస్త గదమాయించేసరికి వాడి నోట్లోంచి మాట రాకుండానే చదువుకోటానికి ఫ్రెండింటి కెళ్ళాడని నువ్వు చెప్పటం 'అవునవు'నని వాడు వంత పాడటం ఎప్పుడూ జరుగుతున్నదేగా '

'ఉవును, వాడు నాకలా చెప్పాడు అదే మాట మీకు చెప్పాను '

'చేసింది చాలక పైగా సమర్థించుకోవటం కూడాను వాడి గురించి నేనెప్పుడడిగినా నువ్వు సూటిగా ఎప్పుడు చెప్పావు మధ్య మధ్య పరీక్షలు కదా రెండ్రోజులు ఫ్రెండింట్లోనే ఉండి చదువుకుంటానన్నాడని చెప్తుంటావు వాడి చదువు చూశావుగా ఇలా ఉంది' అని చివరిమాట వత్తి పలుకుతూ ఆమెకేసి పేపర్‌కేసి మార్చి మార్చి చిరాకుగా చూడసాగారు

'ఇపుడు మనం దెబ్బలాడుకునీ ఏం లాభం? ముందు వాణ్ణి బైటపడేసే మార్గం ఆలోచించండి' అంది జానకి ఆందోళనగా

అదీ నిజమే ననిపించింది జగన్నాధంగారికి 'తప్పుతుందా మరి' అంటూ చెప్పులేసుకుని బైటికి నడిచారు జగన్నాధంగారు

★ ★

జగన్నాధంగారి మనస్సంతా చిందరవందరగా ఉంది ఉన్న ఒక్కగా నొక్క కొడుకునీ ఎలా అదుపులో పెట్టటమా అన్నది ఆయనకి పరిష్కారం కాని సమస్యలా తోచింది మొక్కయి వంగనిది మానై వంగుతుందా అన్న అనుమానం కూడా ఆయన్ని పీడించసాగింది

జయంత్ స్వభావంగా మొండివాడు తాను పట్టిన కుందేటికి మూడే కాళ్ళు అన్నంత మూర్ఖంగా వాదిస్తాడు

'ఏ సమస్య వచ్చినా మీరు బస్సుల్ని కాలేజీ ఫర్నిచర్ని ఎందుకు నాశనం చేస్తార్రా అవి పది మందికి ఉపయోగ పడతాయి కదా ఏదైనా సమస్య ఉంటే శాంతియుతంగా, చర్చల ద్వారా పరిష్కరించుకోవాలిగానీ ఇలా దౌర్జన్యానికి దిగటం మంచిది కాదురా' అని కొడుక్కి జగన్నాధంగారు అప్పుడప్పుడు చెప్తూనే ఉంటారు

'వాట్ డాడ్ మీరు అలా మాట్లాడ్తారేంటి? మేము ఇలా బస్సుల్ని నాశనం చెయ్యకపోతే ఎవ్వరూ మా మొహం చూడరు మా మాట అసలే వినరు ఇప్పుడు సొసైటీలో స్టూడెంట్స్‌కి ఎంత ప్రెస్టేజ్ ఉందో మీకేం తెల్సు ఇలా చెయ్యటం వలనే అందరూ మేమంటే భయపడి ఛస్తున్నారు అయినా గవర్నమెంట్ బస్సులు ఫర్నీచర్ నాశనం చేస్తే అదేదో మనింటి అద్దాలు పగలకొట్టినట్టు బాధపడ్తారేంటి, వాట్ ఫన్నీ ' అంటూ తేలికగా తీసి పారేశాడు జయంత్

జగన్నాదంగారికి ఒళ్ళుమండిపోయింది

కానీ దాన్ని బహిర్గతం చెయ్యటానికి ఇది సమయం కాదనుకుని సాధ్యమైనంత శాంతం వహించి నివురు గప్పిన నిప్పులా మారి—

'నీ ఉద్దేశ్యంలో గవర్నమెంట్ అంటే ఎదో మనకు సంబంధం లేని ప్రత్యేకమైన సెక్షన్ అనుకుంటున్నావేమో యూ ఆర్ ఫర్‌గెటింగ్‌దట్ దిస్ యీజ్ ఎ డెమొక్రటిక్ కంట్రీ కాబట్టి ప్రభుత్వమంటే ప్రజలే మనం 'పే' చేస్తున్న టాక్స్‌తోటి మనమే ఈ బస్సులు స్ట్రీట్ లైట్స్ వగైరాలను మన సౌకర్యంకోసం ఏర్పరచుకున్నామన్న సంగతి నువ్వు మర్చిపోతున్నట్టున్నావు

నీలా అందరికీ స్కూటర్లుండవు కదా నువ్విలా బస్సులు తగలపెడ్తుంటే వెహికల్స్ లేని వాళ్ళు ఎంత ఇబ్బంది పడ్తారో ఆలోచించావా ఇలా సమ్మెలు చేస్తూ మీ విలువైన కాలాన్ని ప్రజాధనాన్ని ధ్వంసం చేస్కోకండి తలక్రిందులుగా తపస్సు చేసినా గడచిపోయిన శిక్షణ క్షణాన్ని కూడా మన జీవితంలోకి మళ్ళీ తీసుకు రాలేమన్న సంగతి గుర్తుంచుకుంటే చాలు నువ్వు ఎలెక్ట్ అయిన స్టూడెంట్స్‌యూనియన్ ప్రెసిడెంట్‌వి కదా అదీగాక నీమీద అందరికీ గౌరవ భావముంది కనీసం నువ్వయినా మారితే నిన్ను చూసి మిగతా వారు కూడా మారుతారేమోనన్న ఆశయినా కలుగుతుంది నా మాట విన్రా' అని పరి పరి విధాలుగా కొడుక్కి నీతులు నూరిపోశారు జగన్నాధంగారు

'అబ్బ చాలా బోర్‌గా ఉంది డాడ్, అవతల నా ఫ్రెండ్స్ వెయిట్ చేస్తుంటారు నే వెళ్లాలి' అంటూ సమాధానంకోసం ఎదురు చూడకుండా తల ఎగరేస్తూ పడ్తున్న జుత్తుని వెనక్కి తోస్కుంటూ డ్రెస్ ఛేంజ్ చేస్కోటానికి తన రూమ్ కెళ్ళిపోయాడు జయంత్

తాను విసిరిన బంతి తిరిగొచ్చి తన మొహానికే కొట్టుకున్నట్లనిపించింది జగన్నాధంగారికి

'ఇన్' చేస్కుని గాగుల్స్ పెట్టుకుని కుడిచేత్తో కీ చైన్‌ని తిప్పుకుంటూ బైటికొచ్చాడు జయంత్

గేట్ దగ్గర వెయిట్ చేస్తున్న ఫ్రెండ్స్ వైపు చెయ్యి

ఊపి 'హాయ్' అంటూ పలకరించి స్కూటర్ స్టార్ట్ చేసి వాళ్ళతో పాటు వెళ్ళిపోయాడు

జయంత్ ప్రవర్తనకు నిశ్చేష్టులయ్యారు జగన్నాథంగారు కొడుకు ముచ్చట పడ్డాడని ఇంట్లో అతని గదికి మాత్రమే అన్నీ అద్దాలు పెట్టించారు జగన్నాథంగారు

జయంత్ ఎంత మొండివాడో అంత మంచి కళాకారుడు అద్దాల కన్నింటికీ స్వయంగా అందమైన పెయింటింగ్స్ వేశాడు తన గదిని ఎప్పుడూ నీట్‌గా క్లీన్‌గా ఉంచుకుని ఎంతో ప్రాణప్రదంగా చూస్కుంటాడు పొరపాటున అద్దాలు పగల కొడుతుందేమోనని చివరికి పని మనిషిని కూడా తన గదిలోకి రానివ్వడు

ఇంటికి చుట్టా లెవరొచ్చినా పిల్లలు మాత్రం జయంత్ గది వాయలకు రావటానిగ్గూడా సాహసించరు మరి జయంత్ పెట్టిన బయం అటువంటిది!

ఎవరైనా అద్దాలు పగల కొడతారేమోనన్న ఊహ వస్తేనే చిగురుటాకులా నిలువెల్లా కంపించి పోతాడు

జయంత్‌కి తన గది అంటే అంత అపురూప మన్నమాట

మరుసటి రోజే యూనివర్సిటీలో డిటిన్షన్ పద్ధతి రద్దు చేయాలంటూ స్టూడెంట్స్ స్ట్రైక్ మొదలు పెట్టారు

హింస, దౌర్జన్యాలు ప్రచండ వేగంతో ప్రతి చోటా ప్రబలిపోతున్న ఈ రోజుల్లో గాంధీజీ చాటిన అహింసోద్యమాన్ని తలచుకోవటమే పెద్ద అపచారమేమో!

ఏ స్టూడెంట్‌నీ కాలేజీలోకి వెళ్ళనివ్వట్లేదు వారిని కాదని ఎదిరించి వెళ్ళేవారిని చావగొడుతున్నారు ఆర్ట్సు కాలేజీ బస్సే కాదు ఊళ్ళో ఏ బస్సుకి చలనం కనిపించినా రాళ్ళతో కొట్టి బస్సుని ఆపేసి అద్దాలు పగలకొట్టి, టైర్లలోంచి గాలి తీసేసి పంక్చర్ చేస్తున్నారు ప్రయాణీకుల్ని బలవంతంగా కిందికి దింపేసి స్టూడెంట్సంతా బస్సు



ల్లోపలి కెళ్ళి సీట్లన్నీ కోసేసి డ్రైవింగ్ వీల్స్‌ని పీకేస్తున్నారు

పోలీసులు వస్తున్న వార్త తెలిసి ఎక్కడి స్టూడెంట్స్ అక్కడ గప్‌చిప్‌గా పట్టుబడకుండా జాగ్రత్తపడుతూ తలా ఒక సందులోకి మాయమై పోయారు

జగన్నాథం గారికి మతి పోతోంది

స్టూడెంట్సంతా ఎందు కిలా నైతికంగా పాడయి పోతున్నారోనని ఆవేశపడి పోయారు

ఇలాగే సాగితే దేశం ఏమైపోతుంది?

ప్రగతి బాట నడవటం అటుంచి దేశం నానాటికీ దిగజారిపోదా?

ఒక్క స్టూడెంట్స్‌లో నే కాదు దాదాపు మిగతా అన్ని వర్గాల ప్రజల్లో కూడా హింస, దౌర్జన్యం, అరాచకం ఒకటేమిటి అన్నిరకాల దుష్ట శక్తులు పెచ్చు మీరిపోతున్నాయి

స్వార్థం అందల మెక్కుతోంది

ఇటువంటి దేశ విద్రోహ శక్తుల్లో తన కొడుకు కూడా ఒక పావులా మారటంతో జగన్నాథంగారు విలవిలలాడి పోయారు

దేశం మాట ఎలా ఉన్నా ముందు తన కొడుకుని మంచి బాటలోకి మళ్ళించగలిగితే పరోక్షంగా దేశానికి సేవ చేసినట్లేనని బావించి ఆవేశంతో ఊగి పోయారు

కొడుక్కి చెప్పి చెప్పి ఆయనింక విసిగి పోయారు

ఇంత తీవ్రంగా ఆలోచిస్తున్న జగన్నాదం గారికి వెనక్కి వెనక్కి చూస్కుంటూ ఇంటికి పరిగెత్తుకుంటూ వస్తున్న కొడుకు జయంత్ కనిపించాడు పోలీసులు తరుము తున్నట్టున్నారు

ఉవ్వెత్తుగా పొంగే సముద్ర కెరటంలా తన్నుకొస్తున్న కోపాన్ని ఆయన నిగ్రహించుకోలేక పోయారు

ఆయన భృకుటి ముడి వడ్డది

గబగబా లోపలికెళ్ళి రెండు నిమిషాలయ్యాక బైటికొచ్చారు– చేతిలో పెద్ద ఇనుప కడ్డీతో!

ఇంట్లో తండ్రి కోపంతో ఊగిపోతూ పట్టుకున్న

# బిగిసిన సంకెళ్ళు

ఇనుప కడ్డీని చూచి వ్వాట్, డాడ్ , ఏమైంది, మీ చేతిలో ఆ కడ్డీ ఏంటి  అని కంగారుగా అడిగాడు జయంత్

కొడుకు మొహం కూడా చూడకుండా జగన్నాదం గారు అమాంతం ఒక్క పరుగుతో జయంత్ గది కెళ్ళి ఆ గది, అద్దాలన్నింటినీ ఆ ఇనుప కడ్డీతో ఇష్టమొచ్చినట్టు పగల కొట్టేశారు

గదిలో ఉన్న ఫర్నీచర్నంతా వీదిలోకి విసిరేశారు కలలో కూడా ఊహించని ఈ హఠాత్పరిణామాన్ని చూస్తూ నిర్ఘాంతపోయి స్థాణువులా నిలబడి పోయాడు జయంత్

ఫర్నీచర్ని బైట విసిరేస్తుండగా ఈ లోకంలో కొచ్చిన జయంత్ అమాంతం పరిగెత్తి కెళ్ళి –

వాటీజ్ దిస్ డాడ్? మీకేమైనా పిచ్చి పట్టిందా? ఎందుకలా పగల కొడుతున్నారు వద్దు అలా చెయ్యకండి, నా ప్రాణం విలవిల లాడుతోంది వద్దు డాడీ డాడీ  అంటూ ఒక్క గావుకేక పెట్టి ఇంక వారించటం సాద్యంకాక తండ్రి మీదికి చెయ్యెత్తాడు జయంత్

అంతే!

ఒక్కసారిగా చేతిలో ఉన్న చిన్న కుర్చీని కింద పారేశారు జగన్నాథం గారు

ఆయన రౌద్రాకారం దాల్చారు

పిచ్చి నాకు కాదురా పట్టింది, తండ్రినే కొడ్తామని చెయ్యెత్తిన నీకురా పట్టింది పిచ్చి బస్సులన్నీ ఫర్నీచర్ని శివమెత్తినట్లు ధ్వంసం చేసిన నీకు నీ ఫ్రెండ్స్‌కి పట్టిందిరా పిచ్చి నీ ఫ్రెండ్స్ మాటిలా ఉన్నా నీ పిచ్చి వదల్చటానికే నేను తెగించి చివరికి ఈ పని చేశాను

కానీ ఇప్పుడు నీకెలా ఉంది?

పగిలిన ఈ ఒక్కొక్క గాజు ముక్క నీ గుండెకు గుచ్చుకోవట్లేదూ? బాదతో నీ మనస్సు నలిగి పోవట్లేదూ? ఇంతకు ముందు ఈ గదిలో నువ్వనుబవించిన సౌకర్యాలన్నీ నాశన మయ్యాయని నువ్వు విలవిలలాడట్లేదూ?

నువ్వు బస్సులన్నీ ఫర్నీచర్ని నాశనం చేసినప్పుడు ఆ సౌకర్యాల ననుభవిస్తున్న ప్రజానీకమంతా కూడా నీలాగే బాధ పడుతుందిరా వారు పడే బాదని దాని విలువను నీకు తెలియ జెప్పాలనే నేనీపని చేశాను అర్థమయిందా అంటున్న జగన్నాదంగారి స్వరం చివర్లో బాధతో జీరబోయింది

మేఘం వర్షించిన తరువాత ఆకాశం నిర్మలంగా ఉన్నట్టు కోపం తగ్గిన జగన్నాథం గారు కాస్త చల్లబడ్డారు

తండ్రి మాటలు జయంత్‌కి చెంపమీద చెళ్ళున కొట్టినట్లయ్యింది

డాడీ ' అంటూ పేలవంగా అరిచాడే గాని అవమాన బారంతో ఏమీ మాట్లాడలేక పోయాడు

జీప్‌ని అల్లంత దూరంలో ఆపి పరిగెత్తుకుంటూ వచ్చిన పోలీసులు జయంత్ చేతులకి బేడీలు వేశారు

జరుగుతున్న దంతా సినిమా రీలులా చూస్తూ అవాక్కయి నిలబడి పోయింది జానకి

*

జయంత్‌ని పోలీసులు తీస్కెళ్ళటం చూచిన ఆమెలో చైతన్యం కలిగింది

ఏవండీ అలా చూస్తూ నిలబడ్తా రేంటండీ వెళ్ళి వాణ్ణి విడిపించండి అంటూ ఏడుస్తూ జగన్నాదంగారి కాళ్ళా వేళ్ళా పడ్డది జానకి

కన్న కొడుకుని కళ్ళ ఎదుటే పోలీసులు సంకెళ్ళు వేసి తీస్కెళ్ళటం చూచిన జగన్నాథంగారి కన్న హృదయం కొద్దిగా కలుక్కుమంది

అయినా తమాయించుకున్నారు

తనను తాను నిగ్రహించు కున్నారు

జానకి నయనాలలోంచి కన్నీరు ఏరులై పారుతోందన్నా అతిశయోక్తి కాదేమో

కొడుకుని విడిపించమని ఆమె భర్తను శతవిదాలా ప్రాధేయ పడోతుంది

ఆయన బాధతో పళ్ళు బిగపట్టి చేతుల్ని వెనక్కి పెట్టి కళ్ళు గట్టిగా మూస్కున్నారు

చిన్నప్పట్నుంచీ జయంత్‌ని క్రమ శిక్షణతో పెంచలేక పోయిన అసమర్థత నాది అందుకే వాడు ఈనాడిల్లా మొండిగా తయారయ్యాడు జీవితంలో కాస్తయినా ఎదురు దెబ్బ తగిలితేగానీ వాడికి తెలిసిరాదు' అని స్వగతంగా అనుకుంటూ జగన్నాథంగారు శిలా ప్రతిమలా మౌనంగా నిలబడిపోయారే కాని ముందుగా అనుకున్న విధంగా తానే స్వయంగా పోలీసులకి ఫోన్ చేసి కొడుకుని అరెస్ట్ చేయించాడన్న విషయం మాత్రం తనలోనే దాచుకున్నారు జగన్నాథంగారు □



దృఢమైనవి, మన్నికైనవి
గట్టి నడకకి తగినట్టివి

# అదే శాండక్‌లోని అందం!



పవ్ మోక్ 22
బ్రౌన్
సైజ్: 6-9
రూ.32.95

వాతావరణం మంచైనా, చెడైనా
శాండక్ మీరు లెక్కించదగ్గ జోడు.
ఏళ్ళతరబడి మన్నేందుకు గాను బలంగా కొత్త
పి.వి.సి. కాంపౌండ్స్‌తో తయారైంది.
బాటా మిమ్మల్ని గురించి పట్టించుకుంటుంది
గనుక.

Sandak

Bata / BSC దుకాణాల్లో మాత్రమే లభిస్తున్నాయి.

అన్ని కాలాలలో వాడదగ్గది

ACIL/BATA-2/85 TEL



రాజ్యలక్ష్మి, శ్రీదేవి, కృష్ణ, 'పచ్చని కాపురం'లో



# సినిమా విశేషాలు

—జి.వి.జి.

## డైరెక్టర్ రాజాచంద్ర చిత్రాలు

ఓ తండ్రి తీర్పు చిత్రం హీరో మురళీ మోహన్‌కు, డైరెక్టర్ రాజాచంద్రకు మరింత ఇమేజ్‌లని సంతరించి పెట్టాయి వీరి సమ్మేళనంలో ఇల్లాలూ వర్ధిల్లు అనంతరం జూలైలో శోభన్‌బాబు, మురళీమోహన్, చంద్రమోహన్ నటించిన ముగ్గురు మిత్రులు చిత్రం విడుదలవుతుంది. రాజా చంద్ర దర్శకత్వం, సమర్పణలో ఇల్లాలు వర్ధిల్లు తర్వాత బొమ్మరిల్లు ఆర్ట్స్ ప్రొడక్షన్స్ నిర్మించే చిత్రం "పంచ వన్నెల చిలకలు ఈ చిలకలు' తల్లిదండ్రుల్ని కోల్పోయిన అయిదుగురు యువతులు వీళ్ళు ఎదుర్కొనే సమస్యలేమిటి?తమ జీవితాలను ఎలా కొనసాగిస్తారు? అనే ప్రాతిపదిక మీద అల్లబడిన కథ, అన్నారు రాజాచంద్ర

విజయవంతమైన తమిళ చిత్రం బందం ఆధారంగా ఎ వి ఎం ప్రొడక్షన్స్ ఆగస్ట్‌లో మొదలెట్టే చిత్రంలో శోభన్‌బాబు సరసన రాధిక నాయిక

కన్నడంలో తయారయ్యే ఇల్లాలూ వర్ధిల్లు చిత్రంలో సుమలత, అనంత్‌నాగ్ నాయికా నాయకులు. ఇవికాక రాజాచంద్ర డేట్స్ ఇవ్వాల్సిన చిత్రాలు మరికొన్ని ఉన్నాయి

"ఖూనీ" లో అహల్య, భానుచందర్





అంబిక, "దయ్యాల మేడ"లో

## చిరంజీవి, విజయ బాపినీడు కాంబినేషన్‌లో శ్యాంప్రసాద్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ చిత్రం

చిరంజీవి పక్కన సుహాసిని హీరోయిన్ ఆగస్ట్ 1 నుంచి షూటింగ్, అన్నారు విజయబాపినీడు ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో మగ మహారాజు అనంతరం శ్యాం ప్రసాద్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ నిర్మించే చిత్రానికి మాగంటి రవీంద్రనాథ్ చౌదరి నిర్మాత

## బాలకృష్ణతో జగపతి రాజేంద్ర ప్రసాద్ దర్శకత్వంలో నవకాంత్ తొలి చిత్రం

నేను చిత్ర నిర్మాత అవడానికి ప్రేరణ కలిగించిన ఏ బి రాజేంద్ర ప్రసాద్‌గారే నా మొదటి చిత్రాన్ని డైరెక్ట్ చేసి పెట్టడానికి అంగీకరించడం నాకెంత ఆనందం కలిగించిందో వర్ణించలేను అందుకు మరింత చేయూత నిస్తూ ప్రోత్సహించిన నా మిత్రులు నిర్మాత వెంకటాప్పగారు ఈ చిత్ర



గొల్లపూడి మారుతీరావు, 'రామరాజ్యం వచ్చింది"

సమర్పకులు కోరిన వెంటనే కాల్షీట్ ఇచ్చి తోడ్పడ్డారు హీరో బాలకృష్ణ" వీరందరి ఆశీస్సులతో, అండతో ముందుకు సాగుతున్నాను, అన్నారు ప్రముఖ చాయా గ్రాహకుడు నవకాంత్ ఈయన ఛాయాగ్రహణం నిర్వహిస్తూ నిర్మించే శ్రీ సాయిబాబా ఇంటర్నేషనల్ వారి తొలి చిత్రంలో బాలకృష్ణ సరసన విజయశాంతి నాయిక జనవరి 1 న మద్రాసులో చిత్రీకరణ మొదలవుతుంది ఆ తర్వాత జనవరి, ఫిబ్రవరి, మార్చి నెలల్లో 11-20 తేదీల మధ్య మూడు షెడ్యూల్స్‌లో షూటింగ్



'ఇల్లాలూ వర్ధిల్లు"లో సుమలత, మురళీమోహన్

పూర్తవుతుంది కొంతబాగం విశాఖ పట్నణంలోను, పాటలు డార్జిలింగ్‌లోనూ చిత్రీకరింపబడతాయి సత్యానంద్ సంభాషణకర్త ఆత్రేయ గీతాలకు చక్రవర్తి స్వరకర్త

## కృష్ణంరాజుతో జి. రామమోహనరావు దర్శకత్వంలో నూతన సంస్థ చిత్రం

అసలే పొడగరి అందులో బొబ్బిలి బ్రహ్మన్న చిత్రంతో ఇంకా ఎంతో ఎదిగిన కృష్ణంరాజుతో రారాజు తర్వాత జి రామమోహనరావు దర్శకత్వంలో తయారయ్యే ఆర్ కె ఫిలిమ్స్ చిత్రం షూటింగ్ సెప్టెంబర్, అక్టోబర్, నవ్వంబర్ నెలల్లో జరిగే మూడు షెడ్యూల్స్‌లో ముగిసి, సంక్రాంతి కానుకగా విడుదలవుతుంది మా హీరో ఆశీస్సులతో మా సంస్థను ప్రారంభించాం రసవత్తరమైన స్క్రీన్‌ప్లే, సంభాషణలను పరుచూరి బ్రదర్స్ సమకూర్చారు, అన్నారు నిర్మాత ఎస్ వెంకటనారాయణ చక్రవర్తి సంగీతం, ఎస్ వెంకటరత్నం చాయ, ఎస్ రాంబాబు నిర్వహణతో రవిబాబు సహ నిర్మాత

మాధవి, "కుంకుమరేఖ" లో



# కొత్త లిరిల్
# ఇది తాజాదనపు సరికొత్త అనుభూతి!

లిరిల్ కొత్తదిగా మారింది!
నిలిచి గుబాళించే కొత్త సువాసనతో...
ఆకర్షణీయమైన కొత్త ప్యాక్‌లో!







**లిరిల్**
తాజాదనపు సబ్బు

మిమ్మల్ని నవనారిగా రూపొందిస్తుంది



ఇది మన భారతం లో రాజేష్, శ్యామలగౌరి

## సినిమా

### భాగ్యరాజా, రాధికలతో "ఫిలిం స్టార్"

బాగ్యరాజా నటించిన తమిళ చిత్రాలలో విశేషాదరాబిమానాలు చూరగొన్న చిత్రం 'కుమరి పెణ్ణిన్ ఉళ్ళత్తిలే దీన్ని తెలుగులో ప్రముఖ దర్శకుడు ఎన్ గోపాలకృష్ణ నిర్మిస్తున్నారు సినిమా జీవితం పూలపాన్పు వంటిది కాదు ముళ్ళబాటను దాటితే గాని తారాపథాన్ని అందుకోలేరని తెలిపే పాత్రలో రాదిక అత్యద్భుతంగా బాగ్యరాజాతో పోటీ పడి నటించింది దబ్బింగ్ కార్యక్రమాలన్నీ పూర్తయ్యాయి త్వరలో విడుదల చేస్తున్నాం, అన్నారు ఎన్ గోపాలకృష్ణ సరోజినీ దేవీ ఆర్ట్స్ పతాకంలో తయారైన ఫిలిం స్టార్స్ చిత్రంలో విజయబాబు మరొక కీలకమైన పాత్రను నిర్వహించారు వీటూరి మాటలు, పాటలు రాశారు ఇషాన్ ఆర్య ఛాయ, శంకర్ గణేష్ సంగీతం, దాశరధి కూర్పుతో ఆర్ శంకర్ దర్శకుడు

### జూలై చివరి వారంతో "కాలరుద్రుడు"

మారుతున్న ప్రేక్షకుల అబిరుచులకు అనుగుణంగా ఒక యాక్షన్ ఓరియెంటెడ్ చిత్రాన్ని రూపొందించాలనే నా వాంఛ శ్రీ సద్గురు సినీ ఆర్ట్స్ సమర్పకులు గోటేటి శ్రీ రామారావుగారి ద్వారా తీరింది తమిళంలో యాక్షన్ హీరోగా పేరు మోసిన త్యాగరాజు ప్రజ్ఞావంతుడు సాహస ప్రమాదకరమైన సన్నివేశాల్లో కూడా డూప్ లేకుండా చేశారు ఈయన మన పేకేటి శివరామ్ అల్లుడు ఈ చిత్రం విడుదలయ్యాక ఈ యువకుడు యాంగ్రీ యంగ్‌మాన్‌గా తెలుగులో కూడా బిజ స్టార్ అయిపోతాడు అన్నారు డైరెక్టర్ కట్టా సుబ్బారావు జూలై చివరి వారంతో విడుదలయ్యే కాలరుద్రుడు చిత్రంలో సరిత షావుకారు జానకి, జయంతి గొల్లపూడి మారుతిరావు నూతన్‌ప్రసాద్, అనూరాధ చిలకరాధ శైలజ తక్కిన పాత్రధారులు వారో త్యాగరాజు ఇలా అన్నారు నేను తమిళంలో తీసిన కొంబెరి మూక్కన్ అనే చిత్రం సూపర్ హిట్ అయింది దానికి చేర్పులు మార్పులతో కాలరుద్రుడు చిత్రాన్ని మరింత ఆకర్షణీయంగా తీసిన ఈ యూనిట్‌ను మనసారా అభినందిస్తున్నాను అన్నారు ఉపద్రష్ట సాయి సంభాషణల కర్త ఇళయరాజా స్వరకల్పనలో ఆత్రేయ వేటూరి గీతాలు రాశారు రంగారావు శిల్పం గాంధి కూర్పు జి వి రావు నిర్వహణతో జి నారాయణరావు నిర్మాత



ముహూర్తం వేళకి నేను తుమ్మటం వలన నేను వెయ్యాల్సిన హీరోయిన్ పాత్ర నీకిచ్చారు అంతే గానీ నీ నటనా సామర్థ్యం చూసి కాదు.

### త్రినాధరావు దర్శకత్వంలో "ఆడది – అర్ధరాత్రి"

"జూన్ చివరివారం నుంచి షూటింగ్ ఉంటుంది హారర్ చిత్రం', అన్నారు పి త్రినాధరావు ఈయన కథ, దర్శకత్వంలో పి రమణమూర్తి నిర్మించే 'ఆడది – అర్ధరాత్రి" చిత్రంలో సిల్క్‌స్మిత, హరిప్రసాద్ ఆదిగా గలవారు పాల్గొంటారు



"రణరంగం'లో సత్యనారాయణ, జయమాలిని

చదలవాడ తిరుపతిరావు

సమర్పించు

అనూరాధ ఆర్ట్ కంబైన్స్

# దాంపత్యం

SREE PUBS

దర్శకత్వం

**ఎ.కోదండరామిరెడ్డి**

నిర్మాత

**ఆర్.వి.కృష్ణారావు** M.Sc

కృష్ణా:




సత్యమూర్తి చక్రవర్తి నవకాంత్

గుంటూరు:పద్మావతి పిక్చర్స్. వెస్ట్:ఉషా పిక్చర్స్. ఈస్ట్: శ్రీజగన్నాథ్ ఫిలింస్. వైజాగ్-శ్రీకాకుళం: విజయలక్ష్మి ఫిలింస్

నెల్లూరు:వెంకట శ్రీనివాస ఫిలింస్. నైజాం: శ్రీగీతా ఫిలింస్. సీడెడ్: వియం.సి

# దావణగెరే

## ఫ్యాషన్ వస్త్రములు



మెత్తగా నేసిన ప్రియా *టెరీన్ చీరలు ఆకర్షణీయమైన డిజైన్లలో, అందమైన రంగుల్లో మీ వంటిపై మెరిసిపోయే చీరలు.

**ది దావణగెరే కాటన్ మిల్స్ లిమిటెడ్**
**హనుమంతప్ప బిల్డింగ్స్,**
**చిత్రదుర్గ రోడ్, దావణగెరే 577 002.**

**షోరూములు :**
**కావేరి భవన్, బెంగుళూరు-560 009.**
**దాజీబాన్ పేట్, హుబ్లి-580 020.**
**చిత్రదుర్గ రోడ్, దావణగెరే-577 002.**

*టెరీన్—తెరీనాం రిజిస్టర్డ్ ట్రేడ్ మార్క్

THOMAS/8403-C/TEL

"సాగర మధనం"లో దేవికారాణి



# శోభన్‌బాబు, కోదండరామిరెడ్డి సమ్మేళనంలో శ్రీ కామాక్షి కమర్షియల్స్ తొలి చిత్రం

"జూన్ 7 నుంచి 20 వరకు ఫస్ట్ షెడ్యూల్ పూర్తయింది," అన్నారు నెల్లూరుకు చెందిన ప్రముఖ పారిశ్రామికవేత్త డి. శివప్రసాదరెడ్డి. ఈయన నిర్మించే పై సంస్థ చిత్రంలో శోభన్‌బాబు, సుహాసిని, విజయశాంతి, రావు గోపాలరావు, వేలు, వీరభద్రరావు, సుమిత్ర వగైరా నటవర్గం. జూలై 11 నుండి 20, ఆగస్టు 1 నుండి 10 వరకు తక్కిన షెడ్యూల్స్ జరుగుతాయి. గణేష్ పాత్రో సంభాషణలు, వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, సుధాకరరెడ్డి ఛాయ, తోటతరణి శిల్పం, శివశంకర్ నృత్యాలు, శరత్ సహ దర్శకత్వం, మోహన్ ప్రొడక్షన్, వెంకటరత్నం కూర్పుతో ఎ. కోదండరామిరెడ్డి దర్శకుడు. □

ఊర్వశి, "కాలరుద్రుడు"లో



## సీరియల్

# ముసురు వెలిసింది

## కళ్యాణీ సోమరాజ్

**జరిగిన కథ–4:** కట్నం ప్రసక్తి లేకుండా మూర్తి, రమ రిజిస్టర్ మేరేజి చేసుకుంటారు రమని వెంటబెట్టుకొని వచ్చిన మూర్తిని తల్లి తండ్రి తూలనాడినా పెద్దన్న, వదిన సీత ఆదరిస్తారు రమని చూడడానికి వచ్చిన మూర్తి పెద్దక్కయ్య, చిన్నక్కయ్య రమని ఈటెలలాంటి మాటలతో బాదిస్తారు మర్నాడు మూర్తి చేత, రమచేత సత్యన్నారాయణ వ్రతం చేయించి, ఆ పీటల మీదే మూర్తి చేత రమకి 'మూడు ముళ్ళు' వేయించారు రమని తీసుకుని మూర్తి తన చిన్నన్నయ్య విశ్వనాధ్ ఇంటికి విజయవాడ వెళతాడు విశ్వనాధ్ యశోద వీరిని చూడగానే ఎంతో ఆనందపడిపోతారు మూర్తి అన్న కూతురు సుమతి రమేష్ అనే అతన్ని ప్రేమిస్తుంది సుమతి వల్ల రమకి తమింటి స్థితిగతులు తెలుస్తాయి మూర్తి చెల్లెలు ప్రసూనకి, సుమతికి సంబందాలు నిశ్చయమవుతాయి సుమతి ఇంట్లోంచి వెళ్ళిపోతుంది రమే సుమతిని రమేష్ దగ్గరికి పంపించి ఉంటుందని ఇంటిల్లిపాదీ అనుమానిస్తారు

(గత సంచిక తరువాయి)

సుమతిక రమేష్క రాత్రే దుర్గ కొండమీద పెళ్లి అయిపోయిందని, ప్రస్తుతం అత్త మామలతో తిరుపతి వెళ్తారన్న బోగట్టా తీసుకొచ్చారు కొంతమంది సుమతి నాకు పుట్టలేదనుకుంటా! అంటూ భర్తను పట్టుకొని ఏడ్చింది సీత ఇంత జరుగుతున్నా ఏమి పట్టించుకోనట్లు వుండిపోయాడు రామనాదం

అప్పటికప్పుడు సుమతి విషయం పెళ్లివారికి తెలియచేసి క్షమార్పణలు చెప్పుకున్నారు అయితే ఈ విషయం తెలిసి ప్రసూనని చెసుకుంటానన్న పెళ్లి సంబందంవాళ్ళు మాకు మీ, సంబందం' వద్దు ఏమొ ఈ అమ్మాయి ఎలాటిదో, మాకు ఆ సాంప్రదాయంలో పిల్లవద్దు అని– నిర్మొహమాటంగా అనేసారు ఈ విషయంలో బయపడుతున్నారు ఇంట్లో అంతా? చివరకు ఇంకో అయిదువేలు ఎక్కువిస్తామని ప్రాదెయపడేసరికి మెత్తబడి 'ఊ' అన్నారు

ప్రసూన పెళ్లి ఏ గొడవలేకుండా ప్రశాంతంగానె అయిపోయింది కాని ఎవరి మొహంలోను అనుకున్నంత సంతోషంలేదు రమ పెళ్లి సమయంలో తప్పించి మిగిలిన సమయం అంతా తన గదివిడిచి బయటకు రాలేదు మూర్తి రమ్మనమని అడగలేదు యశోద రమను మామూలుమనిషిని చెయాలని చూసంది కాని రమ మనసులో అందురూ కలిసి తనని చేసిన అవమానం అగ్నిజ్వాలలా రగులుతూనే వుంది

* * * *

పెళ్లిహడావుడి అంతా ఇంచుమించు సర్దుమణిగింది మంచిరోజు చూసి చీర సారెలతో ప్రసూన అత్తగారింటికి వెళ్లింది

అత్తవారింటిక వెళుతూ అందరికి చెప్పిన ప్రసూన మాట మాత్రం కూడ వెళ్లివస్తానని చెప్పలేదు రమ దానికూడ ఏం బాదపడలేదు ఈ ఇంట్లోవాళ్ల మనస్తత్వం ఇంతే! అని సరిపెట్టుకుంది

ఆ రోజు మూర్తి తీరుబడిగా కన్పించాడు ఎప్పుడూలెనిది చెట్లకు నీళ్ళు పోస్తున్నాడు రమకి మనసులో మెదులుతున్న విషయం చెప్పటానిక అది మంచి సమయంగా తోచింది

మీతో ఒక విషయం చెప్పాలనుకుంన్నాను అంది రమ చాలారోజుల నుంచి రమ ముబావంగా వుండటం గమనిస్తూనె వున్నాడు మూర్తి

సారీ రమా! ఆ రోజు అందరూ నిన్ను చాలా హీనంగా మాటలన్నారు అందరి తరపున క్షమార్పణ కోరుకుంటున్నాను

అందరితో పాటు మీరు నమ్మారు కదా!

అంతకు ముందు నీ మాటల బట్టి నమ్మాల్సి వచ్చింది కాని నా ఊహ తప్పని ఈ మద్యే తెలిసింది

ఆకాశవాణి పలికిందా!

లేదు సుమతే స్వయంగా చెప్పింది

సుమతా!

'ఔను నాలుగు రోజుల క్రితం రమెష్, సుమతి నా డిస్పెన్సరీక ొచ్చి అన్ని విషయాలు వివరించారు వాళ్లిద్దరు ముందరె ప్లాన్ వేసుకుని వున్నారట అవకాశం చూసుకుని సుమతి ఇంట్లో నుంచి పారిపోయిందట నీ మీద అందరు నిందవెసారని తెలిసి చాలా బాధపడింది నిన్ను క్షమించమంది

పోన్లేండి ఇప్పటికైనా నామీద నమ్మకం కలిగింది

నేను మిమ్మల్ని వేడుకునేది ఒక్కటె నన్ను నరకం నుండి తప్పించండి నేన ఇంట్లో ఈ మనుషుల మద్య వుండలెను

రమా! వాళ్లేదో ఆవెశంలో అసలు విషయం తెలియక నిన్ను అన్నారు నీ మీద ప్రెమలేక కాదు

హుం ప్రేమ అత్తక మామక కోడళ్ల మీద ప్రెమ కూడదు మనదేమి రక్త సంబంధం కలిసిన పెళ్లికాదె కనీసం కట్నంకూడ ఇవ్వలేదు. పైకన్నా ప్రెమ ప్రకటించటానిక ఆ వెదవ కట్నం ఇవ్వ లేదనెగా నన్నింత హీనంగా చూస్తున్నారు నాన్నగారిక వెంటనే టెలిగ్రామ్ ఇద్దామనుకుంటున్నాను మీ రెటు ఎంతో చెప్పండి ఈ క్షణంలో ఆ డబ్బు మీ వాళ్లక పడేసి నేను విముక్తురాలినౌతాను వాళ్లక్కావలసింది డబ్బేగా?

నువ్వలా చేసిన క్షణంలో నేను జీవన్మృతుడని అవుతాను అది నీకిష్టమైతె అలాగె కట్నం ఇవ్వు

మీకేమండి మీరు బాగానే వున్నారు నేను పడె చిత్రహింస మీకెలా చెబితె అర్థం అవుతుంది

అందుకు నన్నేం చెయమంటావ్! మా వాళ్ళు దాచస్తపు బావాలు జీర్ణించుకు పోయిన మనుషులు వాళ్ళు ఎటు మారరు నువ్వైనా కాస్త సర్దుకు పోకూడదు!

సర్దుకుపోపటం అసలు ఈ పదం మా ఆడవాళ్లకోసమె పుట్టిందేమో! చర్చి దగ్గరనుంచి పనిమనిషి వరకు ప్రతివాళ్లతోను సర్దుకుపోపటమే! ఎంత తెలిగ్గా చెప్పగలరండి మీరు

రమా! ఇంతకీ నువ్వనేదేమిటి?

మనం విడిపోదాం మీరు ఎలాగు తెనాలలోనే ప్రాక్టీసు పెట్టారు కదా! అక్కడే మనం ఇల్లు తీసుకుని వుందాం

అదిసరే రమా! నీ మీద అసలే కోపంగా వుందంటున్నావు కదా! మనం విడిపోతే అంతా నిన్నే ఆడిపోసుకుంటారు

పోనివ్వండి వాళ్ళు నన్ను మంచిగా అనుకోవాలని నా కిష్టంలేని బ్రతుకు బ్రతకలేను

సారీ రమా! ఈ విషయంలో నేనశక్తుడిని అమ్మా నాన్న బతికుండగా మనం విడిపోవటం బాగుండదు వాళ్ళ హృదయాల్ని బాదిస్తుంది

వాళ్ళకేనా హృదయముంది

ప్లీజ్ రమా! నన్ను అర్థం చేసుకోటానికి ప్రయత్నించు కని పెంచి చదువు చెప్పించి నన్నింత వాడిని చేసారు అందుకు ప్రతిపలంగా బాధ్యతా రహితంగా నాదారి నేను చూసుకోనా!'

కని– పెంచి– అదేదో చాలా త్యాగం చేసినట్లు మాట్లాడతారేం కన్నాక పెంచటం వాళ్ళవిధి అలాగే పిల్లలకు విద్య చెప్పించటం వాళ్ళ కర్తవ్యం కొడుకు పుట్టగానే, పాడిగేదెలాగా లాభ, నష్టాలు బేరీజు వేసుకుంటు వాళ్ళు మిమ్మల్ని పెంచటం, మీరు పెరిగాక అదంతా వాళ్ళు చేసిన త్యాగం అనుకుంటూ స్వతంత్రమైన అభిప్రాయాలు లేకుండా ఇలా ప్రవర్తించటం బాగుంది అయినా నాకు అన్నయ్య అనాడే చెప్పాడు వాడుత్త అపర శ్రీరామచంద్రమూర్తే! అని

మరి తెలిసి ఎందుకు పెళ్ళిచేసుకున్నావ్!

బుద్ధిలేక గిరుక్కున తిరిగి వెళ్ళిపోయింది రమ నివ్వెర పోయాడు మూర్తి

## 8

రమకి భవిష్యత్తు ఒక సవాలైంది మూర్తి తనకేమీ సహాయం చేసేలా కన్పించలేదు పోని కాలక్షేపంకోసం ఉద్యోగం చెద్దామన్నా ఎక్కడా ఖాళీలులేవు అందరి మధ్య బ్రతుకుతూ ఎవ్వరికి ఏమికాక ఏకాకిలా జీవించటం అంటే రమకి పిచ్చెక్కుతోంది! అలా అని మద్రాస్ వెళ్ళిపోదామా అని వున్నా అక్కడ అందరూ చూసావా! అనాడే మేము చెబితే వినకుండా పెళ్ళి చేసుకున్నావ్ ఇంకేం అనుభవించు అంటూ ఎద్దేవా చేస్తారేమో నన్న శంక

అలాంటి సమయంలోనే రమ వేలు విడిచిన మేనత్త రమ ఇంటిని వెతుక్కుంటూ వచ్చింది ఆమె భర్త చిన్నప్పుడే మిలటరీలో పని చేస్తూ చనిపోయాడు ఆమె కొక కొడుకు అతను కూడ మిలటరీలోనే చేరాడు మొదటినుంచి ఆ మేనత్తకి రమని తన కొడుకు సుందరానికి చెసుకోవాలని వుండేది అయితే మిలటరీ ఉద్యోగంలో వున్నవాడికి నేను నా కూతుర్ని ఇవ్వనని రమ తండ్రి నిరాకరించడం వలన ఆమె రమని కోడలుగా చేసుకోవాలన్న ఆశ అయితే వదులుఖుందికాని ఆపేక్ష ఏమి తగ్గలేదు మద్రాస్‌నుంచి రమ ఇంత దగ్గర్లోకి వచ్చిందని బంధువుల ద్వారా తెలుసుకొని వచ్చింది రంగనాయకి

రమని చూస్తూనే ఆపేక్షగా కౌగలించుకొని ఏమే! చిన్నప్పుడెప్పుడూ ఆంటీ, ఆంటీ అంటూ నా చెయి పుచ్చుకొని తిరిగేదానివి అప్పుడే నన్ను అంతగా మరిచిపోయావా!

లేదు ఆంటి నువ్వు సుందరం బావ దగ్గరుంటున్నావేమోననుకున్నాను ఇంకా టీచర్‌గా పని చెస్తున్నావా?

ఔను ఇంకో రెండు మూడేళ్ళల్లో నేను రిటైరవబోతున్నాను అయినా మీ బావ ఎక్కడో దేశం కాని దేశంలో వుంటున్నాడు ఎప్పుడైనా వెళితే రెండు మూడు వారాలు వుండి రావటమె కాని ఎక్కువ రోజులు వాడి దగ్గర తో చదు



"ఇంతకీ బావ పెళ్ళి చేసుకోలేదా!"

"లేదు. శెలవలకొచ్చినప్పుడల్లా పిల్లల్ని చూడటం, ఎవరూ నచ్చలేదంటూ వంకలు చెప్పటం. వాడికి నేను వుండగా పెళ్ళి అయ్యేలా లేదు."

"బావకి ఎలాంటి అమ్మాయి కావాలేమిటి?"

"భగవంతుడు దయతలచలేదు కాని నిన్ను చేసుకోవాలని వాడు ౘ లా కలలు కన్నాడు. సరేలే ఆ విషయాలు ఇప్పుడెం కుగాని, ఎలా వున్నావ్!

# ముసురు వెలిసింది

అంత సిటీలో పెరిగినపిల్లవు ఈ వూళ్ళో అడ్జస్ట్ అవగలుగుతున్నావా!

ఆఁ ఎడ్జస్ట్‌కాక చేసేదేముంది అన్నట్టు మంచి ఎండలో వచ్చావు. మంచి నీళ్ళిస్తానుండు '

అబ్బ ఎండలకేం బాగ్యమే తల్లి. గుంటూరులో అయితే ఎండలు భరించలేకుండా వున్నాము ఇంతకీ నువ్వు ఉద్యోగం చేస్తున్నావా!

లేదు కాని ఇంక చేయాలనుకుంటున్నాను మీ స్కూల్లో ఏమైనా పోస్ట్ ఖాళీగా వుంటే చెప్పు ఆంటీ!

'నీకా! ఎమ్ ఎస్ సి ఫస్ట్ క్లాసులో పాసై ట్యూటర్‌గా పనిచేసి, స్కూల్లో ఏం ఖర్మ కాలేజిలో ఎక్కడైనా ట్రై చేయకపోయావా!

ఈ వూళ్ళోచేయాలనిలేదు అయినా ఖాళీలులేవు.

పొరుగూరులో ఉద్యోగం అంటె మూర్తి ఒప్పుకుంటాడా! అయినా ఇప్పుడంత అవసరం ఏమొచ్చింది నీకు

రమ క్లుప్తంగా తన పరిస్థితి చెప్పింది రంగనాయకితో

' బాగానేవుంది. పెళ్ళి అయి ఏడాదన్నా పూర్తి కాలేదు. అప్పుడే కలతలా! నా మాట విని మూర్తిని ఒప్పించి విడిగా ఇల్లు తీసుకోండి అన్ని వాటంతట అవే సర్దుకుంటాయి అంతేగాని వాళ్ళకోసం మీ రిద్దరూ విడిగా బతకటం ఎందుకు

వాళ్ళు మేము విడిగా వుంటేనే సంతోషిస్తారు ఆంటీ అయినా నాకు కొన్నాళ్ళు అతన్నుండి దూరంగా వుందామనివుంది. నా విలువ అప్పుడైనా తెలుస్తుందేమో

పిచ్చి పిల్లలా మాట్లాడక ఏదో నిన్ను చూసి పోదామని వచ్చానుగాని ఇలా మిమ్మల్ని విడదీద్దామన్న ఊహతో రాలేదు. పెళ్ళి చేసుకున్నాక ఏదో ఒకరికొకరు సర్దుకుపోవాలి లోపాలులేని వాళ్ళుండరు రమా!

రంగనాయకి సాయంకాలం బాగా చల్లబడేవరకు వుండి బయలుదేరింది రమ ఆమెను రిక్షా ఎక్కిస్తూ కూడ ఉద్యోగం విషయం గుర్తు చేసింది రంగనాయకి ఆఁ చూద్దాంలే! అంటూ వెళ్ళిపోయింది.

* * * * *

మూర్తి సాయంకాలం త్వరగా వచ్చాడు రమ ఈమధ్య చాలా డల్‌గా ముబావంగా వుండటం అతనికి బాధగా వుంది. అలా అని రమ కోర్కె తీర్చి తల్లి, దండ్రికి బాధ కలిగించలేడు. రమ ఎలాగైనా రాజీపడకూడదా! అని అతని ఆశ

'రమా! త్వరగా రెడి అవు సినిమాకి వెళదాం!"

నేను రాను

ఎందుకని

నాకు రావాలని లేదు కాబట్టి.

అదే, కారణం ఏమిటా అని.

కారణంచెప్పి ప్రయోజనం ఏముంది?"

అంటే!

'నన్ను విసిగించద్దు. ప్లీజ్! నా కెక్కడికీ వెళ్ళాలని లేదు. వదిలేయండి!"

"నా కళ్ళ ముందర అంత దీనంగా, తిరగద్దు. నే భరించలేను"

అలా అని నా సమస్యను పరిష్కరించలేరుకదా!"

"విడిపోవటం తప్ప ఇంకేమైనా కోరు. కాదనను. చూడు రమా! అమ్మా, నాన్న పెద్దవాళ్ళు అయిపోయారు. వాళ్ళు సుమతి చేసిన పనికే కుళ్ళి కుళ్ళిపోతున్నారు. నాన్నగారికి ఈ వూళ్ళో వున్న పేరు, ప్రతిష్ట నీకు తెలియదు. అలాంటిది ఇప్పుడు నలుగురు 'మీ మనుమరాలు కులం కాని వాడితో లేచిపోయిందేమిటి" అని మొహంమీద అడుగుతుంటే ఆయన నలుగురిలోకి రాలేక ఇంట్లోనే వుంటున్నారు ఇదా సమయం మనం విడిపోవటానికి."

మీరీ కబుర్లన్నీ చెప్పి నా మనసును సంతోషపెట్టలేరు సమాధాన పరచలేరు. నేను అందరితోను కలిసి వుండాలని ఎన్నో ఊహించి, నా వాళ్ళతో వాదించి ఈ పెళ్ళి చేసుకున్నాను ఇక్కడ కొచ్చాక కాని అది చాలా కష్టమని తెలియలేదు మీరు ఎంతసేపు మీ వాళ్ళ గురించె ఆలోచిస్తారేం మీ భార్య గురించి ఆలోచించరేం భర్త హృదయంలో బార్య ఒక్కతే ప్రత్యేకస్థానం కావాలని కోరుకుంటుందండీ! కాని నాకా బాగ్యం లేదు మీ హృదయంలో వున్నది ఒక గ్రూప్ ఫోటో అందులో అందరితో పాటు నాకు స్థానం వుండచ్చేమో కాని ఆ స్థానం నాకు అక్కర్లేదు అంది రోషంగా

సరే రమా! ని ఇష్టం నువ్వు నేనేం చెప్పినా వినవు అర్థం చెసుకోవు మనం ఎలా ప్రేమించి పెళ్ళి చేసుకున్నామా! అని నాకీ మధ్యే సంధేహం వస్తోంది

పోన్లెండి. ఇప్పుడు మాత్రం మించిపోయిందేముంది నన్ను వదిలించుకొని మీ వాళ్ళు కోరిన కట్నం ఇచ్చె మరో అమ్మాయిని చెసుకోండి అటు వాళ్ళు సంతోషిస్తారు, ఇటు మీకు

చ. నోటికి ఎంతొస్తే అంత అనేస్తావ్! విసురుగా వెళ్ళిపోయాడు మూర్తి!

ప్రసూన శ్రావణమాసం నోముల కొచ్చింది సుందరమ్మ శ్రావణ పట్టీ అంటూ ఘనంగా వాళ్ళకు పంపటం, వాళ్ళు తిరిగి పంపటాలు అయ్యాయి

"మీ కోడలుచెత నోములు పట్టించలేదా! ఇంతకీ మీ కోడలు ఏం తీసుకొచ్చింది శ్రావణ పట్టీ! అంటూ సాయంకాలం పేరంటంలో సుందరమ్మను నిలేసారు అమ్మలక్కలు.

"అయ్యో నోములు వ్రతాలు కూడాను దాని కిలాటివాటిమీద నమ్మకం లేదుట. ఇక శ్రావణ పట్టీ కూడాను ఖర్మ కట్నానికి గతిలేదు ఇంక ఇలాటి సరదాలు కూడానా! అంటూ అక్కసుగా అంది

"సుమతి గురించి ఏమీ తెలియలేదా!

ఆఁ ఇంక దాని గొడవ మి కెందుకు అది చచ్చిన వాళ్ళల్లో జమ అని ఆనాడే అనుకున్నాం" అత్తగారి మాటలకు సీత మనసు కలుక్కుమంది ఏదో ఆవేశంలో తనూ అలాగే అనుకున్నా ఆమె మాతృ హృదయంలో సుమతి ఎలా వుందో అన్న బెంగ లేకపోలేదు.

రంగనాయకి దగ్గరనుంచి వెళ్ళాక ఎలాంటి సమాచారము రాలేదు రమే ఒకరోజు తనే గుంటూరువెళ్ళి ఆమెను స్కూల్లో కలుసుకుంది. రమ ఇంత పట్టుదలగా వుందని ఆమె ఊహించలేదు అప్పటికప్పుడు ఏదో టెంపరరీ పోస్ట్ వుంటే హెడ్ మిస్ట్రస్‌తో మాట్లాడి రమ కిప్పించింది రమ జాయినింగ్ ఆర్డర్స్ తీసుకుని తృప్తిగా ఇంటికి వచ్చింది

ఉదయమే తన సూట్‌కేస్ సర్దుకుంటున్న రమనుచూసి మద్రాస్ వెళుతున్నావా' అని అడిగాడు మూర్తి

"లేదు గుంటూర్‌లో జాబ్ దొరికింది వెళుతున్నాను

మూర్తి అర్థం కానట్టు చూసాడు

"ఉద్యోగమా! ఎవరికి? ఎందుకు?

"నాకే. బ్రతకటంకోసం.

"ఇప్పుడెందుకింత హఠాత్తుగా ఉద్యోగం

"బాగుంది. అమ్మ పెట్టా పెట్టదు 'అడుక్కు తినా నివ్వదు అన్నట్టు మీరెలాగు నా మాట వినరు ఇంకా నా దారి నేను చూసుకోక చేసేదేముంది '

"నీకు నేను ఏం లోటు చేసాను.

"అంటె మీ దృష్టిలో తిండి, గుడ్డ, నీడ ఇవుంటే చాలనుకుంటా.'

"నిన్ను ప్రెమగానే చూసుకుంటున్నానే

"ప్రేమ. అవును ఎంత ఘాటు ప్రేమ నన్ను నలుగురు కలసి అనరాని మాటలంటుంటే చీమ కుట్టినట్టు కూడ అన్పించలేదు ఆనాడు మీకు భార్యను గౌరవించలేని వాళ్ళను వెనకేసుకొస్తూ, వాళ్ళకోసం అన్ని చంపుకుని పడుండమనటం ఇదంతా మి దృష్టిలో ప్రెమ అసలు మీక్కావలసింది సాంప్రదాయం కోసం బలి అయిపోయే నోరు వాయిలెని ఓ మూగది మీ కోరికలు తీరుస్తూ, మి మాటలను శిరసావిస్తూ, మి వాళ్ళు ఎన్ని మాటలన్నా అవన్ని

# మొదలెట్టండి యివాళే - 6 వారాల్లో చూడండిక -

## వంటిచాయను మెరుగుపరిచే క్రీమ్

# క్లియర్·టోన్

## మీ రంగురూపాల్ని కొత్తదనంతో రూపొందిస్తుందిక

**1వ వారం**



కోమలమైన చర్మం కేవలం మూడు రోజుల్లో !

**2వ వారం**



మొటిమల గుర్తులు పోతున్నాయి...
అబ్బ ఎంత హాయి !

**3వ వారం**



చూసావా, మోచేతులు నిగనిగలాడుతున్నాయి అప్పుడే.

**4వ వారం**



"నీ ముఖానికి చాయవచ్చి మెరుస్తోంది" అంది ఓ మిత్రురాలు

**5వ వారం**



ఎండలోకెళ్ళినా, వాడదిక చర్మం

**6వ వారం**



ఇప్పుడు నేనున్నా క్లియర్ టోన్ బృందంలో

క్లియర్·టోన్‌లోని అద్వితీయ సూత్రీకరణ. మీ చర్మానికి మరింత మెరుపునిస్తూ మరింత మెరుగైన చాయతో రూపొందిస్తుంది, సున్నితంగా. అంతేకాదు క్లియర్·టోన్‌లో గల ఒక ప్రత్యేకమైన పదార్థం, అసహ్యమైన ఆ మచ్చల్ని పోగొడుతుంది దీనిలోగల ప్రభావమైన 'మాయిశ్చరైజర్' మీ చాయను యితరులు మెచ్చుకునేటంతగా మెరుపునూ, మృదుత్వాన్నీ యిస్తుంది ఇదంతా కేవలం 6 వారాల్లో.

చక్కని ఆ ఫలితాలు అలాగే వుండటానికోసం క్లియర్·టోన్‌ని రోజుకు రెండుసార్లు రాసుకుంటూ వుండండి, యింట్లోనూ, ఎండలో బయిటికి వెళ్ళినప్పుడూను

మెరుగైన ఫార్ములా
తిరుగులేని ఫలితం




# క్లియర్·టోన్

మెరుగైన వంటిచాయలోని రహస్యం - సహజమైన రీతిలో

లండన్ · పారిస్ · న్యూయార్క్

daCunha/NICL/76/85 TL



# ముసురు వెలిసింది

దీవనెలుగా బావిసూ్త భక్తిగా వాళ్ళను సేవించాలి ఒక్క మాటలో చెప్పాలంటే ఒక జీవచ్ఛవం కావాలి నేను రక్త మాంసాలున్న మనిషిని మీరు అనుకున్నట్లుగా నేను సర్దుకోలేని మనిషిని నాకంటూ ఒక అందమైన సంసారం కావాలని కలలు కనే స్త్రీని నా కోరిక ఇక తీరేలా లేదు నే వస్తాను అడ్రస్ మీ టేబుల్‌మీద పెట్టాను రాదలచుకుంటె రావచ్చు అంటూ రప్ మని సూట్‌కేస్ మూసి వేసి లాక్ చేసి చెప్పులు వేసుకొని గబగబ క్రిందకు దిగి వచ్చింది

ఆ రోజు చివరి శ్రావణ మంగళవారం అని ప్రసూన అత్తగారు బర్త వచ్చారు చెల్లెల్ని చూద్దామని పై ఆడబడుచులు కూడ ఇంట్లో వున్నారు అందుకని ఇల్లంతా హడావిడిగా వుంది రమ వెళ్లటం ఎవ్వరూ చూడలేదు రమకూడ లోపలికి వెళ్లి ఎవ్వరితోను చెప్పకుండా రిక్షాఎక్కింది

9

రమని ఇల్లు దొరికే వరకు రంగనాయకి తన ఇంట్లోనే వుంచుకుంది తెలిసినవాళ్ల ద్వారా మూడోనాటికి పక్క వీదిలోనే రెండు గదులున్న డాబా పోర్షన్ సంపాదించింది రంగనాయకిని తోడుతీసుకెళ్ళి ఇంటిక్కావలసిన సామాను, తెచ్చుకుంది కాలేజి లెవెల్ నుంచి కాన్వెంటుకు దిగజారటం రమకు మొదట్లో కష్టంగా వున్నా, రానురాను అలవాటుపడింది

తీరుబడిగా తల్లికి అన్ని విషయాలు వివరిసూ్త ఉత్తరం వ్రాసింది రమ దానికి తల్లి ఏం వ్రాస్తుందో అన్న బయంతోనే ఎదురు చూడసాగింది ఆమె ఎక్కువ రోజులు ఎదురు చూడకుండానే, నాలుగోరోజే సమాదానం వ్రాసింది తల్లి నువ్వు చేసినపని ఏమి బాగలేదే రమ! అప్పుడు మా మాట వినకుండా పెళ్లి చేసుకున్నావ్! పెళ్లంటె బొమ్మలాటకాదు నీ ఇష్టం వచ్చినప్పుడు కలిసివుండటానికి, కానప్పుడు విడిపోవటానికి, మూర్తి అన్ని ముందరే చెప్పి నీఇష్టం మీదటె పెళ్లిచేసుకున్నాడు అతనిదేమి తప్పులేదు అంతగా అక్కడ వుండలేకపోతే, మూర్తిని మెల్లగా ఒప్పించి విడిగా ఇల్లు తీసుకోవాలిసింది అంతేగాని నువ్వు ఒంటరిగా ఉద్యోగం చేసుకుంటూ ఎక్కడో వుండటం మా కెవరికి నచ్చలేదు నువ్వు నా మాట మీద ఏమాత్రం గౌరవం వున్నా మూర్తి దగ్గరకు వెళ్లిపోతావని తలుస్తాను అంటూ తల్లి వ్రాసిన ఉత్తరాన్ని రెండు మూడుసార్లు చదువుకుంది

ఆమెకెలా సమాదానం వ్రాయాలో రమకు అర్ధంకాలేదు కాగితం చేత పుచ్చుకుని ఆలోచిసూ్త వుండిపోయింది ఇంతలో కారుహారన్ విన్పించి కుతూహలంగా బయటకొచ్చి చూసింది మూర్తి కారు ఓ పక్కన పార్క్‌చేసి దిగివస్తున్నాడు రమకింత హఠాత్తుగా భర్తను చూచేసరికి చాలా ఆనందం కలిగింది పరుగున అతనికి ఎదురు వెళ్లింది

'అమ్మాయిగారికి నేనింకాగుర్తున్నానా!

పెళ్లి చేసుకున్న భర్తని మర్చి పోయేటంత దుర్మార్గురాలినేం కాను అంది గోముగా

అందుకేనా ఒక్క ఉత్తరం కూడా వ్రాయలేదు

సారీ మెల్లగా వ్రాద్దామనుకున్నాను

'మెల్లగానా?

రమ గబగబా వెళ్లి కాఫి కలిపి తీసుకొచ్చింది

ఇల్లు సౌకర్యంగా వుందా' అన్నాడు కప్పుతీసుకుంటూ

ఊఁ చూస్తున్నారుగా! అయినా ఒక్కదాన్ని నాకెంత కావాలి

అప్పుడప్పుడు నాలాటి అతిథులొస్తే

మీరు అతిథులు కారు

మరి

నా ప్రాణేశ్వరులు అంటూ భుజం మీద తలవాల్చి అంది ఆమెకు మూర్తిని చూడగానే ఎంతో సంతోషంగా వుంది ఆ రోజు తను అతనితో దెబ్బలాట అయ్యాక మళ్ళీ ఇలా కలుసుకుంటారని, అందులోనూ ఇంత త్వరలో అనుకోలేదు

అందుకేనా మనకీ వియోగం

స్వయం కృతాపరాదం అనుకోకూడదా!

మూర్తి మాట్లాడలేదు

నామీద కోపంతో మళ్లీ ఇంక రారనుకున్నాను

నాకు నీమీద ఎప్పుడూ కోపంలేదు రమా

ఆ రాత్రి రమ తెల్లని మల్లెపూవులాంటి వెంకటగిరి చీరకట్టుకుని తలలో సన్నజాజులు తురుముకుంటూ వచ్చింది మూర్తి పడుకుని తెలుగు మాగ్జైన్ తిరగేస్తున్నాడు రమ వచ్చి పక్కన కూర్చోగానే, పుస్తకం మూసేసూ్త–

రమా! నువ్వు మన ఫస్ట్‌నైట్‌నాడు కూడ ఇంత అందంగాలేవు నవవధువులా వున్నావు అంటూ దగ్గరకు తీసుకున్నాడు

రమ సిగ్గుపడుతూ తలవాల్చుకుంది

రమా! ఇంత దూరంగా వుంటూ ఎందుకీ ఇక్క కు రావటం పోవటం

శిక్ష అనుకుంటె రావటం మానేయండి

అబ్బ అంతలోనే కోపం చాలా మొండి పిల్లవు

మీకంటేనా!

మాటకు మాట చెబుతావు

సమాదానం చెప్పటం తప్పైతే మరి మాట్లాడను

ఎన్నాళ్లిలా?

బగవంతుడు కరుణించె వరకు

దేముళ్లేం చేస్తారు పని కట్టుకొని కాపురాలు పాడు చేసుకుంటుంటే

నేను కాపురం పాడు కావాలని అనుకోవటంలేదు

మరి

నా విలువ మీకు అర్ధమయ్యే వరకు

నీ విలువేమిటో నా కెప్పుడూ తెలుసు రమా! అంటూ ఆణి ముత్యాన్ని జార విడుచుకోవాలనుకొనె మూర్ఖుడిని కా . అందుకని నేనింత దూరం నిన్ను వెతుక్కుంటూ రానక్కర్లేదు

రమ ఆలోచిసూ్త వుండిపోయింది

కారు ఇక్కడే వుంచిపోదాం అనుకుంటున్నాను నీ కోసం మీ నాన్నగారిచ్చారు ,

నా కెందుకు కారు అయినా దాని డబ్బు నాన్నగారికి ఇచ్చేసారుగా ఇంక బెంగ ఎందుకు

మూర్తి మర్నాడు మధ్యాహ్నమె సూట్‌కేసు స తుంటే బెంగగా చూసింది రమ

అప్పుడే వెళతారా!

మూర్తి నవ్వుతూ చూసాడు అతని చూపులోని బావాన్ని చదవలేనంత అమాయకురాలు కాదు రమ

వెళ్లాలి రమా! నాన్నగారికి ఒంట్లో బాగుండటంలేదు

ఏమైంది

'బి పి కాస్త ఎక్కువగా వుంది

రమ ఇంకా తరచి అక్కడి విషయాలు అడగలేదు ఇంకా అక్కడి గొడవ నీ కెందుకంటాడేమో మూర్తి అని ఆమె బయం

(ఇంకా ఉంది)

# విదేశాలలో విజయభేరి మ్రోగిస్తున్న హిప్నో థెరపీ


బి. వి. పట్టాభిరామ్

మెజిషియన్ అండ్ హిప్నాటిస్టు


భారత దేశంలో తప్ప అభివృద్ధి చెందిన దాదాపు అన్ని దేశాలలోనూ వైద్య శాస్త్రంలో ఒక భాగంగా గుర్తింపు పొంది, లబ్ధ ప్రతిష్టులైన వైద్యులచే ఒక శాస్త్రంగా అంగీకరింపబడిన హిప్నోథెరపీ' ఇపుడు ప్రపంచం నలుమూలల్లోనూ విజయభేరి మ్రోగిస్తూ చరిత్ర సృష్టిస్తోంది

హిప్నోథెరపీ అనే పదం హిప్నాటిజంనుంచి ఉద్భవించింది హిప్నాటిజం అనేపదం 1843 లో కనిపెట్టబడినా, ఈ శాస్త్రం ఉనికి క్రీస్తుకాలంనుంచి ఉందనడానికి ఋజువులున్నాయి చరిత్ర పుటలను తిరగేస్తే హిప్నాటిజం అధ్యయనం చేసినవారు, అభ్యసించి, చికిత్సలు చేసినవారు ఎందరో తారసిల్లుతారు వారికి అతీంద్రియ శక్తులున్నాయని అనుకునేవారు అప్పటి ప్రజలు అయితే ఈ శాస్త్రాన్ని ఒక వైద్య శాస్త్రంగా ప్రజల్లో పరిచయం చెయ్యాలనే దృఢ సంకల్పంతో డాక్టర్ మెస్మర్ (1734–1815) చాలా కృషి చేసారు తను చేసే చికిత్సలో అయస్కాంతపు ముక్కలు కూడా వాడుతూ ఎంతో మందికి స్వస్థత కలిగించాడు కానీ ప్రజలకు ఆ శాస్త్రంమీద పూర్తి నమ్మకం కలుగలేదు ఆ చికిత్సను మెస్మర్ కనిపెట్టాడు కాబట్టి మెస్మరిజం అని వ్యవహరించేవారు అనంతరం డాక్టర్ ఇలియట్ సన్ ఈ శాస్త్రాభివృద్ధికి కొంత కృషిచేసి కొత్త టెక్నిక్‌లను కనిపెట్టి తన పేషెంట్లపై ప్రయోగాలు జరిపి కొంతవరకు సత్ఫలితాలను రాబట్టగలిగారు కానీ వీరు ప్రజలందరి విశ్వాసాన్ని చూరగొనలేకపోయారు ఈ శాస్త్రం, దెయ్యాలు భూతాలు, మంత్ర తంత్రాలకు సంబంధించిన క్షుద్ర విద్య అనే భయం ఆరోజుల్లో చాలా మందికి దృఢంగా నాటుకుపోయింది

ఆ సమయంలో చీకటిలో కాంతిరేఖలాగ ఉదయించాడు డాక్టర్ జేమ్స్ బ్రయిడ్ (1795–1880) ఈ శాస్త్రాన్ని క్షుణ్ణంగా అభ్యసించి ఈ శాస్త్రానికి హిప్నాటిజం అనే నామకరణం చేసాడు "హిప్నో అంటే గ్రీకు భాషలో నిద్ర అని అర్థం నిద్రలాంటిస్థితికి సంబంధించిన శాస్త్రం కాబట్టి దీనిని హిప్నాటిజం అని వ్యవహరించాలని ప్రకటించి, ఆ శాస్త్రం పట్ల ప్రజలకున్న భయాలను, అనుమానాలను నివృత్తిచేసి హిప్నాటిజంకు జీవం పోసారు డాక్టర్ బ్రయిడ్‌తో పాటు డాక్టర్ లీచాల్ట్ అనే వైద్యుడు కూడా ఈ శాస్త్ర అభివృద్ధికి ఎంతో కృషి చేసారు ప్రొఫెసర్ చార్కట్ అనే న్యూరాలజిస్ట్ కూడా ఈ శాస్త్రానికి ఒక గుర్తింపు తీసుకువచ్చారు

ఇంతకూ అసలు హిప్నాటిజం అంటే ఏమిటి? ఆ స్థితి ఎలా ఉంటుంది? ఆ స్థితికి లోనయినందువల్ల లాభం ఏమిటి?, అనే విషయాలు చర్చిద్దాం

హిప్నాటిజం అంటే ఒక నిద్రలాంటి స్థితిని అనుభవించడం, కానీ అది నిజంగా నిద్రకాదు ఆ స్థితిలోని వ్యక్తి ఇటు పూర్తిగా జాగృతావస్థలో ఉండడు, అటు సుషుప్తావస్థలో ఉండడు మధ్యస్థంగా ఉండే మగత నిద్రలాంటి స్థితిలో ఉంటాడు ఆ స్థితిలో అతనికి చుట్టూ జరుగుతున్నవి తెలుస్తున్నా అతను అవి గమనించడు ఒక రకమైన మత్తుగా ఉండే, ప్రశాంతమైన మానసిక స్థితిని అనుభవిస్తూ హిప్నాటిస్టు చెప్పేమాటలనే వింటుంటాడు ఆ స్థితిని పొందడానికి ముందుగా ఆ వ్యక్తి అంగీకరిస్తేనే అది జరుగుతుంది ఏ వ్యక్తిని కూడా, అతని ఇష్టానికి వ్యతిరేకంగా ఎవరూ హిప్నటైజ్ చెయ్యలేరు అలా ఎవ్వరైనా చెయ్యగలమని ప్రకటిస్తే వారికి ఈ శాస్త్రం గురించి అణుమాత్రమైనా తెలియదని ఖచ్చితంగా చెప్పవచ్చు ఈ శాస్త్రంలో చాలెంజిలకు తావు లేదు నన్నెవరూ హిప్నటైజ్ చేయలేరు అని మొండిగా

1881 వ సంవత్సరంలో ప్రొఫెసర్ చార్కాట్ అనే న్యూరాలజిస్ట్ హిప్నోథెరపి ద్వారా హిస్టీరియా పేషెంటుకు చికిత్స చేస్తున్న చిత్రం



## విదేశాలలో విజయభేరి మ్రోగిస్తున్న హిప్నోథెరపీ......

భీష్మించుకుని, హిప్నాటిస్టు ఇచ్చిన సందేశాలను స్వీకరించని వారిని ఎవరూ చేయలేరు

హిప్నాటిజం అభివృద్ధికి విజ్ఞులు ఎంత ప్రచారం చేసినప్పటికీ, కొంతమంది ప్రజలలో ఇప్పటికీ ఈ శాస్త్రం పట్ల కొన్ని అపనమ్మకాలున్నాయి ముఖ్యంగా 'మానసికంగా బలహీనంగా ఉన్న వారిని మాత్రమే హిప్నటైజ్ అవగలరు' అనే నమ్మకం చాలా మందికి ఉంది కానీ ఇది వాస్తవానికి విరుద్ధం. నిజానికి మానసికంగా బలహీనంగా ఉన్నవారు పిచ్చివారు హిప్నాటిజంకి పనికిరారు కారణం వారు హిప్నాటిస్టు చెప్పినట్లుగా ఊహించుకోలేరు అదే మానసికంగా, ఆరోగ్యంగా ఉన్నవారు చక్కగా ఊహించుకోగలరు అతిసునాయాసంగా హిప్నటైజ్ కాగలరు అలాగే ఒక వ్యక్తిని హిప్నటైజ్‌చేసి అతనిచేత హత్యలు చేయించవచ్చు అతను మామూలుగా ఉన్నపుడు చెయ్యని పనులు చేయించవచ్చు సెక్స్ నేరాలు చేయించవచ్చు అనే భయం కూడా చాలా మందికి ఉంది కానీ అందులో ఏమాత్రమూ నిజం లేదు వాస్తవానికి హిప్నటైజ్ కాబడిన వ్యక్తి, ఆ స్థితిలో కూడా తనకు ఇష్టంలేని ఏ ఒక్క పనీ చెయ్యడు తన ప్రవర్తనకు విరుద్ధంగా ఉండే ఏ పని చెప్పినా అతను చెయ్యడు కాబట్టి ఇక్కడ ముఖ్యంగా మనం గమనించవలసిన దేమిటంటే హిప్నాటిజం అంటే చాలామంది అనుకుంటున్న 'వశీకరణ శక్తి' కాదు "సమ్మోహన శక్తి అసలేకాదు కొంతమంది అజ్ఞానులు తమకున్న అల్పజ్ఞానంతో ఈ శాస్త్రానికి విపరీతార్థాలు సృష్టించి ఈ శాస్త్ర అభివృద్ధిని ఆటంకపరుస్తున్నారు ఇది సామాజిక నేరం కూడా నిజానికి హిప్నటైజ్ కాబడిన వ్యక్తి హిప్నాటిక్ పరిభాషలో ఇతనిని సబ్జక్టు అంటారు), తనకు తాను సహకరించుకున్నందువలననే ఆ స్థితికి వెళ్ళగలిగాడు హిప్నాటిస్ట్ కేవలం ఒక పని ముట్టు మాత్రమే

హిప్నాటిజం చేసేటపుడు సబక్టును, కంఫర్టబుల్‌గా ఉండే కుర్చీలో కూర్చోబెట్టి, లేదా మంచంమీద పడుకోబెట్టి, హిప్నాటిస్టు నెమ్మదిగా సజెషన్స్ ఇవ్వటం ప్రారంభించినపుడు, సబ్జక్టు కళ్ళు మూసుకుని అతను ఇస్తున్న సజెషన్లను ఊహించుకుంటూ ఉండాలి మీరు బాగా విశ్రాంతి తీసుకుంటున్నారు మీకు మత్తుగా ఉంది, మీ కనురెప్పలు బరువెక్కుతున్నాయి మీరు హాయిగా నిద్రలోకి జారుకుంటున్నారు' అని అంటున్నపుడు సబ్జక్టు అదే ప్రకారంగా ఊహించుకోవాలి అలా చేసిన పక్షంలో హిప్నాటిస్టు సజషన్స్ పూర్తి చేసే సమయానికి సబ్జక్టు ఆరోగ్యకరమైన, ప్రశాంతమైన నిద్రలో ఉంటాడు నిద్రలోకి పంపడానికి సజెషన్స్ ఇవ్వటంలో మూడు రకాల టెక్నిక్కులున్నాయి ఒక్కొక్క టెక్నిక్ ఐదు నిమిషాలనుంచి ఇరవై నిమిషాలు సబ్జక్టును బట్టి పడుతుంది

హిప్నాటిక్ నిద్రలో మూడు రకాల స్థితులుంటాయి వాటిని (1) లెతార్జిక్ స్థితి (2) హల్యూసినేషన్ స్థితి (3) సోమ్నాంబులిస్టిక్ స్థితి అంటారు లెతార్జిక్ స్థితిలో సబ్జక్టు తన చుట్టూ జరుగుతున్నవి బాగా తెలుస్తూ ఉంటాయి కానీ మత్తుగా ఉంటుంది అందుచేత కళ్ళు మూసుకుని విశ్రాంతి పొందుతూ ఉంటాడు హల్యూసినేషన్ స్థితిలో కొంచెం గాఢమైన నిద్రలో ఉంటాడు ఆ స్థితిలో అతని చేతిమీద సూదితో గుచ్చుతూ, నీకు నొప్పిలేదు నీ చెయ్యి తిమ్మిరి ఎక్కినట్లుగా ఉంది అంటే అతను నొప్పి లేదంటాడు ఆ స్థితిలో అతని పంచేంద్రియాలను కంట్రోల్ చేయవచ్చు ఇక సోమాంబులిస్టిక్ స్థితిలో గాఢమైన నిద్రలో ఉంటాడు ఆ స్థితిలో అతనికి ఇష్టమైన ఏ సజెషను ఇచ్చినా అది అతని సబ్‌కాన్షస్ మైండ్ పైన ముద్ర పడి పోతుంది నిద్ర లేచిన తరువాత అదే ప్రకారం నడుచుకుంటాడు ఉదాహరణకు ఒక వ్యక్తికి సిగరెట్లు కాల్చడం మానాలని ఉంటుంది కానీ మానలేడు అటువంటి "వారిని ఈ స్థితిలోకి పంపి వారిని సిగరెట్లు కాల్పించడం మాన్పించవచ్చు అదే ప్రకారంగా అతను మానదలుచుకున్న దురవాట్లన్నీ అతని చేత మాన్పించవచ్చు అతను పూర్తిగా మానడానికి ఐదారుసార్లు హిప్నటైజ్ చేయవలసి ఉంటుంది దురలవాట్లే కాకుండా, మానసికంగా వచ్చే రుగ్మతలను, ఆత్మ విశ్వాసం లోపించడంవలన వచ్చే బయాలను, ఆందోళనలను, సమస్యలను కూడా హిప్నాటిజం ద్వారా నయం చేసుకోవచ్చు ఈవిదంగా చేసే చికిత్సను హిప్నోదెరపీ అంటారు

హిస్టీరియా, ఎలర్జీ, నత్తి, నిద్రలేమి నిద్రలో నడవటం, ప్రారంబ దశల్లో ఉన్న డయేరియా, ఆస్మాలు, అజీర్ణం, వాంతులు, అన్ని రకాల ఫోబియాలు (భయాలు), ఎక్కిళ్ళు, పక్కలు తడపటం, అతి త్రాగుడు, నపుంసకత్వం, సెక్స్‌లో పాల్గొనటానికి అసమర్థులు అనుకోవటం దూమపానం, ఆడవాళ్ళలో ఫ్రిజిడిటీ, క్రమపద్ధతిలో లేని ఋతుస్రావం లాంటి కొన్ని లక్షల కేసులు వివిద దేశాలలోని హిప్నోదెరపిస్టులు ఇప్పుడు అతి సునాయాసంగా నయం చేయగలుగుతున్నారు ఇపుడిపుడే మన దేశంలో కూడా కొందరు ఇవి చేయగలుగుతున్నారు కానీ ఒక ముఖ్య విషయం ఇక్కడ జ్ఞప్తికి పెట్టుకోవలసిన దేమిటంటే శారీరక లోపం ఏమీ లేకుండా కేవలం మానసికంగా ఊహించుకుని, భయపడి తెచ్చుకున్న అనారోగ్యానికే ఈ శాస్త్రం అద్భుతంగా పని చేస్తుంది కాబట్టి హిప్నో దెరపిస్టు తన చికిత్స ప్రారంబించేముందు, రోగికి శారీరకంగా ఎటువంటి లోపం లేదు అనేది నిర్ధారణ చేసుకుంటాడు

హిప్నోథెరపీ ద్వారా చికిత్స చేయటంలో కూడా టెక్నిక్కులున్నాయి ఉదాహరణకు నత్తి ఉన్న వ్యక్తిని హిప్నటైజ్ చేసి నీకు నత్తి తగ్గిపోతుంది, నత్తి తగ్గిపోతుంది అంటే తగ్గదు అతనిని సోమ్నాంబులిస్టిక్ స్థితిలోకి పంపి, అతని చిన్నతనం జ్ఞప్తికి తీసుకురావాలి (ఏజ్ రిగ్రెషన్) అక్కడినుంచి ఏ వయస్సులో నత్తి ప్రారంబమయిందో మెల్లిగా ఒక్కొక్క సంవత్సరం పెంచుకుంటూ రావాలి అతను చెప్పిన తరువాత, ఏ పరిస్థితిలో నత్తి వచ్చిందో తెలుసుకుని, దానికి తగ్గ సలహాలు ఇవ్వాలి



అతనిచేత కొన్ని మాటలు మాట్లాడించాలి ఏ పదాలు పలికితే నత్తి ఎక్కువగా వస్తుందో అవి బాగా పలికించాలి వారితో మీరిక స్పష్టంగా మాట్లాడగలరు కొత్తవారితో మరింత స్పష్టంగా మాట్లాడగలరు అంటూ వారికి ధైర్యం చెప్పి, మామూలు స్థితిలోకి తీసుకు రావాలి అలాగే లావుగా ఉన్నవారు సన్నబడటానికి, నిద్రలోకి పంపి 'మీరు సన్నగా అయిపోతారు అంటే అవరు వారిని గాఢ నిద్రలోకి పంపి వారు సన్నబడితే వచ్చే లాభాలను చెప్తూ, కొవ్వును పెంచే పదార్థాలు తినకుండా ఉండటానికి సలహాలు, వారు రోజూ వ్యాయామం తప్పకుండా చేయడానికి సలహాలు ఇవ్వాలి కాబట్టి హిప్నోథెరపిస్టు కేవలం హిప్నటైజ్ చేస్తే సరిపోదు అతనికి వైద్య శాస్త్రంతో బాగా పరిచయం ఉండాలి మెడిసిన్ చదవకపోయినా, శాస్త్రం క్షుణ్ణంగా తెలియాలి

హిప్నోథెరపీ వలన కలిగిన సత్ఫలితాలను చూసిన తరువాత బ్రిటీషు ప్రభుత్వం 1952 లో హిప్నాటిజం చట్టాన్ని పార్లమెంటులో ప్రవేశపెట్టింది అందులో క్లాజు 2 (1) ప్రకారం హిప్నోథెరపీని అంగీకరించవచ్చు కానీ మనస్తత్వశాస్త్రం తెలియకుండా చేయటం నేరం అంతేకాక హిప్నాటిజం కేవలం డబ్బుకోసం వినోద ప్రదర్శనలు చేయటం కూడా శిక్షార్హం అని ఉంది అదే ప్రకారం అమెరికాలో కూడా హిప్నోథెరపీని ప్రభుత్వం గుర్తించింది కానీ హిప్నాటిజం వినోద ప్రదర్శనను గుర్తించలేదు దీనికి ఒక బలమైన కారణం ఉంది కొంతమంది స్వార్థపరులైన హిప్నాటిస్టులు తమ స్వంత మనుషులను ప్రదర్శనలకు తీసుకువెళ్ళి అక్కడ వారిని హిప్నటైజ్ చేసినట్టు నటించి, ప్రేక్షకులను మోసం చేయటం జరిగింది కానీ ఇపుడు పరిస్థితి అలాలేదు హిప్నాటిజం ఒక శాస్త్రమని ప్రజలు కూడా తెలుసుకున్నారు ప్రేక్షకులు హిప్నటైజ్ అవుతున్నారు తిరిగి ప్రభుత్వం గుర్తింపుకై రెండు దేశాల్లోనూ ఇపుడు హిప్నాటిస్టులు ఎంతో కృషి చేస్తున్నారు ఇండియాలో ముఖ్యంగా మన ఆంధ్రదేశంలో హిప్నాటిజం వైజ్ఞానిక ప్రదర్శనలిస్తున్న యువ కళాకారులుజాతీయస్థాయిలో గుర్తింపుకై ప్రయత్నిస్తున్నారు

ఇంగ్లండు, అమెరికా దేశాల్లోనే కాక ఇతర దేశాల్లో కూడా ఇప్పుడు 'హిప్నో థెరపీ'ని గుర్తించారు ఫలితాలను పొందుతున్నారు. ఈ శాస్త్రం ఎంతటి ప్రాచుర్యం పొందిందో తెలియటానికి ఒక ఉదాహరణ ఏమిటంటే, నేను బ్యాంకాక్‌లో ఒక హిప్నో థెరపిస్టును కలిసాను అతని ఇంటి ముందు మెడికల్ షాపులాగ ఒక చిన్న కొట్టు ఉంది అందులో మందులులేవు-అన్నీ టేప్ రికార్డర్ కేసెట్లే ఒక్కొక్క కేసెట్‌లో ఒక్కో మానసిక వ్యాధికి సజెషన్స్ ఉంటాయి ఆ రుగ్మత ఉన్నవాళ్ళు ఆ కేసెట్‌ను వారం రోజులు పెట్టుకుని సిన్సియర్‌గా వింటే ఆ జబ్బు నయమయి తీరుతుంది అని చెప్పాడు ఆ హిప్నోథెరపిస్టు, అక్కడ చాలామంది డాక్టర్లు ఇది సైడ్ బిజినెస్‌గా చేస్తున్నారు ఆ కేసెట్లు వారు లండన్‌నుంచి దిగుమతి చేసుకుంటున్నారు వారివద్ద బాగా అమ్ముడుపోయే కేసెట్ "పెయిన్‌లెస్ డెలివరీ"ది అంటే నొప్పులు లేకుండా ప్రసవం చేయించే సజెషన్లు గలది




బాంక్ ఆఫ్ బరోడా (విజయవాడ) స్టాఫ్ క్లబ్‌వారు ఇటీవల తమ 13వ వార్షికోత్సవం సందర్భంగా ఏర్పాటు చేసిన కార్యక్రమాలలో జాదురత్న బి వి పట్టాభిరామ్ ఇంద్రజాల హిప్నాటిజమ్ ప్రదర్శనలు జరిగాయి ఆ సందర్భంగా క్లబ్‌వారు శ్రీ పట్టాభిరామ్‌కి ఘన సన్మానం చేశారు శ్రీ పట్టాభిరామ్‌ని పుష్పమాలాలంకృతుల్ని చేస్తున్న క్లబ్ సభ్యులు శ్రీ ఎం విజయకుమార్‌ని చిత్రంలో చూడవచ్చు

ఇంతటి అద్భుతమైన శక్తి గల ఈ హిప్నోథెరపీకి మనదేశంలో ప్రభుత్వం గుర్తింపు లేకపోయినా, కనీసం డాక్టర్ల గుర్తింపు కూడా లేదు దీనికి కారణం వారికి ఈ సైన్సుమీద గల అపనమ్మకాలే హిప్నాటిజం అంటే మంత్రాలు మాయలుతో కూడిన విద్య అని కూడా నాతో ఎందరో విజ్ఞులు అన్నారు ఇప్పుడు కాలం మారింది ఈ శాస్త్రాన్ని గుర్తించవలసిన అవసరం వచ్చింది.

భారతదేశంలో ఇతర డాక్టర్ల మాట ఎలా ఉన్నా కనీసం మన ఆంధ్రదేశానికి చెందిన డాక్టర్లు ఈ శాస్త్రాన్ని అభ్యసిస్తే వారు ఎన్నో క్లిష్టమైన కేసులను అతి సునాయాసంగా ట్రీట్ చెయ్యవచ్చు! మన తెలుగు డాక్టర్ల సౌకర్యార్థం నేనిక్కడ కొన్ని ముఖ్యమైన హిప్నోథెరపీలో రీసెర్చి చేస్తున్న వైద్య సంస్థలు చిరునామాలను పొందుపరుస్తున్నాను. వారినుంచి సమాచారం పొంది, మనం ఇతర రాష్ట్రీయులకు మార్గదర్శకులు కావాలని నా ఆకాంక్ష

(1) బ్రిటిష్ సొసైటీ ఆఫ్ మెడికల్ అండ్ డెంటల్ హిప్నాసిస్, 42-లింక్స్ రోడ్, అష్‌టెడ్, సర్రే కె టి 21 2హెచ్ జె ఇంగ్లండు

(2) ఆస్ట్రేలియన్ సొసైటీ ఫర్ క్లినికల్ అండ్ ఎక్స్‌పెరిమెంటల్ హిప్నాసిస్-డిపార్ట్‌మెంట్ ఆఫ్ సైకియాట్రీ కేరాఫ్ రాయల్ మెల్‌బోర్న్ హాస్పిటల్, విక్టోరియా 3050-ఆస్ట్రేలియా

(3) అమెరికన్ సొసైటీ ఆఫ్ క్లినికల్ హిప్నాసిస్ స్టె 218, 2400 తూర్పు దెవాన్ అవెన్యూ- డెస్‌ప్లాయిరెస్ ఐ యల్ 60018-అ సం రా

(4) ఇజ్రాయెల్ సొసైటీ ఫర్ క్లినికల్ అండ్ ఎక్స్‌పెరిమెంటల్ హిప్నాసిస్-రాంబం మెడికల్ సెంటర్, హైఫా- బాట్ గలిమ్- ఇజ్రాయిల్

(5) ఒంటారియో సొసైటీ ఫర్ క్లినికల్ హిప్నాసిస్, 170, సయింటు జార్జి వీధి స్టె-1001 టొరొంటో అంటేరియో యమ్ 5 ఆర్ 2 యమ్ 8- కెనడా

ఓ. కె ఆల్ ది బెస్ట్

# బిరుసెక్కి మనసింకెన్నా..!

## బొల్లిముంత నాగేశ్వర రావు

ఆ రోజు ఆఫీసు వాతావరణం అదో రకంగా ఉంది చాలా మంది ముఖాల్లో ఒకవిధ తృప్తి ఎవరికి వారు పెద్ద అనుభవం ఉన్నట్టు గంభీరంగా సీట్లలో కూర్చుని పనులు చేసుకుంటున్నారు రాజారావు నున్నగా గడ్డం గీయించి నీట్‌గా డ్రస్సప్ అయ్యాడు ప్రక్క సీట్లో ఉన్న ముకుందరావు అది కనిపెట్టాడు'

ముకుందరావు అంతకు ముందే జుట్టు ముందుకు దువ్వి కొద్దిగా కనిపించే బట్టతలను కప్పుసుకున్నాడు ముఖాని కున్న కళ్ళ జోడు మాట మాటకీ సవరించు కుంటున్నాడు. కొన్నేపు ఫైలు వంక చూస్తూ, అంతకంటే ఎక్కువ సెపు ఫైన తిరుగుతున్న ఫాను వంక చూస్తూ– ఆలోచిస్తున్నట్టూ, అది అందరూ చూడాలన్నట్టు చూస్తూ. అప్పు డప్పు డటూ, ఇటూ చూస్తూ పదేపదేగా అదేపనిగా అయోమయంగా ఆవేదన పడుతున్నాడు

ఆఫీసు సూపరింటెండు గోపాలస్వామి తన క్రింది గుమస్తా లంతా అలా బుద్ధిగా సీట్లు వదలకుండా పని చెసుకుంటున్న వాతావరణం– వింత అనుభూతిని కలిగించింది

సీనియర్ గుమస్తా పరమేశం అప్పుడే సీట్లో కొచ్చి కూర్చున్న సునీతకు పై అధికారి ఆదేశం మేరకు పని నేర్పుతున్నాడు' సునీత శంకరం భార్య శంకరం మరణవార్త పేపర్లో పడలేదుగాని పేపర్లలో కనిపించె పెద్దవారి మరణమె శంకరానికి ప్రాప్తించింది శంకరానికి హఠాత్తుగా గుండె ఆగిపోయింది'

గుండె ఆగిపోవటం మీద ప్రముఖులైన డాక్టర్లు పలురకాలుగా చెప్తారు పొగత్రాగటం గుండె జబ్బుకి ప్రదాన కారణమైతే శంకరం ఎప్పుడూ పొగత్రాగేవాడు కాదు మద్యపానం గుండె ఆగటానికి మరో కారణమైతే శాస్త్రం సమ్మతించిన చిట్టి పొట్టి పార్టీల్లో కూడా చిన్ని చుక్క ఆల్కహాల్ కూడా సహచరులు బలవంతం చేసినా నాలుక చివర కూడా రాసుకుని ఎరుగడు'

కొవ్వు పదార్థాలు వాడటం, కొలెస్టరాల్ రక్తంలో పెరగటం గుండె పనికి వెరె ఆటంకమైతే అద్దె చెల్లించటానికీ అముదం ఖర్చులకీ సిటీ బస్సు చార్జీలకీ చింతపండు పెరిగిన ధరలకీ, ఉల్లిపాయ ఉబ్బిన ధరలకీ కొబ్బరినూనె కొవ్విన ధరలకీ ఇస్తున్న జీతం ఎలా తెలా పోయినప్పుడు నేతి చుక్క నింగినంట శంకరం నాలుక మీద పప్పు చప్పగా మిగిలిపోయేది'

మరి శంకరానికి గుండె ఎందు కాగిపోయినట్టు??

గుండె ఉంది గనుక ఆగిపోయింది' సాదా గుమస్తా విషయంలో సరిపెట్టుకోవాల్సింది అదే అయినా సునీత సరిపెట్టుకోలేక పోయింది తననెంతగానో ఆరాధించిన శంకరం– తనను చూసి పైసా కట్నం కూడా అడక్కుండా పెళ్ళి చెసుకున్న శంకరం–తనకు సర్వస్వమూ అనుకున్న శంకరం– తీపి గుర్తుగా ఓ ఇద్దరు పిల్లల్ని మిగిల్చి ఇలా మధ్యంతరంగా తన నుండి మాయమై పోవటం తలుచుకున్నప్పుడల్లా తల్లడిల్లిపోతుంది

సునీత అందంగా ఉంటుంది ఎర్రగా ముఖం కోలగా, ముక్కు తరుగా ముఖానికి చాలినంత చారుగా ఉంటుంది' కళ్ళు పెద్దవిగా ఉంటాయి కాలేజీలో చదివేప్పుడు చాలామంది కుర్రవాళ్ళు ఆమె వంక కొంటెగా చూసేవాళ్ళు' మధ్యతరగతి అసహాయత ఆమె చదువును మధ్యలోనె మాన్పించటంతో కప్పల్ని కోసె ప్రయోగశాల నుండి కూరగాయల్ని తరిగె వంటశాలలోకి ఆమె బ్రతుకు మలుపు తిరిగింది'

సునీతకో అన్న ఉన్నాడు దూరంగా ఎక్కడో మిలటరీలో– వార్ధక్యం పైబడిన తండ్రి ఉన్నాడు భారంగా బ్రతుకు బండిని లాగుతూ– వంగిన నడుము, వడలిన శరీరం– సమస్యల జీవనం అడకత్తెరలో సగం చనిపోయిన అమ్మా 'సునీతకు పెళ్ళి చెసుకోక తప్పలేదు మిలటరీ అన్న నుండి ఆర్థిక సహాయం ఆగిపోయింది సౌహార్థిక సంబంధాల్ను తోటివాళ్ళ నుండి వీగిపోయాయి అరవై ఏళ్ళ వరకూ ఎప్పుడో తండ్రి చేసిన ప్రయివేటు యాజమాన్యంలోని పంతులుగిరీ ఉద్యోగానికి- పింఛనుగా వచ్చే నూట ఇరవై రూపా యిలూ పంటి క్రిందకో మెతుకూ, కంటి మీదికో కునుకూ పరిపూర్తిగాయివ్వలేక పోతున్నాయి'

సమయానికి శంకరం వచ్చాడు సునితను చూశాడు మద్యలో ఆగిన కాలేజీ చదువూ, మనిషి అందంగా, మదురోహల చందంగా కనిపించింది

వివాహం మీద శంకరానికో విశిష్టమైన అభిప్రాయముంది'

జీవన భాగస్వామిని డబ్బు లడగటమేమిటి? ఆమె పిల్లగా ఈ భూమి మీద జన్మించినపుడు లేని కట్నం– తల్లిగా మరొకరికి జన్మ యిచ్చేప్పుడు లేని కట్నం– అత్తగా మారినప్పుడు లేని కట్నం– ముత్తయిదువుగా బయటికి పోయినప్పుడు లేని కట్నం, భార్యగా పారాణి పాదాలోత్త, పచ్చని

తోరణాల క్రిందుగా, బ్రతుకు పసందుగా ఆమె వచ్చేప్పుడు అడగటమేమిటి?

ప్రకృతిలో ఏ జీవి అడిగింది గనుక?

జత కట్టిన హంసలు స్వేచ్ఛగా ఆకాశంలో ఎగిరేప్పుడూ, బ్రతుకు జంటల్ని కూర్చుకుని పిచ్చుకలు గూళ్ళకు చేరేప్పుడూ, ప్రేమైక జీవనంలో జంతు ప్రపంచం పరవశించేప్పుడూ, ఏధరవాటికి మద్యగా నిలిచింది? ఏ కట్నం వాటికి అడ్డుగా వెలిసింది?

శంకరం ఆలోచించేవాడు ఆలోచించిన తర్వాతే అతడు ఆచరించాడు ఆచరించిన మొదటి రాత్రి సునీత అతని వడిలో తలవాల్చి అడిగినప్పుడు తను ఆలోచించిన దాన్నే చెప్పాడు

అతని ఊహల్ని విన్న సునీత కాస్సేపు అవాక్కైపోయింది

'ప్రేమించటానికి పురుషుని కుండాల్సిన అర్హత లేమిటి?'

ఎప్పుడో ఒక మిత్రురాలడిగిన ప్రశ్నకు అప్పట్లో తానేం సమాదానం యివ్వలేకపోయింది ఇప్పుడు తన బర్తను ఎకాఎకిని తీసుకుపోయి-

'ఇదిగో ఇటు చూడండి-' ప్రేమకు నిజమైన ప్రతీక ఈ పురుషుడు ఇతని ప్రేమ ఆకాశం కంటే విలువయ్యింది సముద్రం కంటె గంబీరమయ్యింది పూవు కంటే సుకుమారమయ్యింది భూమి కంటే బరువయ్యింది

ప్రేమమందిరాలక్కర్లేదు-

ఇతని పవిత్ర హృదిలోని స్వచ్ఛమైన అనురాగం వెదజల్లిన ఒక అనుభూతి చాలు' అంటూ



చూపించాలనుకుంది' కానీ ఆమె అతన్ని ఎవరికీ చూపించలేదు ప్రేమావేశంలో అతని సహజ అనురాగాల్ని ఆమె తనలోనే దాచుకుంది' అవి ఎవరికీ కనిపించగూడదని తనే సర్వస్వం దోచుకుంది'

కాలం విరసాత్మకమయ్యింది'

వసంతంలో కమ్మగా పాడిన కోయిల గ్రీష్మంలో మూగబోతుంది' వెలుగుల సౌదాంత రంగంలో కటిక చీకట్ల రాసుల్ని గుమ్మరిస్తుంది'

సునీత విలవిల్లాడింది చీకటి రెండు రకాలు' రాత్రి చీకట చల్లగా ఉంటుంది బ్రతుకు చీకటి బయంకరంగా ఉంటుంది' బయంకరమైన చీకటిని బరించటం ఎలాగో తెలీక సునీత ఏడ్చింది' కన్నీరు మున్నీరుగా విలపించింది'

శంకరం తోటి గుమస్తాలు వచ్చారు'

ఆమెను ఓదార్చారు ఎవరికి తోచిన సాయం వారు చేస్తామన్నారు ఒకనెల గడిచింది సునీత జిల్లా అదికారికి తన దయనీయ గాధను తెలుపుకుంది ఆయన అర్హతలన్నీ పరిశీలించాక సునీతకు బర్త ఉద్యోగాన్నే యిచ్చాడు

బ్రతుకులో ఏదో వెలితి' ఆర్థికంగా పూడినా ఆత్మీయంగా శూన్యమయ్యింది' ఇంతటి ప్రపంచంలో తిరుగుతున్నా ఒంటరితనం వెంటాడుతుంది' బస్సులో ఎక్కినప్పుడూ, బజారులో తిరుగుతున్నప్పుడూ, రెస్టారెంటులో కాఫీ త్రాగేప్పుడూ, సినిమా హాలు ప్రక్కగా నడిచేప్పుడూ ఏదో బాద' బరువుగా మూల్గిన గుండె చప్పుడు బరించరానిదిగా ఉంటుంది'

ఇన్నాళ్ళు బ్రతికినా బ్రతకటం గురించి నేర్చుకోలేదు ఇకముందు ఎన్నేళ్ళో బ్రతకటం గురించి నేర్చుకోవాలి'

ఇది తనకు ఆఫీసులో కూర్చున్న మొదటి రోజు' అంతా ఆదరంగా పలుకరించారు తనకంటూ ఒక సీటు చూపించారు ఇంతకు ముందు ఇదే సీటులో తన బర్త పని చెసెడు ఇప్పుడు తను పని చేస్తుంది' విచిత్రమైన మార్పులో వింతగా మలుపు తిరిగిన జీవితం' సునీత ఊహించుకుంది' అప్రయత్నంగా కళ్ళ వెంట నీరు తిరిగాయి ప్రక్కనున్న పరమేశానికి కనిపించకుండా తుడుచుకుంది' ఎదురుగ్గా ఉన్న ముకుందం అది గమనించాడు అతనికి మనసులో కొంచెం బాద కలిగింది' కళ్ళజోడు సవరించటమూ, క్రాపు సరిచేసుకోవటమూ తగ్గించాడు

ఆ రోజంతా ఆమె సీట్లో యాంత్రికంగా గడిపింది పరమేశం వ్రాయమంటే వ్రాసింది చదవమంటే చదివింది' చదివింది వివరిస్తే వింది'

★ ★ ★ ★

ఆఫీసులో సునీతకు రమాదేవి పరిచయమయ్యింది రమాదేవి టైపింగ్ సెక్షన్‌లో పని చెస్తుంది

తన కంటె చిన్నదైనా ఆమె మాట్లాడె విదానం సునీతకు నచ్చింది మనిషి స్మార్ట్‌గా ఉంది చామనచాయలో ఆకర్షణీయంగా ఉండే ముఖం' ఇటీవలే వివాహం అయ్యింది భర్తకేదో బిజినెస్ రెండు చేతులా సంపాదన' పైగా ఆమె కూడా తనుండే పండరీపురంలోనే కాపురం' దారిలోనూ, ఆఫీసులోనూ మనసు విప్పుకుని మాట్లాడే ఒక తోడు'

సునీత ఆనందపడింది'

# 'ఒరులేయవి యొనరించిన...'

## 2

ఆఫీసులో సునీతకు రోజులు గడిచి పోతున్నాయి కొద్ది కొద్దిగా పని అర్థమవుతుంది పరమేశం పని నేర్పుతున్నాడు పని నేర్పే పరమేశంలో ప్రతిరోజూ ఏదో మార్పు!

మొదట్లో అమ్మా అని పిలిచిన పరమేశం ఇప్పుడు ఏమండీ అంటున్నాడు అమ్మ"లో ఉన్న ఆప్యాయత 'ఏమండీ' గా ఎందుకు దూరమయ్యిందో సునీతకు అర్థం కాలేదు కానీ అప్పుడప్పుడు సునీతకు అర్థమవుతుంది!

తనను చూసి చిన్నగా నవ్వినప్పుడూ, ఫైలు తననుండి అందుకొనే సమయంలో చేతుల్ని తాకు తున్నప్పుడూ, చేతుల్ని తాకినప్పుడు కూడా చిన్నగా నవ్వుతున్నప్పుడూ !

శ్రుతి మించుతున్న ప్రవర్తన - సునీత భరించలేక పోతుంది! పని నేర్చుకోవాలంటే భరించక తప్పదనుకుంది ముందుగానే ఒక సీనియర్ క్లర్కుతో పేచీ పడటం మంచిది కాదనుకుంది విషయాన్ని మరో విధంగా మలిచి, తనను వేరే విధంగా నవ్వులపాలు చెయ్యటానికి అవకాశ ముంటుందని భయపడింది!

అతడెలా కవ్వించినా తను చలించగూడదు!

తన సెక్షన్‌లో తను ఒక్కర్తే ఆడమనిషి మరొకరున్నా బాగుండేది

పరమేశంతో పాటు ఇతర గుమాస్తాల చూపులు కూడా రోజు రోజుకీ మారుతున్నాయి సానుభూతిగా చూసిన కళ్ళు ఇప్పుడు చిలిపిగా చూస్తున్నాయి

మారుతున్న తేడాను సునీత గమనించింది!

ఎవరికీ చెప్పుకొనే సమస్య కాదు మనసును దహించే సమస్య!

ఈ ప్రపంచ మొక వైకుంఠపాళీ! తన లాంటివాళ్ళు పావులు పైకి తీసే నిచ్చెనలూ ఉంటాయి పైనబడే పాములూ ఉంటాయి ఆలోచించి అడుగు వెయ్యాల్సిన అవసరం తనది! ప్రమాదమనుకున్న చోట నుండి అడుగులు తీయాల్సిన అవసరం కూడా తనదే

ఈ ఆఫీసులో

'చెల్లెమ్మా అని పిలిచే ఒక సోదరుడుంటే ఎంత బాగుంటుంది ఆ పవిత్రమైన పిలుపు తన కెంత చేయూత నిస్తుంది

తన నలా పిలవేమని ఎవరి నడుగుతుంది! సునీత కళ్ళు అప్పుడప్పుడు చెమర్చేవి!

ఈ దేశ సరిహద్దుల్ని కాపాడుతూ ఎక్కడో ఉన్న అన్న తనకీ సమయంలో ఏం ఉపయోగపడడు. జీవితం నైతిక సరిహద్దుల్ని కాపాడే మరో అన్న తన కిక్కడ కావాలి!

సునీత అందరి వంకా చూసింది! కానీ ఎవరూ తన నలా పిలిచేట్టు లేరు అందుకే లంచ్ అవర్‌లో సునీత బయటికి పోలేక పోయింది అలాగే వ్రాసుకుంటూ ఉండిపోయింది అర్జెంటు ఫైలు పని అర్థం కావటం లేదు ఈలోగా పరమేశం అక్కడికి వచ్చాడు వస్తూనే చిరునవ్వు నవ్వాడు అతని అవసరం ఆ సమయంలో ఉంది! అతన్ని చూడగానే ఒకవిధమైన ఆనందం కానీ మరేదో భయం!

తన పనిలో సందేహాలు తీరుస్తాడు కానీ బ్రతుకులో సందేహంగా మిగులుతాడు

ఏమండీ ఏమిటి వ్రాస్తున్నారు? పరమేశం ముందుకొచ్చి కుర్చీ లాక్కొని కూర్చున్నాడు

తను వివరించింది అర్థంకాని విషయాన్ని అడిగింది పరమేశం చెప్పాడు తను వేరె కాగితం మీద నోట్ చేసుకుంది

మీరు లంచ్ అవర్‌లో కూడా ఇలా బయటికి రాకుండా పని చెయ్యాల్సిన పని లేదు మనమిలా కుర్చీకి మొత్తంగా అతుక్కుపోయి యంత్రంలా పని చేస్తే బ్రతుకు పరమ బోర్‌గా తయారవుతుంది త్రిల్ ఉండదు అలా బయటికి పోయి- కాంటీన్‌లో కాఫీ సిప్ చేసి పదిమంది తోనూ పరిచయం పెంచుకోవాలి ఈ రోజు రమాదేవి రాలేదను కుంటాను పరమేశం అన్నాడు

"రాలేదు' తను సమాధానం చెప్పింది

"ఆమె వస్తే మిమ్మల్ని ఈ సమయంలో ఇలా ఒంటరిగా వదిలేది కాదు అవునా?" పరమేశం నవ్వాడు

అవును " తనూ చిన్నగా నవ్వింది!

"అసలు మీరీ మధ్య ఒంటరిగానే కనపడటం లేదు పరమేశం ఏదో రహస్యం చెప్తున్నవాడిలా టేబుల్‌పైకి వంగి అన్నాడు

ఎందుకు?"

'ఏం అంత అమాయకంగా అడుగుతావ్?' పరమేశం నవ్వాడు అది మనిషి వక్రించిన వికారంలోని ఒక వెకిలి నవ్వు! సునీత భరించలేక పోయింది

నవ్వుతూనే పరమేశం మరో పని చేశాడు టేబుల్ క్రింద చెప్పులోంచి బయటికి తీసిన పాదంతో , సునీత పాదంపై ఉంచి నొక్కాడు సునీత తన పాదాన్ని బలవంతంగా ప్రక్కకు లాక్కుంది అక్కడి నుండి మెల్లిగా లేచింది

''తలనొప్పిగా ఉందండీ! కాఫీ త్రాగాలి ' అంది

"అంతకంటేనా పదండి ' పరమేశం కూడా లేచాడు

ఇద్దరూ బయటికి నడిచారు కాంటీన్ సమీపించారు పరమేశమే రెండు కాఫీలు ఆర్డర్ యిచ్చాడు

సునీత ముఖంలోని భావ సంఘర్షణ- ఆవేదన పరమేశం గమనించాడు అది స్త్రీకి సహజమె అని సరిపెట్టు కున్నాడు. మొదట్లో కొంత బాధపడుతుందనీ, తర్వాత మెత్తబడుతుందనీ అతని ఆలోచన!

సాధించవలసిన విజయానికి మొదటి మెట్టు ఎక్కిన వాడిలా అతడు సంతోషపడ్డాడు ఏమాత్రం ఇష్టం లేకపోయినా సునీత ప్రవర్తన మరోవిదంగా ఉంటుంది తను ప్రయోగించిన పాదబాణం పూలబాణంలా మారేక్రమంలో ఇప్పుడు ఆమె ఉంది ఈ పరిస్థితిని రోజుకో విదంగా మలుచుకుని అభివృద్ధిని సాదించుకోవాలి అది సాదించ గలిగిన రోజున తనకు మరో జీవితం- జీవితానికి మరో తీయని మలుపు!

పరమేశం తృప్తిగా గాలి పీల్చి వదిలాడు అక్కడున్న అందరి గుమస్తాల కంటే తను అదికుడుగా బావన చెందాడు

కాంటీన్ దగ్గర సునీత పరమేశం దగ్గర సెలవు తీసుకుని బయటికి పోయింది పరమేశం కాస్సేపు తోటి గుమస్తాలతో కబుర్లు చెప్పి తన సెక్షనుకు చేరేడు- అక్కడ సునీత సెలవుపెట్టి ఇంటికి పోయిందని తెలుసుకున్నాక అతనికి కొద్దిగా ఆశ్చర్యం వేసింది కొంత ఆందోళన కలిగింది

'సాయంత్రం అయ్యాక తనూ సునీత ఇంటికి పోతే ' మనసులో అనుకున్నాడు తర్వాత ఈ రోజు వద్దని నిర్ణయించుకున్నాడు, రేపు కూడా ఆమెను పరిశీలించాలి అప్పుడు మరో అడుగు ముందు కెయ్యవచ్చు'

* * * *

మరునాడు కూడా సునీత ఆఫీసుకు రాలేదు పరమేశానికి విషయం అర్థం కాలేదు సునీత ఒకవారం పాటు సెలవు పెట్టినట్టు రమాదేవి సెక్షన్ సూపరింటిండెంటుకు లీవ్ లెటరు అందించింది.

ప్రారంభంలోనే ఇలా సెలవులైతే ఎలా? మీరు కాస్త ఆమెకు వివరించండి. ఇదంతా "లాసాఫ్ పే" క్రిందకు పోతుంది" సెలవు దరఖాస్తు తెచ్చిన రమాదేవి దగ్గర గోపాలస్వామిగారు నొచ్చుకున్నాడు

రమాదేవి సమాధానం మాత్రం యివ్వలేదు. మౌనంగా తన సెక్షన్‌కు పోయింది లంచ్ అవర్‌లో పరమేశం రమాదేవిని సెలవు కారణం అడిగాడు. ఆమె తనకేమి తెలీయదనీ, అనారోగ్యం ఫీలవుతున్నట్టు మాత్రం చెప్పిందనీ సమాధానం చెప్పింది

పరమేశానికి కొద్దిగా అయోమయ మయ్యింది!

ఆలోచనలో పడ్డాడు సునీత ప్రవర్తన అతనికేమి అర్థం కాలేదు

ఇంటికి పోయి కనుక్కుంటే

తను చేసిన దానికి తనను చూసి అసహ్యించుకుంటే

పరమేశం మరోసారి ఆ ఆలోచన్ని విరమించుకున్నాడు

వారం గడిచాక మరలా రాకపోతుందా? తనతో అవసరం లేకపోతుందా?" సునీత ఆకారాన్ని

ఊహించుకుంటూ అతడు చిన్నగా నవ్వుకున్నాడు'

## 3

అది పరమేశం ఇల్లు ఆదునికమైన కొన్ని సౌకర్యాలు అందులో అమిరి ఉన్నాయి సాయంత్రం ఆరు గంటలయ్యింది పరమేశం ఆఫీసు నుండి వచ్చి, వరండాలోని సోఫా మీద కూర్చున్నాడు పై కప్పుకు కమర్చిన ఫాను తన రెక్కలతో గాలిని విసరుతుంది శ్రీమతి అందించిన కప్పులోంచి టీ మెల్లిగా చప్పరిస్తూ, రాష్ట్రంలోని రాజకీయ సందడిని రేడియోలో వింటూ పరమేశం పరమానందం అనుభవిస్తున్నాడు పదవి కోసం ఆర్భాటాలు రేడియోలో వినిపిస్తున్నాయి పెదవి కోసం ఆరాటం తన గుండెలో ధ్వనిస్తుంది సునీత సెలవు పెట్టి మూడో రోజు –

పరమెశం టీ పూర్తి చెసి ఖాళీ కప్పు ప్రక్కనే పెట్టాడు అతని మనసు నిండా సునీత రూపం నిండివుంది ఒకసారి తన భార్య రూపంతో సునీత రూపాన్ని పోల్చుకున్నాడు ఎంతో తేడా? గడిపిన గత కాలం అసంతృప్తి – మరలా వెంటనే సునీత అందుతుందేమో నన్న ముందు కాలం తృప్తి – అతన్ని ఒకేసారి పెన వేశాయి విచిత్రంగా నవ్వుకున్నాడు

ఆ సమయంలో అతని మనసులో శంకరం మెదిలాడు ఆఫీసులో ఎంతో సిన్సియర్‌గా పని చేసేవాడు ఏ సీట్లోనూ ఎప్పుడూ ఎవరినుండీ పైసా ఆశించి ఎరుగడు మితంగా మాట్లాడేవాడు తాము జేబుల్ని నింపుకుని ఇళ్ళకు పోయే ముందు తృప్తి పడేవారు అప్పట్లో ఈ శంకరానికి తృప్తి ఏదీ అనుకోవటం జరిగింది అదిప్పుడు తెలిసింది శంకరం ఇంటికి పోయినాక సునీతను చూసుకు తృప్తి పడేవాడని

శంకరం తృప్తి ఎంత గొప్పది!

ఇప్పుడా సునీత తనకు దక్కితే– బ్రతికినందుకు తను రెండు సాధించుకున్న వాడవుతాడు పైసలు జేబులు నిండే పదవి. మరో పదిహేనేళ్ళుంటుంది రెండోది పరవశించే పెదవి జీవిత కాలం ఉంటుంది తోటి గుమస్తాలంతా తనను చూసి ఈర్ష్య పడతారు. "పెద్దిల్లు – చిన్నిల్లు" అంటారు పెద్దింటిని తను పోషించాలి చిన్నింటిని చిన్నిల్లే పోషించు కుంటుంది

పరమేశం పరమానందంలో తేలిపోతున్నాడు

ఆ రోజు శ్రీవారు పరధ్యానంగా పరవశించటం ఆయన శ్రీమతికి ఎంతగా కనిపించింది కళ్ళు సగం మూసుకున్నాడు పెదాల మీద చిరునవ్వు మెరుపులా వచ్చి మాయమవుతుంది మనిషి మొత్తం సోఫా మీద వెనక్కి వాలిపోయి ఈజీగా కూర్చున్నాడు

సాయంత్రం ఆరున్నర!

పరమేశం పందొమ్మి దేళ్ళ కూతురు తుఫానులా ఒక్కసారి ఇంట్లోకి దూసుకొచ్చి చేతిలో ఉన్న పుస్తకాల్ని వరండాలో విసిరి కొట్టింది. నేలమీద చెల్లా చెదురుగా అవి పడిపోయాయి ఆమె ముఖం కందగడ్డలా, కళ్ళు ఎర్రగా మారెయి జుట్టు చెదిరి పోయింది మనిషిలో ముచ్చెమటలు కనిపిస్తున్నాయి నొసటి మీద దిద్దుకున్న తిలకం చెదిరి ఇటూ, అటూ అయ్యింది .

కుమార్తె ప్రదర్శించిన ఈ హఠాత్ పరిణామానికి పరవశిస్తున్న పరమేశం పూర్తిగా కళ్ళు తెరచి బిత్తరపోయేడు

'ఏమిటమ్మా లతా! ఏమిటే?' అడిగాడు

లత పెరుకు తగ్గట్టు లావుగా కాకుండా లతలా వుంటుంది కళ్ళు విశాలంగా, ముక్కు బారుగా, పెదాలు ఎర్రగా, నడుం సన్నగా, ప్రబంధ నాయకిలా చలాకీగా చురుగ్గా, వేడిలా చెరుగ్గా, మందస్మితలా మనిషి అకర్షణీయంగా ఉంటుంది ప్రతి సబ్జెక్టులోనూ ప్రధమంగా, వ్యాసరచన, వక్తృత్వం, నాటికల పోటీల్లో విజేతగా వస్తుంటుంది!

పదిమంది అమ్మాయిలకు ముందు నడుస్తుంది వందమంది సమస్యల్ని తన సమస్యగా భావిస్తుంది ఎక్కడ ఏ అన్యాయం జరిగినా నేరుగా ముందుకుపోయి పరిష్కార సాధనలో బహు ముఖాలుగా పని చెస్తుంది!

అలాంటి లత– తన కేదో అన్యాయం జరిగినట్టు, ఒక్కసారి తండ్రి ప్రక్కన కూర్చుని, ఆయన వడిలో తల పెట్టి వెక్కి, వెక్కి ఏడవటం మొదలెట్టింది!

'ఏమిటి చెప్పమ్మా' పరమెశం కంఠంలో మరింత ఆందోళన

'నేను కాలేజీకి వెళ్ళను నాన్నా!' ఈసడింపుగా అన్న మాటలు అతనికి మరింత ఆవేదన్ను కలిగించాయి

'అసలేం జరిగింది?' అనూహ్యమైన సంఘటన ఏదో వినవలసి వస్తుందని అయోమయంగా, ఆవేశంగా పరమేశం అడిగాడు

'ఏం చెప్పమంటావ్ నాన్నా!' దుఃఖావేశం కంఠంలో తొంగిచూసినపుడు, ఎవరో రోడ్డు మీదుగా పోయే మనుష్యులు తమవైపుకు వంగిచూసినపుడు, భరించలేని లత భయంగా, బరువుగా అక్కడినుంచి లేచి ఇంట్లోకి దారితీసింది!

పరమేశం కూడా కూతురివెంట ఇంట్లోకి నడిచాడు అతని గుండె వేగంగా స్పందించటం మొదలెట్టింది క్షణకాలం క్రితంలోని తనతీయని తలపులకు తలుపులు మూసకు పోగా, తన ఇంటి తలుపులు కూడా మూసుకుని లత ఏం చెప్తుందో అన్న ఆవెదనగా, ఆందోళనగా, ఆక్రోశంగా పరమేశం మనసు తత్తర పడిపోతుంది!

'అది కాలేజీయా నాన్నా నో ' లత కరుగ్గా అరిచింది!

'అదేమిటమ్మా కాలేజీ అనేగా పంపింది!' పరమేశం వణికిపోతూ అన్నాడు అదేసమయానికి లత తల్లి కూడా వచ్చి 'ఏమిటండీ, ఏం జరిగింది?' అంటూ నిలబడి పోయింది అలా నిలబడిన తల్లిమీద లత తలవాల్చి కాస్సేపు ఏడ్చింది! పరమేశమూ, ఆయన భార్యా శిల్పా ప్రతిమల్లా అలాగే ఉండిపోయారు

లత తల్లి మీదినుంచి లేచి కళ్ళు తుడుచుకుంది!

'నాన్నా! మా లెక్చరర్ ఉమాపతిగారు'

'ఆ ఉమాపతిగారు చాలామంచి లెక్చరర్– బాగా చెప్తారంటివిగా'–

'ఎంత బాగా చెప్తే ఏం లాభంనాన్నా! బుద్ధి అంత వక్రంగా ఉంటుందని తెలీదు'

'ఏం చేశాడమ్మా'

'నన్ను తనలాబ్ లోనికి రావలసిందిగా అటెండర్ చేత కబురు చేయించాడు నాన్నా! ఆయన మీద ఏ అనుమానమూ ఎవరికీరాదు నేను మామూలుగానే పోయాను వెళ్ళటంతోటే తలుపులు బిగించాడు. మెల్లగా దగ్గరకొచ్చి,

'మై డియర్ బ్యూటిఫుల్ లతా! నీరూపం నన్ను నిద్రనుంచి దూరం చేస్తుంది నీ స్పర్శ లేకుండా



ఇకముందు ఈ బ్రతుకు భారం చెస్తుంది ప్లీజ్ ' అంటూ ముందుకొచ్చి చేతిని పట్టు కున్నాడు దగ్గరగా లాక్కుని ముద్దెట్టు కున్నాడు నేను భయపడి పోయెను అరిస్తే పరువుపోతుంది కరిస్తే మరోరకంగా పరిణమిస్తుందని మెల్లిగా ఆయన పట్టు నుండి బయటపడి–

'అదేమిటిసార్! తండ్రిలాంటివారు మీకు భార్య ఉంది పిల్లలున్నారు నన్ను చూసి అలా చలించటం అసభ్యతసార్ ' అంటూ బయటికి పారిపోయి వచ్చాను ఎవరికీ చెప్పలేదు మరలా ఆయన క్లాసుకొచ్చి నపుడు ఏమీ జరగనట్టే ప్రవర్తించాను ఆడదాన్ని కదానాన్నా, పురుషాధిపత్యం ఏలుబడి చెస్తున్న ఈ సమాజంలో ఒక్కొక్కసారి సున్నితంగా తప్పుకోవాలి ఒక్కొక్కసారి కర్కశంగా, కసాయిగా పైనబడి పీకాలి అందుకని ఇప్పట్లో నేను కాలేజీకి వెళ్ళలేనునాన్నా ' అంటూ సునీత మరలా ఏడ్చింది

'అయినా నాన్నా, ఆయనదదేం బుద్ధి! నలుగురికి చెప్పాల్సిన మనిషి, సంస్కారం ఊపిరిగా బ్రతకాల్సిన మనిషి, సహధర్మ చారిణి తప్ప సహచార దర్శానికి మరోస్త్రీని మనసులో కూడా ఊహించగూడని మనిషి, పవిత్ర ఆలయాల్లో నైతిక విలువల పీఠాల మీద నిటారుగా నిలబడాల్సిన మనిషి, వెలుగుల్ని ఎదుటి మనసుల్లోకి వెదజల్లాల్సిన మనిషి, విజ్ఞానమే తపస్సుగా బ్రతకాల్సిన మనిషి, ఇలా చీకటి కోణాల్లోని చిలిపి వికారాలకు లోనయ్యాడేమిటి?' అని లత తండ్రి వంక దీనంగా చూసింది

'ఊరుకో అమ్మా– పాదు ఎవరైనా వింటే నవ్విపోతారు ఎదిగిన పిల్లలకు అవేనా నేర్పేది– అదేం బుద్ధి?' ఆమె తల్లి సముదాయించింది!

పరమేశం ఏదో బలమైన గాయం నెత్తిమీద తగ్గిలినట్టు బయటికి వచ్చాడు అతనికేం చెయ్యాల్సిందీ తోచలేదు సోఫామీద కుప్పగా కూలబడ్డాడు

ప్రక్కింటి పది సంవత్సరాల 'బాబ్జీ', పరమేశమంటే చనువుగా ఉండే బాబ్జీ పరమేశాన్ని మావయ్యా అని పిలిచే బాబ్జీ పరిగెత్తుకుంటూ వచ్చాడు వాడిచేతిలో వార్తాపత్రిక ఉంది వాడిముఖంలో సంతోషం ఉంది వాడిగురుతూ,

'ఇదెమిటి మావయ్యాయ్! మీ పెద్దోళ్ళ పేపర్లో మా పిల్లల పుస్తకంలోని పద్యముంది దీన్ని మీరు నేర్చుకుంటారా?' అంటూ పద్యం చదవటం మొదలెట్టాడు

'ఒరులేయవి ఒనరించిన పద్యం పూర్తి చేశాడు

పద్యం తాలూకు భావం పరమేశం మనసులో మెదిలింది! అతని మనసు బాధగా మూల్గింది!

ఆ సమయంలో అతనికి సునీత గుర్తుకు

# లైఫ్

కాలేజీ లైఫ్ ప్రారంభం!
గైరు హాజరు ప్రారంభం!
పుడుతుంది సినిమాలపై మోజు!
పడుతుంది పుస్తకాలకు బూజు!
బయలుదేరుతారు ఇంటి ఎద్ద!
హాజరవుతారు సినీ హాలు వద్ద!
కొడతారు గుళ్ళో టెంకాయ!
త్రిప్పుతారు పరీక్షల్లో తలకాయ!
పాసవుతాలే అంటారు అందరూ!
పేపరులో చూస్తే వుండదు నంబరు!

—ఆషాలత

# 'ఒరులేయవి యొనరించిన....'

వచ్చింది! తను చెసినపనే ఒక లెక్చరర్ చేసెడు

లత ఎదురు తిరిగి మాట్లాడింది

సునీత మాట్లాడ లేక పోయింది

లత తండ్రి వడిలో తలదాల్చి ఏడ్చింది తను ఓదార్చేడు కానీ సునీత తండ్రి వడిలో తలదాల్చి కన్నీరు కార్చి తన అయిష్టతను ఆవేశంగా చెప్పటానికి అవకాశంలేని పరిస్థితి!

ఎవరు ఏదిచెస్తే తనకు ఆవేదన కలిగిందో– అది తను మరొకరికి చేసెడు అలా చెయ్య కుండా ఉండటమే పరమధర్మమని పద్యం చెప్తుంది

పద్యం మెల్కొలిపిన చైతన్యానికి పరమేశం కదిలిపోయెడు వెంటనే ఇంట్లోకి పోయి డ్రస్సు మార్చుకున్నాడు అతనికళ్ళు ఎర్రగా మారి నీటిని వర్షిస్తున్నాయి తల్లీ, కూతురూ ఒకదరిని మౌనంగా ఉండిపోయేరు

పరమేశం నేరుగా సునీత ఇంటికి పోయేడు! అతని రాక సునీతకు ఆశ్చర్యాన్ని కలిగించింది

'ఏమిటిలా వచ్చారు?' అడిగింది!

'నిన్నటి వెకిలిపరమేశం చచ్చిపోయేడని చెప్పటానికి వచ్చానమ్మా! ఇవ్వాల్టి నీ సోదరుడు పరమేశం– నిన్ను చెల్లెమ్మా అంటూ పిలిచి, ఆఫీసుకు ఎందుకు రావటం లేదో అడిగి పోదామని వచ్చానమ్మా!' అతని కంఠంలో దుఃఖం మనిషి మొత్తంలో ఏదో మార్పు!

సునీత కాస్సేపు అవాక్కై పోయింది ఆమె కళ్ళు ఆనందంతో చెమ్మగిల్లాయి ఇంతటి మార్పు పరమేశంలో ఎందుకొచ్చింది? ఆమెకు అర్థం కాలేదు కన్నీటిని తుడుచుకుని–

'వస్తాను అన్నయ్యా ! ఇక ఆఫీసుకు తప్పక వస్తాను ' అంది

* * * * *

ఈ వినూత్నమైన అన్నా చెల్లెళ్ళ కళ్ళు చమర్చటానికి ఐదు గంటల ముందు ఉమాపతి లతను తనరూం కు పిలిచాడు–

' చూడు లతా! నీ ప్రతిభ మీద నాకు విశ్వాసముంది ఒక్కొక్కసారి 'ది చైల్డ్ ఈజ్ ది ఫాదర్ ఆఫ్ ఎ మాన్' అనే సూక్తి అక్షరాలా నిజమవుతుంది తండ్రుల నుండి పిల్లలు నేర్చుకోవాల్సిన నైతిక విలువల్ని ఎల్లలే అప్పుడప్పుడు తండ్రులకు నేర్పాల్సి వుంటుంది మీనాన్న గారు పని చేసే ఆఫీసులోనె మా, చెల్లి రమాదేవి పని చెస్తుంది ఆమెకో స్నెహితురాలు సునీత ఉంది భర్త చనిపోయిన అబల– సంస్కార విహీనమైన పురుషుని స్వార్థం ఆమెను ఇప్పుడిప్పుడే వెదిస్తుంది '

ఆయన నోటి నుండి మొత్తంగా విన్న లత అవమానం పీలయ్యింది అప్పుడాయన లత చేతికో వార్తా పత్రికిచ్చి– పద్యాన్ని చదవమన్నాడు సంపాదకీయం శీర్షిక మీద చిన్ని అక్షరాల్లో ఉన్న ఆపద్యం ఎంత పెద్ద సందేశాన్నిస్తుందో అర్థం చెసుకుంది

అవును– ఆపద్యం ఎంతగొప్పది? మానవ జాతి మొత్తం సుఖంగా మనుగడ సాగించ గల సందేశం – మనిషిని మనిషి ఎలా గౌరవించాలో నేర్పే సందేశం – మానవత విలువల్ని మరింత ఉన్నత దశకు తీసుకు పోయె సందేశం, సంకుచిత చీకటి బావాలకు అతీతంగా మనిషి మనుగడను మహోన్నత స్థాయికి చెర్చగల సందేశం, ప్రపంచం నైతిక విలువల సారాన్ని మొత్తం నాలుగు పాదాల్లో ఇరికించిన సందేశం– దానిలో ఉంది

లత అర్థం చేసుకుంది! ఉమాపతి దగ్గర సెలవు తీసుకుంది!

పేపరుతో నేరుగా ముందు బాబ్జీగాడింటికి పోయి– మానాన్నకి పద్యం చదివి వినిపించరా అంది ఎలా అనాలో–, ఎలాచదవాలో వాడికి నేర్పింది తర్వాత ఇంటికి విసురుగా వచ్చింది!

* * * * *

మరుదినం పరమేశంలో వచ్చిన మార్పును సునీత రమాదేవికి చెప్పింది రమాదేవి మరలా తనె అన్నగారికి చెప్పింది ఆ అన్నగారు లతను మరలా తన లాబ్ కు పిలిపించి విషయం వివరించాడు అందరూ సంతోషపడ్డారు కానీ

నాటకం పతాక సన్నివేశంలో పద్యం కమ్మగా పాడిన బాబ్జీగాడికి విషయం అర్థంకాలేదు –

అయినా వాడా పద్యం పాడుతూనే ఉన్నాడు–

'ఒరు లేయవి ఒనరించిన 'అంటూ-- □

# ఆంధ్రపత్రిక పాఠకులకు చక్కటి అవకాశం!



## కళ్యాణవేదిక ఉచిత సమాచారం



జీవితానికి వివాహం ఒక మలుపు. 'ఒకరి కొకరు రాసిపెట్టడం' విధి చేతిలోనిదనే నానుడి అందరెరిగినదే. అయితే రాసిపెట్టినవారు చేరువయ్యే క్షణం అంత సులభం కాదు. మానవప్రయత్నం కూడా కావాలి. ఇందుకు ఎంతో శ్రమ, త్రిప్పట, వ్యయం అవుతోంది.

సమాజంలో నెలకొనియున్న ఈ సమస్యకు పరిష్కార మార్గంగా ఆంధ్రపత్రికలో కొంతకాలంగా "కళ్యాణ వేదిక" శీర్షికన తగ్గింపు రేట్లపై ప్రకటనలు వేయడం జరుగుతోంది.

ఈ శీర్షికను మరింతగా ప్రజలకు వుపయోగపడేందుకు వీలుగా విస్తృతపర్చి ప్రతి బుధవారం "కళ్యాణ వేదిక ఉచిత సమాచారం" శీర్షికగా ఆంధ్రపత్రిక దినపత్రికలో ప్రకటించాలనుకుంటున్నాము.

వధూవరులవివరాల వుచిత సమాచారము కోరువారు/యిచ్చేవారు పూర్తివివరములను అంటే వరుడు/వధువుకు సంబంధించిన వయసు, చదువు, ఇతర అర్హతలు సుమారు **150** అక్షరాలకు మించనట్లు తెలుగులోనే స్పష్టంగా వ్రాసి, ఈ దిగువ కూపనును జతపర్చి మీ వూరిలోని ఆంధ్రపత్రిక ఏజెంటు ద్వారా పంపాలి. చిరునామా పిన్‌కోడ్‌తోబాటు సమగ్రంగా ఉండాలని మనవి.

ఆ విధంగా మాకు అందిన వధూవరుల సమాచారమును వుచితంగా వారమునకు ఒకసారి ప్రతి బుధవారం వీలువెంబడి ప్రకటిస్తాము.

### ఉచిత వధూవరుల సమాచారము యివ్వదలచినవారు ఈ దిగువ నిబంధనలు పాటించాలి.

★ వధువు/వరునికి సంబంధించిన వివరాలు సమగ్రంగా, అచ్చులో 150 అక్షరాలకు మించనట్లుగా తెలుగులోనే స్పష్టంగా వ్రాసి పంపాలి

★ వధువు/వరుల తల్లిదండ్రులు, సంరక్షకులు తాము యిచ్చే సమాచారము వాస్తవమని, ఎవరినీ వంచపర్చే విషయము అందులో లేదని హామీ ఇవ్వాలి.

★ సమాచారం పంపేవారి పేర్లు వగైరా రహస్యంగానే వుంచబడతాయి. ప్రతి ప్రకటనకు ఒక బాక్సు నెంబరు కేటాయించి, వచ్చిన జవాబులు ఉచితంగానే వాటికి సంబంధించినవారికి నెల రోజులలోపు పంపడం జరుగుతుంది.

★ ఈ శీర్షికను కుల మత వర్గ బేధాలు లేకుండా అందరూ వుపయోగించుకోవచ్చును.

★ అందిన సమాచారము ప్రతి బుధవారం మాత్రమే, అవి అందిన వరుస క్రమంలో ప్రకటించబడతాయి. వీటిని త్రిప్పి పంపే ప్రసక్తి లేదు. కావున స్వంత అడ్రసుగల కవర్లు, లేదా స్టాంపులు జతపర్చకూడదు.

★ ప్రకటనకు ఏదైన అనర్హమైనదిగా తోచినపుడు వాటిని వెయ్యకుండా ఆపుచేసే హక్కు పత్రికకు వుంటుంది.

★ ఇతర విధములైన వుత్తరప్రత్యుత్తరములకు అవకాశం లేదు. ఫోటోలు పంపకూడదు.

---

**కళ్యాణ వేదిక ఉచిత సమాచార కూపను**

పేరు ______________________________

చిరునామా ______________________________

______________________________ పిన్‌కోడ్ ______________

స్థానిక ఆంధ్రపత్రిక ఏజెంటు సంతకం ______________________________

---




(గత సంచిక తరువాయి)

జార్జియా అన్నామె చెప్పసాగింది

ఎల్లలు లేకపోతే జీవితమే లేదు అనుకునే మనిషిని గాను కాని లేనిదే కావాలనిపించడం మానవ సహజం కదా? అందనిదెప్పుడూ అపురూపమే! ఎల్లలు లేరు అన్నదాని కంటే, ఎందుకు లేరు అన్నదే ఎక్కువ బాధగా వుంటుంది

ఈ మధ్య ఇంకొక క్రొత్త సమస్య తలెత్తింది మొదట్లో మా నైబర్‌హుడ్‌లో అందరూ న్యూలీ వెడ్ కపుల్సే ఉండేవారు అందరం వీలున్నప్పుడల్లా కలుసుకుని సరదాగా గడిపేవాళ్ళం రాను రాను అందరికీ ఎల్లలు పుట్టారు ఆ ఎల్లలకిప్పుడు నాలుగైదేళ్ళ వయిస్సు కూడా! వాళ్ళందరూ కల్సుకుని ఎల్లల్ని పార్కుకి తీసుకెళ్ళి ఆడించడమో వాకింగ్ తీసుకెళ్ళటమో చేస్తారు ఎప్పుడో తప్ప మా ఇంటికి రావటం మానేశారు కారణం మా ఇంట్లో ఆడుకోడానికి ఎల్లలెవరూ లేరు! మిగతా ఎల్లలున్న వాళ్ళతో పాటుగా పిలిస్తే తప్ప రారు వచ్చినప్పుడు కూడా వాళ్ళ సంభాషణెప్పుడూ ఎల్లల చుట్టూనే దొర్లుతుంటుంది నేను మూగదానిలాగా కూర్చోవలసి వస్తుంది వాళ్ళు కావాలని అలా చెయ్యకపోయినా ఏదో నేరం చేస్తున్నట్లు నా మనస్సు బాధపడుతుంటుంది.

**జరిగిన కథ–11:** భార్గవ్ అమెరికాలో ఒక చిన్న ప్రైవేటు కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు భార్గవ్‌కి మల్లిక పరిచయం అయ్యింది ఆమె ఉద్యోగంలో చేరినాక వారిద్దరు పెళ్ళిచేసుకున్నారు వారి జీవితం సాఫీగా సాగిపోతున్నా పిల్లలు మాత్రం కలుగలేదు అందుకై ఆ దంపతులు డాక్టర్ల చుట్టూ తిరగటం ప్రారంభించారు వారికి పిల్లలు పుట్టకపోవడానికి కారణాన్ని ఏ డాక్టరూ చెప్పలేకపోయాడు కానీ భార్గవ్‌కి మాత్రం తమకు తప్పక పిల్లలు పుడుతారని నమ్మకం ఒంటరితనంతో బాధపడుతున్న మల్లికకి చిన్ననాటి స్నేహితురాలు అంజలి తారసపడటం ఆనందాన్ని ఇచ్చింది ఎదురింటి పాప స్టేఫనీ అంటే మల్లికకు తగని ప్రేమ పిల్లల్ని పెంపకం తీసుకునే విషయంలో తమకి ఆసక్తి లేదని డాక్టరుతో చెపుతాడు భార్గవ్ డాక్టరు మాటలు విన్న భార్గవ్‌కి తనింట్లో చిన్నప్పుడు పాలేరుగా ఉండిన చిట్టిగాడు, వాడి పిల్లలు జ్ఞప్తికి వస్తారు చిట్టిగాడి పిల్లలకి ఏదో ఒక దారి చూపించాలనుకుంటాడు చిట్టిగాడి భార్య చనిపోయిందని, వాడు క్షయతో బాధపడుతున్నాడని తండ్రి ఉత్తరం ద్వారా తెలుసుకున్న భార్గవ్ ఆవేదన చెందుతాడు డేవిడ్ తన ఇంట్లో కంపెనీ తరఫున ఇచ్చే 'క్రిస్మస్' పార్టీకి మల్లిక, భార్గవ్ వెళతారు భార్గవ్ తనతో ఇదివరకటిలా ఉండటం లేదని స్నేహితురాలు అంజలికి చెప్పి బాధపడుతుంది మల్లిక మల్లిక, భార్గవ్ సపోర్ట్ గ్రూప్ మీటింగ్‌కి వెళ్తారు

అప్పుడప్పుడూ

ఇలా అందరూ రకరకాలుగా తమలోని భావాలు, ఆలోచనలు బైటపెట్టారు

అన్ని ఏకాగ్రతతో వింది మల్లిక దాదాపు ఆ అందరి అనుభవాలూ ఆమెకు పరిచితమే! ఆ రోజు సెషన్‌లో ఎక్కువ మాట్లాడకపోయినా అందరి ఫీలింగ్స్ వింటనే మనస్సులో గూడు కట్టుకున్న ఏదో తెలియని ఒంటరితనం నెమ్మదిగా కరుగుతున్నట్లనిపించింది ఏ విషయంలోనైనా, మనలాగే ఇంకొకళ్ళున్నారనే భావన మనిషికి చెప్పలేని ఊరట కలిగిస్తుందనుకుంటాను!

దాదాపుగా ఆడవాళ్ళది, మగవాళ్ళది మీటింగ్ ఒక్కసారే పూర్తయ్యింది

భార్గవ్ ఎవరితోనో మాట్లాడుతూ బైటికి వస్తున్నాడు దగ్గరకు రాగానే ఎవరో స్నేహితులైనట్లున్నారో అనడిగింది మల్లిక

అవును కమోడిటీ స్టాక్ బ్రోకర్! బంగారం ధర త్వరలో రెండింతలవుతుందట కొనమని సలహా యిస్తున్నాడు హుషారుగా అన్నాడు భార్గవ్

కళ్ళు చిట్లించింది మల్లిక రామేశ్వరం పోయినా శనీశ్వరం తప్పదా అన్నట్లున్నాయామె చూపులు

పద పద చాలా రాత్రయ్యింది గంట ప్రయాణముంది మనకు ఆమెను లాక్కెళ్ళాడు

ఎలా వుంది మీటింగ్? భార్గవ్ కారు పోనిస్తుంటే అడిగింది

అన్ని మీటింగుల్లాగే వుంది డాక్టర్ – వాటీజ్ వాజ్ నేమ్? ఆ వెన్స్! డాక్టర్ వెన్స్ ముందేదో లెక్చరిచ్చాడు మేల్ ఇన్‌ఫర్టిలిటీ, మేల్ రియాక్షన్ టు ది ప్రాబ్లమ్ ఎల్లలు లేకపోవటం అనేది వివాహ జీవితంలో ఎట్లాంటి పరిణామం తెస్తుంది – అదే మగవాళ్ళ దృష్టిలో వగైరా వగైరా ఇంకా, మెంబర్ల ప్రశ్నలకు డాక్టర్ జవాబులు, డిస్కషన్లూను!

నువ్వూ ఏమైనా మాట్లాడావా?

ఆఁ చాలా!

ఏం మాట్లాడేవ్? వుత్సాహంగా అడిగింది మల్లిక

బంగారం కొంటె మంచిదా, వెండి కొంటె మంచిదా లేక రెండూ కొంటేనా అనే విషయం గురించి!

ఎవరితో నువ్వు మాట్లాడింది? కోపంగా అడిగింది మల్లిక

స్టాక్ బ్రోకర్‌తో! అమాయకంగా వచ్చింది జవాబు

## 8

ఆఫీసుకెళ్ళటానికి చకచకా తయారవ్వసాగింది మల్లిక లేవగానే పర్కొలేటర్‌లో కాఫీపొడి, నీళ్ళుపోసి ఆన్‌చేసి బాత్‌రూంలోకి వెళ్ళింది పళ్ళుతోముకుని, ముఖం కడుక్కునేసరికి కాఫీ తయారయ్యింది

కప్పులో కాఫీ పోసుకుని పైకొచ్చింది

భార్గవ్ ఇంకా బెడ్‌మీద బద్ధకంగా కదులుతున్నాడు మామూలుగా అతను మల్లిక వెళ్ళినాకగాని లేవడు

మధ్య మధ్యలో కాఫీ త్రాగుతూ జుట్టు దువ్వుకుని డ్రెస్ చేసుకుంది అద్దంలో వెనక్కీ ముందుకీ తిరిగి చూసుకుంది కాస్త లావైనట్లున్నాను అనుకుంది మనస్సులో

బాగ్ పుచ్చుకుని క్రిందకొచ్చింది రేఫ్రిజరేటర్‌లో నుండి రాత్రి చేసిపెట్టుకున్న శాండ్‌విచ్, యాపిల్ ఒకటి తీసుకుని లంచ్ బాగ్‌లో వేసుకుంది మాస్ వేసుకుని వెళుతున్నానని పైకి కేకేసి బైటికి నడిచింది

ఆరోజు ఆఫీసులో పెద్దగా పనిలేక పోవటంతో పెందలాడే లంచ్ బ్రేక్ తీసుకున్నారు మామూలుగా మల్లిక డిపార్ట్‌మెంటులో వాళ్ళంతా కలిసే లంచ్ తింటారు ఒక్క బాస్ తప్ప

అదొక పెద్ద హాలు దాన్ని డైనింగ్‌రూంగానూ, మీటింగ్ రూంగానూ వాడుకుంటారు మల్లిక వాళ్ళ సెక్రటరీ క్రిస్టల్, కొలీగ్స్ డయానా షెర్లీ పూన్‌ఎక్ ఒకచోట కూర్చున్నారు

వారంరోజుల్లో పెద్ద బాంక్వెట్ వుంది నా బ్లాక్ పార్టీడ్రెస్‌లో పట్టాలంటే

ఇంకొక నాలుగు పౌన్లన్నా తగ్గాలి' దిగులుగా అంది షెర్లీ, యోగర్ట్ (పెరుగు) స్పూన్‌తో తసుకుని తింటూ. డైట్ చేసేటప్పుడు షర్లీ తినేది అదే! షర్లీ జమైకా నుండి వచ్చింది పార్టీలు ఆల్‌నైట్ డిస్కోలు అంటే చెవి కోసుకుంటుంది మిగతాటంలో ఎంతతిన్నా, పార్టీలకెళ్ళేముందు బాగా డైటింగ్ ఎక్సర్‌సైజ్ చేస్తుంటుంది షుమారు అయిదడుగుల పదంగుళాల పొడుగుండటంతో కాస్త లావుగావున్నా కనిపించదు నిగనిగలాడే నలుపురంగు ఒళ్ళు, నెలకొకసారి బ్యూటిషియన్‌తో లొంగదీయించుకున్న జీబురుజుట్టు, ముదురురంగు లిప్‌స్టిక్‌తో నల్లగా మెరిసే పెదవులు, రంగువేసుకున్న పొడుగాటిగోళ్ళు, అందమంతా పలువరసలోనే వున్నట్టు నవ్వుతుంటే తళుక్కున మెరిసే అతి తెల్లటి పళ్ళు- అచ్చం అరేబియన్ గుర్రంలా వుంటుంది

'వారం రోజులుందిగా తగ్గగలవులే' ఓదార్చింది డయానా చాలా సాదా మనిషి డయానా ఆమెలో చెప్పుకోదగ్గ గుణమల్లా అందరి కష్టాలూ తనవే అనుకోవటం!

మా క్రొత్త బెడ్‌రూం ఫర్నిచర్ వచ్చేసింది రూమంతా రీడెకరేట్ చేశాం ఏప్ కలర్ కార్పెట్టు, అదేరంగు వాల్‌పేపర్ బెడ్‌పైన సీలింగ్ మీద అద్దం ఓహ్! ఐ లవిట్' క్రిస్టల్ నోరు విప్పితే మల్లికకు తగని చిరాకు మనిషి చక్కటిది! మాడల్ కుండాల్సిన ఫిగర్ – హై చీక్ బోన్స్, తళతళ మెరిసే జుట్టు, ఒళ్ళు వగైరాలన్నీ వున్నా ఆమె అందంలో ఎక్కడో ఫ్లా!

మొదట్లో, ఇంత అందమైన మనిషి తనకెందుకు అందంగా కనిపించదాని కొట్టు మిట్టులాడేది-మల్లిక తర్వాత తెలిసింది లోపమెక్కడో!

క్రిస్టల్ అందగత్తె అయినా ఆమె నోరు బహుచెడ్డది! ఆమె మాట్లాడే మాటలే కాకుండా ఆమె నోటి ఆకారం కూడా అదోలావుండి మాట్లాడుతుంటే ముఖం వికృతంగా మారుతుంది

అయితే మీ బెడ్‌రూం చూపించటానికి మాకు పార్టీ ఇవ్వాలి! ఉత్సాహంగా అంది పూన్‌సక్ పూన్‌సక్ థాయ్‌లాండ్ దేశస్తురాలు లౌక్యంతెలియని మనిషి ఏ రహస్యాలూ దాచుకోదు

నువ్వు ఆఫీసులో చేరిన ఈ అయిదు సంవత్సరాల్లోనూ ఒక్కసారైనా ఇంటికి పిలవలేదు ఇప్పుడు నీకు బెడ్‌రూంకోసం పార్టీ ఇవ్వాలా? ఎప్పుడెక్కడ



# మల్లిక

ప్రమీల చేరుకుంటుందాని చూసుంటావు నిర్మొహమాటంగా అనేసింది క్రిస్టల్

నాకేముంది చూపించటానికి వన్ బెడ్‌రూం అపార్ట్‌మెంటేగా! కావాలంటే రండి నాకేం అభ్యంతరం లేదు ఏమాత్రం నొచ్చుకోకుండా అంది పూనెక్

అపార్ట్‌మెంటంటే గుర్తొచ్చింది ఆమధ్య ఏదో పనుండి అటువైపు వెళ్ళాను ఇప్పుడు ఆ ఏరియాలోనే వుంటున్నట్లు అప్పుడెప్పుడో చెప్పిన గుర్తు. అక్కడొక ఎల్షేప్ బిల్డింగ్ మొత్తంలో ఒక అపార్ట్‌మెంటు కిటికీలకు కర్టెన్లు లేవు అది మన పూనెక్‌దే అయ్యుంటుందిలే అనుకున్నాను! నా వూహ కరక్టేనా? ఏదో గొప్ప విషయం కనిపెట్టిన షెర్లక్‌హోమ్స్‌లా మొహంపెట్టి అడిగింది క్రిస్టల్

పూనెక్ ఏం జవాబు చెప్పిందో మల్లిక వినిపించుకోలేదు. తలెత్తి పూనెక్ మొహంలోకి చూసింది ఆమె మొహం మామూలుగానే వుంది

ఈ పూనెక్‌కి ఆత్మాభిమానం లేదా? ఎందుకు వాళ్ళనన్ని మాటలననిస్తుంది? క్రిస్టల్ మీదకంటే పూనెక్ మీదనే ఎక్కువ కోపమొచ్చింది

మొన్నొకసారి మాటల్లో అలాగే!

పూనెక్ కొడుక్కి సెకండ్‌హాండ్ వర్షిప్ బొమ్మలు కొన్నానని చెప్పింది

అంత చీప్ మనిషివేమిటి పూనెక్? నువ్వింత సంపాదిస్తున్నావు నీ భర్త మంచి పొజిషన్‌లో వున్నాడు పిల్లాడికి సెకండ్‌హాండ్‌వి కొనటమేమిటి? నువ్వు ఎప్పుడూ మంచి బట్టలైనా వేసుకోవు ఆ డబ్బంతా ఏంచేసుకుంటారు? మొహం మీదే అడిగింది క్రిస్టల్

దానికి పూనెక్ గట్టిగా ఏదైనా అంటుందేమోనని ఎదురుచూసిన మల్లిక చాలా నిరాశపడింది

పూనెక్ పరిస్థితులు అక్కడ అందరికీ బాగా తెలుసు థాయ్‌లెండ్‌లో ఆమెకు నలుగురు చెల్లెళ్ళు ఒక తమ్ముడు వున్నారు బాగా పేదవాళ్ళు వాళ్ళంతా పూనెక్ పంపేదాని మీద ఆధారపడి బ్రతుకుతున్నారు పూనెక్ భర్త కుటుంబం కూడా పేదదే అందుకే వాళ్ళు చాలా పొదుపుగా వుంటారు

కేవలం లాంజరే కి పందలకొద్దీ డాలర్లు ఖర్చుపెట్టే క్రిస్టల్‌కి పూనెక్ ఫామిలీ కోసం చేసే త్యాగం చెప్పినా అర్థంకాదు ఆమె జీవించటానికే పుట్టిందికాని ఇతరులకు ఏమాత్రం జీవితాన్నివ్వటానికి కాదు! ఆమె జీవితంలో మింక్‌కోట్లూ మేలిరకం మేకప్ సామాన్లూ ఖరీదైన బట్టలూ నగలూ వస్తువులూ– వీటికున్న ప్రాధాన్యత మరిందేనికీ వుండదు

అందుకే క్రిస్టల్ నోరువిప్పితే ఆ సంభాషణలో మల్లిక ఏమాత్రం భాగం పంచుకోదు డైరెక్ట్‌గా తనతో మాట్లాడితే తప్ప

ఓ ఆల్‌మోస్ట్ మర్చిపోబోయాను! నాకీరోజు సాయంత్రం మసాజ్ పార్లర్లో అపాయింట్‌మెంట్ వుంది అని మల్లిక వైపు చూసింది క్రిస్టల్

మల్లికను చూడండి! ఏమీ మేకప్ వాడకపోయినా మసాజ్‌లు చెయించుకోకపోయినా శరీరం ఎంత నున్నగా ఆరోగ్యంగా వుంటుందో! కొందరి అదృష్టం అట్లాంటిది!

సడెన్‌గా తనమీదకు దండెత్తిందేమిటి, అనుకుంది మల్లిక మెదలకుండా వూరుకుందామని కూడా అసలే పూనెక్ విషయంలో కోపంగా వుండటంతో విసురుగా తలెత్తింది

మసాజ్‌లు చెయించుకోలేదని నీకెలా తెలుసు? మామూలుగా అడిగింది

ఏమో! మీదేశంలో మసాజ్ పార్లర్లూ అవీ వుండవేమో అనుకున్నాను

నీ తెలివి తెల్లారినట్టేవుంది, అనుకుంది మల్లిక పైకిమాత్రం ముఖంనిండా నవ్వు పులుముకుంది

మీరు పెద్దయినాక గాని మసాజ్ పార్లర్లు బ్యూటీ పార్లర్లు అంటూ పరుగెత్తరు మాకు బేబీగా వున్నప్పట్నుండే అవన్నీ అలవాటు రెండుపూట్లా ఒళ్ళంతా మీగడరుద్ది, పిండితో నలుగుపెట్టి, తలంటుస్నానం చెయించి, జుట్టుకి సాంబ్రాణి పొగ వెయ్యందే బేబీకి స్నానం చెయించినట్లుకాదు మాకు హైస్కూల్లో వుండగాకూడా మా అమ్మమ్మ నలుగుపెట్టుకోనిదే, తలకు నూనె మర్దనా చెయ్యనిదే తలస్నానం చెయ్యనిచ్చేది కాదు తర్వాత ఇల్లు వదిలివెళ్ళినాక కూడా వుత్తరాల్లో ఆ విషయం తప్పకుండా వ్రాసేది

మా అమ్మమ్మ పెట్టే నలుగుముందు మీ స్పెషియల్ స్క్రబ్స్ ఎందుకూ పనికిరావు! ఆవిడచేసే మర్దనా ముందు ఇప్పుడు నువ్వు చెయించుకోబోయే మసాజ్ దిగదుడుపే!

అలాగా? నాకావిషయం తెలియదు అంది క్రిస్టల్ తెల్లబోయి ముఖాన్ని కప్పెట్టుకోవటానికి ప్రయత్నిస్తూ

మల్లిక వంక చూసి కళ్ళతో నే నవ్వింది పూనెక్

*　　*　　*　　*　　*

డార్క్ ఇంకా రాలేదు వేసవికాలం అవ్వటంతో ఏడుగంటలైనా ఇం వెలుగ్గానే వుంది వాక్‌కెళ్ళామని బైలుదేరింది మల్లిక

వాళ్ళుండే ప్రదేశం, ఆ చుట్టుపట్ల చాలా అందంగా వుంటాయి చిన్నచిన్న గుట్టలు లోయలు పేర్చేసినట్లు అక్కడక్కడా ఇళ్ళు, పెద్ద పెం ఆవరణలు, ఆవరణల్లో చక్కగా పెంచిన లాన్లు, రకరకాల మొక్కలు!

ఒక్కొక్క ఇంటివైపూ చూసుకుంటూ నడుస్తోంది మల్లిక ఒక్కొక ఆవరణలో ఒక్కొక్క రకంగా చూట్టానికి ఇంటరెస్టింగా వుంది లాండ్‌స్కేపింగ్!

మొక్కలకి లాన్‌కీ నీళ్ళుపెడుతూనో, కలుపు తీస్తూనో, గార్డెన్ పనిచేస్తూనో డెక్‌మీద కూర్చుని ప్రకృతిని తిలకిస్తూనో– దాదాపు అ ఇళ్ళవాళ్ళూ బైటే వున్నారు

మల్లిక ఇళ్ళన్నీ దాటి 'కల్‌డిశాక్' వరకూ వచ్చేసింది అక్కడ ప్రత్యేకంగా ఒక ఇల్లు మాత్రమే వుంది ఆ ఇంటివాళ్ళమ్మాయి రూత్!

మామూలుగా ఆ నేబర్‌హుడ్‌లో వాళ్ళందరూ ప్రతిసంవత్సరం అక్కడేవు చిన్న పార్క్‌లో పిక్‌నిక్ జరుపుకుంటారు ఓపెన్ ఫైర్ గ్రిల్‌మీద చి బార్‌బెక్యూలు చేసుకుని, మొక్కజొన్నకండెలు, బంగాళాదుంపలు కాల్చుకు తింటారు రకరకాల ఆటలతో, స్క్వేర్ డాన్సులతో రోజంతా గడుపుతార అట్లాంటి ఒక పిక్నిక్‌లో పరిచయమయ్యింది రూత్

ఆ అమ్మాయికి ఇరవైమూడు పాతికేళ్ళుంటాయి అవివాహిత అక్కడికి కాస్త దూరంగా వున్న హెల్త్‌స్పా లో డైటీషియన్‌గా పనిచేస్తోంది చాలా చల అయిన మనిషి ఎట్లాంటివాళ్ళతోనైనా ఇట్టే స్నేహం కలిపేస్తుంది అమ్మాయి ప్రోత్సాహంతోనే క్రితం సమ్మర్‌లో హెల్త్‌స్పా లో చేరింది మల్లిక

బైట పోర్చ్‌లో కూర్చుని ఏదో చదువుకుంటోంది రూత్

హలో రూత్! అన్న మల్లిక పలకరింపుతో తలెత్తి చూసింది సంభ్రమంగా లేచి ఎదురొచ్చింది

హలో మల్లికా! హౌ ఆర్‌యూ? చాలారోజులైంది చూసి రా కాస్సే కూర్చొని వెళ్ళువుగాని ఆహ్వానించింది

ఇద్దరూ వెళ్ళి పోర్చ్‌లో కూర్చున్నారు

ఒక్కదానివే వున్నట్లున్నావ్? చుట్టూ చూస్తూ అడిగింది మల్లిక

అవును అందరూ 'అవుటింగ్'కి వెళ్ళారు నేనిప్పుడే వర్క్‌నుండి వచ్చాన అన్నట్లు నువ్వు స్పాకి రావటం మానేశావేం?

ఈ మధ్య బిజీగా వుండిపోయాను ఇప్పుడే కాస్త ఖాళీ చిక్కింది రావాలి గమనించావో లేదో ఈ మధ్య కాస్త బరువు పెరిగాను డైటింగ్ ప తగ్గటంలేదు

డైటేగాక వ్యాయామం కూడా ముఖ్యమే మల్లికా! కేవలం సన్నబడటా గాక మెదడుకి వుత్తేజానికి వ్యాయామం చాలా అవసరం!

సరే నీ విషయాలు చెప్పు ఎలావున్నావ్?

ఎప్పటిలాగే! గూటిలోని పక్షిపిల్లలాగా! ఎగరగలిగినా మా అ ఎగరనివ్వరు నేను ఎగరను నిట్టూర్చింది రూత్

అరగంట తర్వాత వచ్చేసింది మల్లిక దారి పొడుగునా రూత్ గురిం ఆలోచనలే!

రూత్‌ది ఆర్థడాక్స్ జ్యూయిష్ ఫామిలీ! ఇంట్లో అందరూ స్ట్రిక్ట్







్యాయిష్ రూల్స్ పాటిస్తారు. ఇంట్లో వాళ్ళమ్మదే పెత్తనం. రూత్‌కి ఒక అక్క, వ్వరు తమ్ముళ్ళు వున్నారు. అక్క 'హార్వర్డ్' యూనివర్శిటీలో పి. హెచ్. డి. చేస క్కడే అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా పనిచేస్తోంది. రెండు మూడొందల మైళ్ళ ారాన వున్నా ఆమె జీవితాన్ని వాళ్ళమ్మే కంట్రోల్ చేస్తుంది ఇప్పటికీ. లకొకసారి వెళ్ళి బట్టలతో సహా తనే సెలెక్ట్‌చేస్తుంది. వారానికొకసారి ఫోన్ స్తుంది. ఎవర్నయినా డేట్ చేసేముందు ఆవిడ పర్మిషన్ తీసుకోవాల్సిందే! ఈ ఎధ్యనే ఆ అమ్మాయి తల్లిదండ్రులకు నచ్చిన జ్యూయిష్ అతన్ని ళ్ళిచేసుకుంది.

వాళ్ళ ఆహార నియమాలు విచిత్రంగా వుంటాయి. మాంసం, పాలు ఒకే ఎల్‌లో తీసుకోగూడదు. పాలు తాగినాక అర్ధగంట వరకూ మాంసం తినకూడదు. ాంసం తిన్నాక గంట, రెండు గంటలవరకూ పాలు తాగకూడదు.

ఎందుకంటే, వాళ్ళకొక శాసనం వుంది- "తల్లిపాలల్లో పిల్లని ్రుడకబెట్టగూడదు" అని.

అందుకే పాలు, మాంసం కలిపి వండకూడదు. కలిపి తినకూడదు. కలిపి ాచకూడదు.

నెత్తురుగాని, జంతువుల కొవ్వుగాని తినగూడదనే శాసనం కూడా వుంది. ాంసం కూడా మామూలుగా చంపిన జంతువులది పనికిరాదు. 'కోషర్' ద్ధతిలో, ఒక్క దెబ్బతో బాధ తెలియకుండా చంపబడినవి మాత్రమే తినాలి. ఆ విధంగా చంపటానికి ప్రత్యేకంగా శిక్షణ పొందిన వాళ్ళుంటారు. చంపిన తర్వాత త్తురంతా పోవటానికి మాంసాన్ని వుప్పునీళ్ళల్లో నానబెడతారు. తర్వాత ర్తిగా నెత్తురు కారిపోయేందుకై మాంసాన్ని వ్రేళ్ళాడదీస్తారు. వీటిని 'కోషర్' ట్స్ అంటారు. ఇవి ప్రత్యేకంగా బజార్లో దొరుకుతాయి.

ఇంట్లో వంటకి రెండుసెట్ల పాత్రలుంటాయి. పాలు సంబంధించిన వాటికి కసెట్టు! మాంసం సంబంధించిన వాటికి మరొకసెట్టు! ఈ పాత్రలు ఒకదానితో కటి కలవకుండా విడిగా వుండాలి.

ఆహార నియమాలేకాక మిగతా విషయాలు కూడా ఆర్థడాక్స్ జ్యూస్ తు.. చ ప్పకుండా పాటిస్తారు! మెన్సెస్ టైంలో స్త్రీ విడిగా వుండాలి. తర్వాత కూడా కవరోజున స్నానం చేసినాకగాని శరీరం పరిశుద్ధమైనట్లు కాదు. ఇంట్లో రైనా చనిపోయినా, శవంవున్న ఇంట్లోకి వెళ్ళివచ్చినా ్నం చెయ్యనిదే ఎవర్నీ అంటుకోకూడదు. బిడ్డ పుట్టినాక స్త్రీ ప్రత్యేక స్నానం స్తేగాని శుద్ధి పొందినట్లు కాదు.

ఇక పండగలు, పబ్బాలు, పూజలు, వుపవాసాలు చెప్పనక్కర్లేదు!

అట్లాంటి ట్రెడిషనల్ ఫామిలీలో పుట్టి పెరిగిన అమ్మాయి రూత్! తల్లికి నుపడి అన్నీ అమలు జరిపినా విషయ పరిజ్ఞానం కలది కాబట్టి అవన్నీ ్వరహితంగా తోస్తాయామెకు.

"జీవహింస చెయ్యగూడదనుకున్నప్పుడు అసలు చంపడమే మానెయ్యాలి. ప్రత్యేక పద్ధతిలో చంపినంత మాత్రాన అది హింసకాకుండా పోతుందా? రక్తం తోడేసినంత మాత్రాన అది మాంసం కాకుండా పోతుందా? పూర్వకాలంలో చాదస్తంగా ఏదో చేసేవారు, సరే! ఇంతింత చదువులు చదివాక, ఇంత విజ్ఞానం సంపాదించాక కూడా ఆ అర్థంలేని ఆచారాలు, పూజలు చెయ్యాలంటే ప్రాణం పోతున్నట్లుంటుంది." అంటుంది రూత్.

"ఆ ఇంట్లో ఇమడలేనప్పుడు బైటికొచ్చెయ్య వచ్చుగదా? నీకు వుద్యోగముంది. స్వతంత్రంగా బ్రతకగల ధైర్యం, బ్రతకాలనే కోరికా వున్నాయి. అందులోనూ, ఈ ఇరవయ్యో శతాబ్దంలో అమెరికాలో వుంటూ ఇంకా మీ అమ్మ చేతిక్రింద నీళ్ళు తాగే అవసరమేమొచ్చింది?" అంటుంది మల్లిక.

"నీకు తెలియదా మల్లికా? నువ్వూ అర్థంలేని ఆచార వ్యవహారాలు, మూఢ నమ్మకాలు గల సమాజంలో నుండి వచ్చిన దానివే! ఎంత విరుద్ధభావాలతో మనస్సు నలిగిపోతున్నా చిన్నప్పట్నుండే అలవాటైన పద్ధతుల్ని, ముఖ్యంగా ఆత్మీయుల్ని తృణీకరించటం అంత తేలికైన పనా? ఎప్పుడో బాగా విసిగిపోయినప్పుడు అలా చేస్తానేమో! ప్రస్తుతం నావల్ల కావటంలేదు".

నిజమే! రూత్ పరిస్థితి మల్లిక బాగానే అర్థం చేసుకోగలదు. రూత్ అమ్మలాంటిదే మల్లిక అమ్మమ్మ కూడాను. ఇంత వయస్సు వచ్చినాక, తన సంసారం అంటూ ఏర్పడినాక తన ఇష్టం వచ్చినట్లు వుంటోందిగాని అమ్మమ్మే దగ్గరవుంటే ఆ ఆచారాల వలయంనుండి అంత తేలిగ్గా బైటపడగలిగేదా?

* * * * *

"హలో చైతన్యా! మమ్మీ ఇంట్లో వుందా?"

"వుంది ఆంటీ! ఒక్క నిముషం."

"మల్లికా! ఏమిటి విశేషాలు?"

"'హెల్త్‌స్పా'కి వెళ్దామనుకుంటున్నాను. నువ్వూ వస్తావా?"

"'హెల్త్ స్పా'కా? ఎందుకూ?"

"ఎందుకేమిటి? 'హెల్త్‌స్పా'కి ఎందుకెళ్తారు?"

"ఎందుకెళ్తారో తెలుసులే! నువ్వెందుకెళ్ళటం అని?"

"లావు తగ్గటానికే కాదు సిల్లీ! పెరక్కుండా వుండటానిక్కూడా. అదీగాక నిన్నద్దంలో చూసుకుంటే నాలుగైదు పౌన్లు పెరిగినట్లే అనిపించింది."

"చాల్లే గొప్పలు, అంత సన్నగా వుండికూడా! స్కార్లెట్ ఒ హారాలాగా పద్దెనిమిదించెల నడుం వుండాలా?"

"ఇంతకీ వస్తావా, రావా?" విసుగ్గా అడిగింది మల్లిక.

"వస్తాలే! నాకూ ఒకసారి 'హెల్త్‌స్పా' చూడాలని వుంది."

(ఇంకా ఉంది)

# బోనులోపడ్డ ఎలు

లక్ష్మీశ్రీనివాసన్

"ఏం ఫర్వాలేదు కద డాక్టరు గారూ? భయంగా అడిగాడు సదానందం

నిన్నటికన్నా ఈ వేళ బాగా నయం కంగారుపడకండి' ఆ టాబ్‌లెట్స్ కూడా వెంటనే తీసుకొచ్చి వెయ్యండి ఇప్పుడు టైము తొమ్మిదయింది కదా మరో మూడు గంటల్లో జ్వరం పూర్తిగా తగ్గి తీరుతుంది' అయినా అన్నీ తెలిసి ఇలాంటి పని చేశారేమిటి మీరు? అన్నాడు డాక్టరు హరి

ఆవేశంలో చాలా తొందరపడ్డానండి' బాధ పడుతూ అన్నాడు సదానందం

అందుకే 'తన కోపమె తన శత్రువు' అన్నారు పెద్దలు పరిస్థితి మరీ విషమించలేదు గనక సరిపోయింది - లేకుంటే మీరెంత బాధపడ్డా ప్రయోజనం లేకపోయేది ఆ దెబ్బలకు ఆయింట్‌మెంట్ కూడా రాస్తున్నాను తెప్పించి వాడండి అంటూ ఆయింట్‌మెంట్ ఏదో రాసిచ్చి, బయపడొద్దని చెప్పి వెళ్ళిపోయాడు డాక్టర్ హరి

అతడలా వెళ్ళగానే సైకిల్ షాపులో వున్న ఓ కుర్రాణ్ణి పిల్చి, డాక్టరు రాసిచ్చిన మందులు తీసుకురమ్మని పంపించి లోపలికొచ్చాడు సదానందం అతడి బార్య సుబ్బయ్యమ్మ దిగులుగా కొడుకు మంచం దగ్గరే కూర్చొని వుంది కొడుక్కి ఎలా వుంటుందోనన్న ఆతృత, ఆరాటం ఆవిడ మొహంలో స్పష్టంగా ద్యోతకమవుతున్నాయి

బాదపడకు సుబ్బులూ' బయంలేదని డాక్టరుగారు చెప్పారు కదా' అన్నా డామెను చూస్తూ అనునయంగా సదానందం

చచ్చేటట్టు వాడ్ని కొట్టి కొట్టి ఇప్పుడెంత తేలిగ్గా చెబుతున్నారు బాదపడొద్దని కన్నతల్లి బాధ మీకెలా తెలుస్తుందండీ?' అంది కళ్ళ వెంబడి నీళ్ళు జలజల రాలుస్తుంటే సుబ్బయమ్మ

సదానందం మరి మాట్లాడలేదు రెండు రోజుల క్రితం జరిగింది తల్చుకొని మనసులోనే కుమిలిపోతూ - ఒళ్ళు తెలియని జ్వరంతో - తను కొట్టిన దెబ్బలు కలిగిస్తున్న బాదను తట్టుకోలేక మూలుగుతున్న కొడుకును చూస్తూ వాడి మంచం మీదే కూర్చొని - తనా రోజు ఎందుకలా ప్రవర్తించానా ఎందుకంత ఆవేశానికి లోనయ్యానా అన్న ఆలోచనలతో సతమత మౌతున్నాడతను - ఇంతలో సదానందం గారూ' సదానందం గ రూ' అన్న పిలుపు వినిపిం డంతో లేచిబయటికొచ్చాడుసదానందం

నా సైకిలు రెడీ అయిందాండి? అన్నాడు బయ నిల్చున్న వ్యక్తి సదానందాన్ని చూస్తూనే

అన్న టైముకే సిద్ధం చేసి వుంచాను మీ పట్టుకెళ్ళడమే ఆలశ్యం రావుగ్గారూ' అన్నా సదానందం

నాది ఆలశ్యమా' రెండు రోజుల్నుం వచ్చిపోతున్నాను మీ పనివాళ్ళెవరూ నే వచ్చినట్లు చెప్పనే లేదా? మీరు లేకుం సైకిలివ్వడం ససేమిరా వీలుకాదన్నారు వాళ సైకిల్లేక మహా యాతనగా వుందనుకోండి అందునా సైకిలు మీద తిరగడానికలవాటుప మనిషి - అది లేకపోతే పడే బాధ చెప్పలేనిది అన్నాడు నవ్వుతూ రావు

అయితే తప్పు నాదే' ఈ రెండు రోజులుగా ఏ యాతనలో పడి తిరుగుతున్నాను మీరొచ్చి వెంటనే సైకిలిచ్చేయమని చెప్పి వుంటే మీకీ ఇబ్బం



లేకపోయేది అంటూ ఓ కుర్రాడితో షాపులో వున్న సైకిలు బయటకు తెప్పించాడు సదానందం

ఇది నాదే!? అన్నాడా సైకిలు చూస్తూనే రావు అప్పుడే షాపునుండి తెచ్చినంత కొత్తదనంతో తళ తళలాడిపోతుందా సైకిలు

మనసులో ఎంత బాధగా వున్నా ఆ మాటలకు నవ్వకుండా వుండలేకపోయాడు సదానందం – ఎప్పుడైనా ఓవరాయిలింగ్, టైరు ట్యూబుల్లాంటివి మార్చుకోవడం తప్ప – మళ్ళీ పది పన్నెండు సంవత్సరాల వరకూ మీ సైకిలుకు రంగుతో పనిలేదు అన్నాడు

ఒరిజినాలిటీని తలదన్నేటట్టు వేశారు రంగు చాలా థాంక్సండీ' అని, ఇవ్వాల్సిన డబ్బిచ్చి సైకిలు తీసుకెళ్ళిపోయాడు రావు

నిజానికి రావు మాటల్లో అతిశయోక్తి ఎంత మాత్రం లేదు సైకిళ్ళకు రంగు వెయ్యడంలో సదానందానికి చాలా మంచి పేరుంది అందుకే ఆ చుట్టుప్రక్క వూళ్ళ నుంచి పనిగట్టుకొని వచ్చి అతడికి సైకిళ్ళిచ్చి పోతుంటారు ఎంతోమంది అతను రంగు వేశాడంటే అది స్ప్రే పెయింటో హేండ్ పెయింటో చెప్పడం చాలా కష్టం అదే అతనిలో గల ప్రత్యేకత ఆ కారణంగానే అతడి దగ్గర ఎప్పుడూ పదిమంది కుర్రాళ్ళు పనిచేస్తుంటారు సరదాగా సైకిళ్ళకు రంగు వేయడం నేర్చుకున్న సదానందానికి రోజున అదే బ్రతుకుతెరువైంది – పది రెంచిలతో, ఓ గాలి కొట్టే పంపుతో మొదలైన అతని సైకిల్ రిపేర్ షాప్ రోజున పదిమందికి పనిచెప్పే స్థాయికెదిగింది సైకిలు రిపేరు – రంగు వెయ్యడంతోబాటు సైకిలు స్పేర్ పార్ట్స్ కూడా అమ్ముతున్నాడిప్పుడు సదానందం అతడికిద్దరాడ పిల్లలు వాళ్ళా వూర్లోనే హైస్కూల్లో చదువుతున్నారు ఒకే ఒక అబ్బాయి శేఖరం – అక్కడికి పదిహేను కిలో మీటర్ల దూరంలో వున్న రాజమండ్రిలో తాతగారింట దగ్గర వుంటూ కాలేజీలో చదువుతున్నాడు ఆ అబ్బాయికే ఇప్పుడు జ్వరం!

చెయ్యాల్సిన పని చాలా వున్నా మనస్సం బాగుండక – తను చేసిన పనికి చింతిస్తూ, అన్యమనస్కంగా ఇంట్లోకి బయటకూ తిరుగుతూ మందులకు పంపిన కుర్రాడి కోసం చూస్తున్నాడు సదానందం

ఈలోగా ఇంచుమించు నలభై ఏళ్ళ వయసున్న ఒక వ్యక్తి బాగా పాత సైకిలొకటి తీసుకొచ్చి రంగు వేయమన్నాడు పాతదైనా పారెన్ రాలీ సైకిలది కొన్ని కొత్త పార్ట్స్ వేసి – రంగు వేస్తే కొత్త సైకిలు దాని ముందు ఎందుకూ కొరగాదనిపించింది ఆ సైకిలు చూడగానే సదానందానికి – ఎప్పటిక్కావాలి మీకు" అన్నాడు కొన్ని క్షణాల తర్వాత

చూడండి నేను బట్టల మూట వ్యాపారం చేస్తుంటాను సైకిలు పాతదైనా పారెన్ రాలీ గట్టిగా వుంటుందని తీసుకున్నాను రంగుతోబాటు కొత్తవి ఏమేం పడతాయో అన్నీ సందేహించకుండా వేసెయ్యండి ఒకసారి చెక్ చేసి సామాన్లకు, రంగుకు మొత్తం ఎంతవుతుందో చెప్పండి" అన్నాడతను

ఎంతవుతుందో పావు గంటలో లెక్క కట్టి చెప్తా సైకిలివ్వడానికి పదిహేను రోజులు పడుతుంది' అన్నాడు సదానందం

ఓ వారం రోజుల్లో ఇవ్వలేరా . ఇదే నా జీవనాదారం' అన్నాడతను జాలిగా

సదానందం వెంటనే మాట్లాడలేదు పదిహేను రోజులని మాట వరుసకన్నాడే గాని నెల్లాళ్ళపాటు చేసినా తరగని పనులెన్నో వున్నాయతడికి అయితే సైకిలు గల వ్యక్తి అవసరాన్ని – పరిస్థితినీ బట్టి చేసివ్వడానికి ఒప్పుకొని – అతని పేరు పూరా రాసుకొని కొంత మొత్తం అడ్వాన్సు తీసుకొన్నాడు

పెట్టిన గడువు ప్రకారం సైకిలివ్వమని ప్రాధేయపూర్వకంగా చెప్పి వెళ్ళిపోయాడతను అతడటు వెళ్ళగానే – అప్పుడే పని కుర్రాడు తెచ్చిన టాబ్లెట్స్ ఆయింట్‌మెంట్ తీసుకొని లోపలికెళ్ళాడు సదానందం కొడుకు శేఖరం ఇంకా అలాగే మూలుగుతున్నాడు జ్వరం ఏమాత్రం తగ్గినట్టు లేదు వాడ్ని మెల్లగా లేవనెత్తి ఓ టాబ్లెట్ వేశాడు దెబ్బలకు తనే స్వయంగా ఆయింట్‌మెంట్ రాసి – కాస్సేపటి తర్వాత షాపులో కొచ్చి పనిలో సర్దుకున్నాడు సదానందం

అతను పని మొదలుపెట్టి అరగంట గడవకుండానే మరొకతను రంగు వెయమంటూ సైకిలు తీసుకొని వచ్చాడు అతని వయసు ఇరవై నాలుగు సంవత్సరాలకు మించి వుండదు ఖరీదైన బట్టలు వేసుకొని చాలా స్టయిల్‌గా వున్నాడు

అప్పుడే ఈ సైకిలుకు రంగు దేనికండి' అన్నాడు అతన్ని చూస్తూనే పనిలోంచి లేచొచ్చి సదానందం ఆశ్చర్యంగా

ఈ బ్లాక్ కలర్ నాకు నచ్చలేదండి! మీరిప్పుడు గ్రీన్ కలర్ వెయ్యాలి' అన్నాడతను

ఎందుకండీ సైకిలు రంగు రవ్వంతయినా దెబ్బతిన లేదు ఏ కలరైనా అప్పుడే వెయ్యడ మెందుకంటారు అనవసరంగా? ఇంతకీ మీరీ సైకిలుకొని ఎంత కాలమై వుంటుంది' అడిగాడు సదానందం

ఆ విషయం నాకు గుర్తులేదు అయినా ఇవన్నీ మీ కెందుకు చెప్పండి? నాకు గ్రీన్ కలర్ మీద సరదాగా వుంది ఏ కలరైనా మీ రెంతో గొప్పగా వేస్తారని తెలిసి తీసుకొచ్చాను మీ రసలు కలర్



వేస్తారా– వెయ్యరా?" అన్నాడతను చిరాగ్గా

'సరే, మీ ఇష్టం! ఎప్పటిక్కావాలో– మీ పేరు–వూరు చెప్పండి!' అన్నాడు తన పద్ధతి ప్రకారం పుస్తకం, పెన్నూ చేతిలోకి తీసుకొని సదానందం

చెప్పాడతను

అయితే మీరు రాజమండ్రి నుంచి వచ్చారా రంగారావుగారూ! చాలా సంతోషం నా పేరు అక్కడ కూడా మారు మ్రోగి పోతుందన్న మాట! అన్నాడు పుస్తకం పక్కన పెట్టి సదానందం

"ఔను ఈ సైకిలు రంగు బాగుంటే మీ దగ్గరకు చాలా సైకిళ్ళొస్తాయి మీ పనితనమంతా చూపెట్టండి! అన్నాడు రంగారావు

'అంటే మీరు రోజు కెన్ని సైకిళ్ళు దొంగిలిస్తూంటారేమిటి రంగారావుగారూ? అన్నాడు చటుక్కున సదానందం

దొంగిలించడమా! మీరేం మాట్లాడుతున్నారో తెలుసా?' కోపంగా అన్నాడు రంగారావు

ఇహ మీరేం మాట్లాడొద్దు! మీరీ సైకిలు దొంగిలించారనడానికి ఎలాంటి సందేహం లేదు మర్యాదగా నిజం ఒప్పుకుంటే మంచిది' అన్నాడు కఠిన స్వరంతో సదానందం

'మీరెంతో గొప్పగా కలర్ వేస్తారని పనిగట్టుకొని సైకిల్ తీసుకొస్తే– దొంగతనం అంటగట్టి నన్ను అవమానిస్తారా? వుండండి మావాళ్ళను తీసుకొచ్చి మీ సంగతేమిటో ఇప్పుడే తేల్చేస్తాను అంటూ సైకిలు వెనక్కి తిప్పబోయాడు రంగారావు

# బోనులో పడ్డ ఎలుక

"ఆగండి, ఈ సైకిలు మీరిక్కడ్నుంచి పట్టుకెళ్ళలేరు మీ మీద పోలీస్ కంప్లైంటు ఇస్తాను! అన్నాడు హేండిల్‌బార్ గట్టిగా పట్టుకొని సదానందం

ఏమిటీ దౌర్జన్యం? నా సైకిలు పట్టుకొని మీదంటారేమిటి??

ఈ సైకిలు మీదికాదు– నాది! ఉరుములేని పిడుగులా ధ్వనించింది సదానందం కంఠం

ఆ మాట వింటూనే అతడిలో అంతవరకూ వున్న బింకం సడలిపోయి– ఆ స్థానే బయం చోటు చేసుకొంది మీదా ఈ సైకిలు మీదా? హీనస్వరంతో అన్నాడు

ముమ్మాటికీ నాదే! కావాలంటే హేండిల్ బార్‌కు అడుగున నా పేరు కూడా వుంటుంది చూడండి రాజమండ్రిలో చదువుకుంటున్న మా శేఖరానికీ సైకిలు కొనిచ్చి ఆర్నెల్లయింది రెండు రోజుల క్రితం సైకిలు బయట పెట్టి ఉడిపి హోటల్లో కాఫీ త్రాగేందు కెళితే మీరు దొంగిలించారు ఔనా? రంగారావు కళ్ళలోకి సూటిగా చూస్తూ అన్నాడు సదానందం అంతవరకూ మౌనంగా వుండి అంతా వింటున్న పనివాళ్ళలో ఒకతను– గురువుగారూ, నేను వెళ్ళి పోలీసుల్ని తీసుకొస్తాను' అన్నాడు

అంతవరకూ ఎందుకు, పట్టుకు కట్టేసి పాత సైకిల్ చైనుకు పన్చెప్పితే సరిపోతుంది' అన్నాడు మరొకతను

రంగారావు బయంతో, సిగ్గుతో తలొంచుకున్నాడు

సదానంధం వాళ్ళను కళ్ళతోనే వారించి, 'చూస్తూంటే ఎంతో సంస్కారవంతుడిలా కనిపిస్తున్నారు ముందెంతో బవిష్యత్ పెట్టుకొని ఇవేం పన్లు? దొంగ ఎప్పటికైనా దొరికి పోతాడని తెలియదా? ఇప్పటికిలా ఎన్ని సైకిళ్ళు దొంగిలించారో నిజం చెప్పండి? లేదూ మిమ్మల్ని పోలీసుల కప్పగించడం తథ్యం! అన్నాడు కటువుగానే

లేదండి ఇదే మొదటిసారి నా మాట నమ్మండి సైకిలు రంగు మార్పించి అమ్మేయాలన్న వుద్దేశ్యంతో –ఎవరికీ తెలీకుండా వుంటుందని ఇంతదూరం తెచ్చాను– ఇది మీదే అవుతుందనుకోలేదు! తన పరిస్థితి బోనులో పడ్డ ఎలుకలా అయిపోవడంతో గజ గజ వణికి పోసాడు రంగారావు

'మీరు చాలా సునాయాసంగా సైకిలు దొంగిలించారు కానీ, ఆ వస్తువు పోయినవాళ్ళు ఎంత బాధపడతారో అందువల్ల ఎన్ని అనర్థాలు సంబవిస్తాయో– దొంగిలించే ముందు ఒక్కక్షణం ఆలోచించారా?– ఆలోచించరు– అలాంటి ఆలోచన వున్నవాడెవడూ ఇలాంటి వెధవ పన్లు చెయ్యడు ఓసారిలా రండి! అంటూ అతన్ని లోపలకు తీసుకెళ్ళి చూడండి, వీడు నాకొడుకు శేఖరం వీడికోసమే ఆ సైకిలు కొన్నాను రెండు రోజుల క్రితం వచ్చి సైకిలు పోయిందని చెప్పగానే – సైకిలు వీడేదో చేసి వుంటాడన్న అనుమానంతో, ఆవేశంతో చచ్చేటట్టు కొట్టాను

"ఆరోజునుంచీ వీడికి విపరీతమైన జ్వరం! అసలు చచ్చిపోతాడనే అనుకున్నాం ఇంతకీ కారణం మీరు! అని కాస్సేపాగి, ఈక్షణంలో మిమ్మల్ని పోలీసుల కప్పగించగలను కానీ అది నా వుద్దేశ్యంకాదు ఇకనుంచైనా ఇలాంటి పన్లు చెయ్యడం మాని మంచి మార్గంలో నడుస్తారన్న నమ్మకంతో కూడా నేను రిపోర్టు చెయ్యడంలేదు ఒక్కసారి దొంగ అన్న ముద్రపడిందంటే ఇక జీవితాంతమూ వీడని నీడలా మిమ్మల్నది వెంటాడుతూనే వుంటుందన్న సత్యం గుర్తుంచుకోండి అంటున్న సదానందం మాటలు పూర్తి కాకుండానే– నన్ను క్షమించండి! అంటూ అతని కాళ్ళకు చుట్టుకుపోయాడు రంగారావు

అతన్ని లేవదీసి, బుజం తట్టి పంపేసి– జ్వరం ఎలావుందో చూడాలని కొడుకు ఒంటిమీద చెయ్యి వేశాడు సదానందం డాక్టరు చెప్పినట్టు జ్వరం తగ్గుముఖం పట్టింది– అదేక్షణాన మెల్లగా కళ్ళు విప్పి తండ్రి మొహంలోకి చూశాడు శేఖరం

–'నాన్నా! నన్ననవసరంగా శిక్షించావు!'' అన్నట్టున్నాయి వాడి చూపులు □



## కట్న దాహానికి బలైన మరో పడతి!

మద్రాసు త్యాగరాయ నగరుకు చెందిన పొర్కొడి అనే ఆమెకు అశోకన్ అనే అతనికి మొన్న మార్చి 24న వివాహం జరిగిందట తనకు పెళ్ళిలో యిచ్చిన కట్న కానుకలు గాక వో స్కూటరు కూడా కావాలని పెళ్ళికొడుకు హఠం చేసి, అట్లు కానిపక్షంలో కాపురం కుదరదని డంకా బజాయించాడట ఇది కుదరదని ఆ పొర్కొడి చెప్పేసరికి మొగుడు, మామగారు, మరదీ అంతా కలసి తలో తాపూతన్నారట మొన్న 18వ తేదీ పొర్కొడిని చూడవచ్చిన ఆమె తండ్రి, అన్నగారూ ఆమె శవాన్ని చూశారట మీ అమ్మాయి వొళ్ళు బాగుండక చనిపోయిందని వాళ్ళనే సరికి పొర్కొడి అన్నగారు పోలీసు రిపోర్టిచ్చి ఆమె మొగుణ్ని, అత్త మామలను, మరిదిని అరెస్టు చెయించారట వారంతా కలిసి ఆమెను చంపేసినట్టు తేలింధట

## స్వార్థం కోసం అనాధ అమ్మాయి హత్య!

వేలూరుకు చెందిన వేలప్పాడి గ్రామంలో 34 ఏళ్ళ మీరాబాయికి అయిదుగురు పిల్లలట ఆమె వైద్యంకోసం వేలూరుకు వెళ్ళి అక్కడ ప్రకాశం అనే ఒకతన్ని చూసి, ప్రేమించిందట వైద్యం వంకన ఆమె అతన్ని తరచు కలుసుకునేదట. చివరికి ధైర్యంచేసి, వో పథకం ప్రకారం ప్రకాశానికి తమ యిల్లు ముందు గది అద్దెకిచ్చిందట వారు రహస్యంగా, హాయిగా రోజూ కలుసుకునే వారట దీనితోనూ తృప్తిపడని మీరాబాయి, అతన్ని తీసుకుని తిరుపతి వెళ్ళి పెళ్ళి చేసేసుకుని, తిరిగి వచ్చి రహస్యంగా ప్రేమ కలాపాలు యధాతాపంగా సాగించేవారట కుటుంబ నియంత్రణ అపరేషను చేయించుకున్న మీరా బాయి తన కొత్త మొగుడు పిల్లకు తల్లికావాలని మళ్ళి ఆ నివారణ అపరేషను చేయించుకుందట దాంతో ఆమెకు గర్భం వచ్చిందట వీరి విషయం అనుమానం వచ్చిన మీరాబాయి భర్త 45 ఏళ్ళ రాధా కృష్ణన్ ఆమెను వారించాడట ఇది ఎలాగూ తెలిసిందని ఆమె మొండికేసి, తన రెండో భర్త (!)తో వో పథకం వేసిందట ఆ ప్రకారం వో అనాధ అమ్మాయిని చంపి, ఆమెను యింటికి తెచ్చి, తన బట్టలు కట్టబెట్టి ఆ శవానికి నిప్పంటించిందట రాధాకృష్ణ శవాన్ని చూసి, తన భార్య ఆత్మహత్య చేసుకున్నట్టు పోలీసుకు చెప్పాట్ట శవ పరీక్షలో అది ఆత్మహత్య కాదని, హత్య అనీ తేలిందట ప్రకాశం కూడా కనుపడక పోడంతో పోలీసు అతన్ని గాలించేసరికి మీరాబాయి కూడా దొరికిందట తమ చర్యలన్నీ ఆమె వొప్పుకుందట తమ ప్లానుకోసం వొకావిడను చంపినట్టు కూడా వొప్పుకుందట

## అనుమానంతో సజీవ దహనం!

బాణామతికి ఎంద రెందరో బలైపోతున్నారు మంధాపూరు గ్రామంలో గొల్ల మాశట్టి అనే అతను బాణామతి చెస్తున్నాడనే అనుమానం మీద ఆ గ్రామస్థు లతన్ని సజీవంగా కాల్చి చంపారట ఎల్లారెడ్డిపల్లి గ్రామంలో బాగవ్వ అనే ఆమెను, ఆమెకూతుర్నీ అదే అనుమానంతో అమానుషంగా సజీవ దహనం చేశారట గ్రామవాసులు పోశానిపేట అనే గ్రామంలో చాకలి బాలవ్వ, బాలయ్య అనే దంపతులను కూడా ఇదే అనుమానం మీద తగ లెట్టారట

## జైల్లో ఉన్న ప్రియుడ్ని వివాహ మాడిన ప్రియురాలు!

కొచ్చిన్‌లో ప్రమీల అనే ఒకమ్మాయి రామచంద్రన్ అనే ఒకతన్ని ప్రేమించిందట దరిమిలాను రామచంద్రన్ ఒక హత్యా కేసులో యిరుక్కుని జైలు పాలయ్యాడట ఈ సంగతి విన్న ప్రమీలకు అతని మీది ప్రేమ ఫదింతలై పోయిందట సత్వరం జైలు అధికారుల పర్మిషను తీసుకుని శారదా మఠంలో అతన్ని రక్కున పెళ్ళిచేసేసుకుందట ఆనక హాయిగా వధువు తనింటికి, వరుడు జైలుకు వెళ్లిపోయారట

## రైల్లో మాన భంగం!

ఫ్రాన్స్‌లోని లారోబెల్లాలో జూలైలో అరంభమయ్యే ప్రపంచ వోటర్ పోలో ఛాంపియన్ షిప్ పోటీలకు శిక్షణ కోసం రైల్లో బొంబాయి నుంచి ఢిల్లీ వెళుతున్నా 20 ఏళ్ళ అల్పన అనే ఆమెను భారతీయ ఈత సమాఖ్య సంయుక్త కార్యదర్శి ఎం శాస్త్రి గారు బలాత్కరించారట ఈ విషయం బయట పెడితే శిక్షణ యివ్వడం అస్సలు జరగదని భయపెట్టాడటాయన

## సగం రొట్టె కోసం ప్రాణం తీసిన ఘనుడు!

గుజరాత్‌కు చెందిన భిలోనా అనే గ్రామంలో వో వృద్ధ బిచ్చగాడు తన వద్దనున్న రొట్టెలో సగం

వో యువక బిచ్చగానికిచ్చాడట వాడది తిని తన కాకలి తీరలేదనీ, మిగతాది కూడా యివ్వమనడిగితే "నే తినద్దా అని ఈ ముసలి ముష్టివాడడిగాడట

దాంతో కోపం వచ్చిన యువ ముష్టి వాడా ముసలి ముష్టివాణ్ణి కొట్టి చంపేశాడట ముష్టిఘాతాలతో కాదు– ఓ కర్రతోనట □






# "ఈ పూట నీకోసం"

## కాకాని కమల

ఉదయం తొమ్మిది గంటలు కావస్తోంది

టైము అయిపోయిందన్న ఖంగారుతో ఊక బొక్కినట్లు ఏదో ఇంత తిన్నాననిపించి చొక్కా ఒంటికి తగిలించుకుని హడావుడిపడుతూ అరుగు మీదపెట్టిన సైకిల్‌ని కిందకి దించాడు రామం

ఒక్క క్షణం ఆలస్యం అయినా సేర్ గయ్యాళి అత్తగార్లా సాధిస్తాడు

ఆడపడచులా పీక్కు తింటాడు

ముప్పై ఆరు సణుగుతాడు

అవతల మనిషి అభిమానం దెబ్బతినేలాగ మాట్లాడతాడు

అవన్నీ భరించటం కంటే అన్నం తినకపోయినా ఓ గంట ముందే పోవటం మంచిదని పిస్తోంది రామానికి

అయితే ఇంట్లో భార్య సర్దుబాటు చెయ్యాదే సీత లేవటం చీకటితో నే లేస్తుంది

కాని ఇటు ఎడా పెడా చంటిపిల్లలు, అటు వృద్ధులైన అత్తమామ ఇంటి పని వీటి మధ్య సతమతమై పోతుంది

ఏ రోజూ రామానికి హడావుడి ఆలస్యం తప్పటంలేదు

రామం అరుగు మీంచి సైకిల్ దించుతుంటే డొక్కు సైకిల్ డబ్బా రేకులా డబడబలాడింది పెడల్ కాలికి కొట్టుకున్నంత పనయ్యింది చిరచిర లాడుతూ తాళం తీసి చిన్న పాత గుడ్డతో దుమ్ము తుడిచి రివ్వున సైకిల్ ఎక్కాడు

ఏ వం డి?

ఏడుస్తున్న చంటి పిల్లని ఎత్తుకుని సముదాయిస్తూ హడావుడిగా వీధి గడపలోకి వచ్చింది సీత

ఆమె జుత్తంతా చెదిరి పయిట జారి అస్తవ్యస్తంగా వుంది

లోపల్నుంచి ఎద పిల్లాడు నోరంతా తెరిచి పెద్దగా ఆరున్నొక్క రాగం తీస్తున్నాడెందుకో

ఏ వం డి?

ఖంగారు గొంతుతో సీత మళ్ళీ పిలిచింది భర్తని

'హడావుడికి ఆలస్యం మొగుడన్నట్లు మళ్ళీ ఈ ఏవండి ఏమిటి? ఇంత సేపూ కొంపలోనే చచ్చాను కదా?

కోపంతో విసురుగా సైకిల్ దిగాడు రామం సడన్ బ్రేక్ పడినందుకు ఆయిల్లింగ్ లేని సైకిల్ కిర్ కిర్ అంది అసహనంతో భార్యని కసురుకున్నట్లు అన్నాడు

ఏమిటి?

నిన్న అనగా చెప్పాను చంటిదానికి పాల డబ్బా అయిపోయింది పిల్ల ఆకలికి ఆగలేకపోతూంది గేదె పాలు దానికి పడవు కదా? బాబిగాడికి జలుబు తగ్గలేదు జ్వరం కూడా తగిలినట్లుంది బియ్యం అయిపొయ్యాయి పంచదార కూడా

రామం గట్టిగా తల విదిల్చాడు

చిరాగ్గా అన్నాడు –

ఊ ( ఇంక చాల్లే అపు నీ ఉపన్యాసం సాయంత్రం తెస్తాలే ఈ రోజుకి ఎలాగో గడిపెయ్యి అంటూ మళ్ళీ సైకిల్ ఎక్కి గట్టిగా ఫెడల్ మీద కాలు వేసి రివ్వున రోడ్డు మీదికి తొక్కాడు!

టింగ్ టింగ్ టింగ్ అంటూ బెల్ కొడుతూ మలుపు తిప్పాడు

ఎంత స్పీడుగా తొక్కినా పావుగంటయినా పడుతుంది షాపు కెళ్ళేసరికి

రామం ఎక్కువగా చదువు కోలేదు ఆర్థిక పరిస్థితి అనుకూలించక మెట్రిక్యులేషన్ తోనే చదువు చాలించి తండ్రికి చేదోడుగా వుండిపొయ్యాడు

తండ్రి వృద్ధుడై పక్షవాతంతో మంచం పట్టాక ఆ ఇంటి బాధ్యత పూర్తిగా అతనిపైనే పడింది

వున్న చిన్న పెంకుటిల్లు అమ్మి ఇద్దరు చెల్లెళ్ళకి పెళ్ళిళ్ళు చేసి అత్తవారింటికి పంపాడు

నాలుగేళ్ళ క్రితం – తల్లిపోరు పడలేక – తనూ పెళ్ళి చేసుకున్నాడు

ఇప్పుడు ఇద్దరు పిల్లలు

తల్లి తండ్రి బాధ్యత కూడా అతన్దే! ప్రస్తుతం ఒక పెద్ద షాపింగ్ కాంప్లెక్సు లో ఒక చిన్న గుమాస్తాగా పని చేస్తున్నాడు!

గొర్రె తోక బెత్తెడు అన్నట్టు ఆదాయం

దాంతోనే ఆరుగురు సభ్యులు గల ఆ కుటుంబం మొత్తం ఒక్క రెక్క మీద సాగాలి

అప్పుడప్పుడు ఆ ఇంటి ఆడపిల్లలు అల్లుళ్ళు వచ్చి వెడుతూ వుంటారు

మోయలేని బరువు రామం భుజాలపై వుంది

అయినా అలాగే భారంగా ఈడుస్తున్నాడు!

రామం వేగంగా తొక్కుతూ షాపు చేరుకున్నాడు

సైకిల్ గోడవారగా పెట్టి నుదుటిపై ధారగా జారుతున్న చెమట తుడుచుకుంటూ షాపులోకి అడుగు పెట్టాడు

ఎంత వేగంగా వచ్చినా అప్పటికే పది నిమిషాలు లేటయ్యింది

కాని రామం అదృష్టం కొద్దీ ఆరోజు సేర్ ఇంకా రాలేదు

సేల్సు మెన్స్, గుమస్తాలు, టైపిస్ట్, బోయ్ మొదలైన వర్కర్సు అంతా వచ్చి ఎవరి పనుల్లో వాళ్ళు నిమగ్నం అయ్యారు

హమ్మయ్య బతికానురా భగవంతుడా ఈ రోజుకి గండం గట్టెక్కింది అనుకుంటూ తేలిగ్గా వూపిరి తీసుకుని తన చోట్లోకి వెళ్ళి కూర్చుని, లావుగా వున్న అకౌంట్సు బుక్ టేబుల్ బయటికి తీసాడు

అది చాలా పెద్ద షాపింగ్ కాంప్లెక్సు కావటంతో అతనికి చాలా పని వుంటుంది

సేర్ ఎదురుగా కూర్చుంటే వంచిన నడుం ఎత్తటానికి కూడా రామానికి భయమే

పైగా అతను టైపిస్ట్ కమ్ క్లర్క్ కావటంతో టైపిస్ట్ రాని రోజు ఆపని కూడా రామం నెత్తిన పడుతుంది

ఉదయం తొమ్మిది గంటల నుంచి సాయంత్రం ఆరు గంటల దాకా గాడిద చాకిరి చెయ్యాలి

ఏమండి, చంటి 'దానికి పాలడబ్బా అయిపోయింది బియ్యం లేవు పంచదార కూ

భార్య సీత కంఠం మనసులో మారు మ్రోగుతుంటే అతి కష్టంతో మనసుని పనిమీద కేంద్రీకరించాడు

* * * * *

సాయంత్రం

రంగ్ రంగ్ రంగ్

గడియారం ఐదు గంటలు కొట్టింది

ఓ అరగంట తరువాత అలసటగా అకౌంట్సు పుస్తకాలన్నీ పక్కకి పెట్టి డెస్క్‌కి తాళంవేసి నిర్లిప్తంగా సీట్లోంచి లేచాడు రామం

సింహం ముందుకి వెళ్ళే మేక పిల్లలా భయపడుతూ రెండు చేతులూ కట్టు కుని సవినయంగా సేర్ ముందుకి వెళ్ళి నిల్చున్నాడు

తలెత్తి కళ్ళజోడు లోంచి ఓరగా రామం కేసి చూశాడు సేర్‌జీ

ఏమిటి? కరుకుగా అడిగాడు

సేర్‌జీ కొంచెం డబ్బు అవసరం అయ్యింది మా అమ్మాయికి పాలడబ్బా నా జీతంలోం

అంతే!

రామం నోటి వాక్యం ఇంకా పూర్తికానేలేదు

గయ్యిమన్నాడు సేర్? తర్జనితో బెదిరిస్తూ –

ఇదిగో రామారావ్? ఇంకొక సారి నా ముందు ఇలా నిల్చున్నావంటే తక్షణం నిన్ను పనిలోంచి తీసి పారేస్తాను పస్టనాడు జీతం, తీసుకుంటావ్ పదవ తారీఖు దాటగానే ఈ పాట మొదలెడతావ్ .

అసలు నువ్వు పెళ్ళి చేసుకోవటం పిల్లల్ని కనటం అదంతా ఏదో నన్ను ఉద్ధరించటాని కన్నట్టు అస్తమానం నన్ను డబ్బు అడుగుతా వేమిటయ్యా!?

నీ పిల్లకి పాల డబ్బా అయిపోతే నా కేమిటి? నీ

గొడుక్కి జలుబు చేస్తే నాకేమిటి"

నేనిచ్చే జీతం చాలకపోతే తూర్పుకి తిరిగి దణ్ణం పెట్టు లేదంటే నా దగ్గర పని చాలించుకో అంతేగాని

ఆయాసంతో రొప్పుతూ దగ్గటం మొదలు పెట్టాడు

రామానికి ఒళ్ళంతా ఒణుకు పట్లయ్యింది గట్టిగా బిగదీసుకుపోతూ అన్నాడు

అదికాదు సేర్ జీ మా పసిపిల్లకి పాల

అసహనంగా తల విదిల్చాడు సేర్

గట్టిగా కసురుతున్నట్లు అన్నాడు

ఇదిగో చూడు రామారావ్ ఆఖరి సారిగా చెప్తున్నాను ఇకపై జీతం మీద ఒక్క చిల్లి గవ్వ కూడా నీకు ఇచ్చేది లేదు ఇప్పటికే ఐదొందలు పైగా నాకు బాకీ పడ్డావ్ నీ కిష్టం అయితే నా దగ్గర పని చెయ్యి లేకుంటే మానెయ్యి అంతేగాని నీ ఇబ్బందుల గురించి నాకు చెప్పొద్దు అసలు సంసారాల్లో ఇబ్బందులు లేంది ఎవరికయ్యా? నాకు లేవు అనుకుంటున్నావా?

మా ఆవిడ్ని నెల్లాళ్ళ నుంచి టైఫాడ్ పీడిస్తోంది మా అమ్మ నూతి చప్టా మీద జారి పడి కాలు ఫ్రాక్చరు చేసుకుంది మా నాన్నకి ఉబ్బసం ఓ ప్రక్క నా వ్యాపారం దెబ్బ తినేలా వుంది కస్టమర్ల నుంచి రావాల్సిన బాకీలు అందలేదు నేను విడిపించుకోవల్సిన స్టాకు గోడౌన్లలో మూలుగుతూంది ఇన్‌కమ్ టాక్స్

మహాప్రభో

రామం రెండు చేతులూ జోడిస్తూ పరిగెత్తినట్లు రోడ్డు మీదికి వచ్చాడు

★ ★ ★ ★




రామంకి ఊళ్ళో అప్పు కూడా పుట్టని పరిస్థితి

అయిన వాళ్ళందరి దగ్గరా అడపాదడపా చేబదుళ్ళు తీసుకున్నాడు

ఎవరైనా ఎన్ని సార్లు ఇస్తారు?

ఆఖరికి ఆ డొక్కు సైకిల్ మీద ఊరంతా తిరిగి ముగ్గురు స్నేహితుల్ని బ్రతిమలాడితే పంద రూపాయిలు అప్పు పుట్టింది అదీ మూడు రూపాయిలు వడ్డీకి

ఉసూరుమంటూ రాత్రి తొమ్మిది గంటల ప్రాంతంలో ఇల్లు చేరాడు

గడపలోనే ఎదురొచ్చింది సీత

ఏమండి ఇంత ఆలస్యం ?

ఏదీ డబ్బు ఓ పట్టాన దొరకలేదే అన్ని ఇందులో వున్నాయి తీసుకో అంటూ సంచి ఆమె చేతికి అందించి అలసటగా మంచం మీద వాలాడు

బియ్యం కాసినే తెచ్చారేం?

అక్కడికి సంతోషించు గట్టిగా కసిరాడు

సీత చిన్న బుచ్చుకుంది

ఈ పది రోజులూ ఎలాగో పీటలొత్తి గడుపు మళ్ళీ వస్టకి జీతం వస్తుంది

★ ★ ★ ★

ఒకటవ తారీఖు!

జీతాలు అందాయి

రామారావు పర్సు బరువుగా వదనం ప్రసన్నంగా వుంది

జీతంలో సగం వడ్డీలకి పోతుంది

ఆ మిగతా సగంతో సంసారం గడవదు నెలంతా జరగదు

అయినా జీతం వచ్చిందంటే అదో తృప్తి

ఇంటికి కావల్సిన వెచ్చాలతో పిల్లకి పాలడబ్బా, కొంచెం బిస్కట్లు, తల్లికి మందులు . కాసిన్ని పళ్ళు భార్యకి మల్లెపూల పొట్లం తీసుకుని కాస్త ఆలస్యంగానే అయినా హుషారుగా ఇంటికి వచ్చాడు రామారావు

ఆ రాత్రి పనంతా ముగించుకుని పిల్లల్ని అత్తగారి పక్కలో నిద్రపుచ్చి అంతా సద్దుమణిగాక గదిలోకి వచ్చింది సీత ఒంటిపై తడిసిన చీర విప్పి పెట్టెలోంచి తెల్లటి ఇస్త్రీ చీర తీసి అటు తిరిగి కట్టుకుంది

గదంతా లవెండర్ పరిమళం ఘుమ ఘుమా వ్యాపించింది

గూట్లోనించి పూలపొట్లం తీసి తల్లో పెట్టు కుంటూ అంది

మీకు రెండు మూడు తారీఖుల్లోగాని జీతం ఇవ్వరు కదా? ఈ నెల ఒకటో తారీఖునే ఇచ్చారేం?

రేపు మా సేర్ ఊరికి వెడుతున్నాడు అందుకని ఇవ్వాళే ఇచ్చారు

ఊఁ ముసి ముసిగా నవ్వింది

రామారావ్ అంతవరకు చదువుతున్న పత్రికని




పక్కకి పడేసి బద్ధకంగా ఒళ్ళు విరిచాడు

చెయ్యి చాచి- అద్దం ముందు నిల్చుని ముస్తాబవుతున్న భార్య చేతిని ప్రేమగా అందుకున్నాడు

పూలు బాగున్నాయా?"

'మల్లెపూలు కదా! బాగున్నాయి కాని మరీ ఇంత పెద్ద దండ ఎందుకు?

"ఎందుకేమిటి? పెట్టుకుందుకు!"

ఊఁ తియ్యగా నవ్వింది

లైటార్పి రామారావ్ భార్య నడుం చుట్టూ చెయ్యి వేసి స్పందించే హృదయంతో ఆమె చెక్కిళ్ళపై

## "ఈ పూలు నీ కోసం"

ముద్దు పెట్టుకున్నాడు ఆమె జడలోని పూలని తపనగా వాసన చూస్తూ అన్నాడు

'బజార్లోంచి వస్తుంటే కనిపించాయి బళ్ళ నిండా మల్లెపూలు రాసులు రాసులుగా పోసి అమ్ముతున్నారు వాటిని చూడగానే నువ్వు జ్ఞాపకం వచ్చావ్ మూర రూపాయట నీ కోసం రెండు మూరలు కొన్నాను పూలు చాలా బాగున్నాయ్ కదూ?'

'ఊఁ ' సీత మునివ్రేళ్ళతో సుతారంగా భర్త చెంపలు నిమిరింది

ఏమండి?

ఏమిటి?

'ఈ సారి జీతం వచ్చినప్పుడు నాకు రెండు జాకట్టు బట్టలు తెండి బాగా ఇబ్బందిగా వుంది

ఊఁ అలాగే తెస్తాలే చీకట్లో ప్రేమగా భార్యని దగ్గరకి తీసుకుంటూ వాగ్దానం చేశాడు

ప్రతీ నెలా ఆమె ఇలాగే చీరల్లేవనో జాకట్లు ఇబ్బందనో, పరికిణీలు చిరిగి పొయ్యాయనో భర్తని అడుగుతూ ఉంటుంది

అతను నమ్మకంగా అలాగే' అంటాడు

కాని–

చివరికి ఒకటవ తారీఖున అతను ఆమె కోసం తెచ్చేది మాత్రం పూల పొట్లం.

కాని సీత ఆ విషయం గట్టిగా అడగ లేదు జాకట్లు చీరలు చిరుగులతో కందికాయ కాట్లతో నిండిపోయినా– ఆ పూల ఘుమ ఘుమలతో, అతని ప్రేమ ముందు ఆమె ఓడి పోతుంది

★ ★ ★ ★

పదహేనో తారీఖు

ఇంట్లో బియ్యం నిండుకున్నాయి

చంటిదానికి పాల డబ్బా అయిపోయింది ఇంట్లో వెచ్చాలు కూడా నిండుకున్నయ్ పచ్చి కట్టెలు మండటం లేదు ఇల్లంతా పొగ వంట ఆలస్యం

షాపుకి టైమ్ అయిపోయిందన్న హడావుడి ఏదో ఇంత తిన్నాననిపించి అరుగు మీంచి సైకిల్ బయటికి తీశాడు రామారావ్

డొక్కు సైకిల్ దణదణ లాడుతూ డబ్బా రేకులా శబ్దం చేసింది

తాళం తీసి పాత గుడ్డతో తుడిచి హడావుడిగా ఫెడల్ మీద కాలు తొక్కాడు రామం

ఏమండీ?'

ఏడుస్తున్న చంటిదాన్ని సముదాయిస్తూ హడావుడిగా గడపలోకి వచ్చి పిలిచింది సీత

'ఏవిటీ? కసిరినట్లు అడిగాడు రామం

చంటిదానికి పాల డబ్బా అయిపోయింది రేపటికి బియ్యం కూడా లేవు మీ అమ్మగారికి మం .'

"సర్లే ఇంక ఆపు ఉపన్యాసం సాయంత్రం ఎక్కడైనా అప్పు పుడుతుందేమో చూస్తాను ఈ వెధవ జీతం నెలకి ఒకసారి రాకపోతే రెండు సార్లు రాకూడదూ?"

భార్య మీద కోపం అంతా సైకిల్ మీద చూపిస్తూ అక్కసగా ఫెడల్ తొక్కాడు రామం

ఎదురుగాలికి తట్టుకుంటూ అతి ప్రయాసతో సాగుతూంది సైకిల్! □

# హైదరాబాదు నోట్‌బుక్

## ఈలపాట ఇంద్రజాలికుడు కొమరువోలు శివప్రసాద్.-

ఈకాలంలో వృత్తికి తగిన ప్రవృత్తి కలుగడం ప్రవృత్తికి తగిన వృత్తి లబించడం అరుదు న్యాయవాదులు గుమాస్తాల వంటి సామాన్య వృత్తులవారు సాహిత్య కళారంగాలకు చేసిన సేవ అపారం, అసదృశం దానిని బట్టి కళా సాహిత్యరంగాల వారికంటే తదితర రంగాలవారే కళాసాహిత్యాలకు ఎక్కువ సేవ చేశారు, చేస్తున్నారనేది నా నమ్మకం అలాటి వారిలో ఒకరు ఉపమిత్రులు శ్రీ కొమరువోలు శివప్రసాద్ ఈయన రాష్ట్ర ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖలో ప్రోగ్రాం అసిస్టెంటు కాని ప్రవృత్తి ఈలపాటమీద సంగీతమంటె చెవి కోసుకొనె కుటుంబంలో పుట్టారు జన్మస్థలం బాపట్ల తండ్రి శ్రీ శ్రీనివాస వెంకట సుబ్బారావు న్యాయవాది తల్లి శ్రీమతి రాజ్యలక్ష్మీదేవి మేనత్త శ్రీమతి నండూరి జ్ఞాన ప్రసూనాంబ వాయులీన విద్వాంసురాలు పినతండ్రి ప్రస్తుతం స్విట్జర్‌లాండ్‌లో స్థిరపడిన గణిత శాస్త్రాచార్యుడు పద్మశ్రీ డాక్టర్ చంద్రశేఖర్ సంగీతానికి సంబంధించిన యావత్సామగ్రిని పెద్ద బాండాగారంగా సేకరించారు ఈ సంగీత వాతావరణం, పరిసరాలతో జన్మించిన శివప్రసాద్ సంగీత విద్వాంసుడు కావడం సహజం కాని శాస్త్రోక్తంగా సంగీతం నేర్చుకొనే అవకాశం కలుగలేదు కాని, ప్రవృత్తి పోలేదు ఏడెనిమిదేళ్లకే

ఈలతో పాడేవాడట ఏమిట్రా ఈ గోల? పోకిరి వెధవల్లాగ ఈలలు?-అని విసుక్కునే వారట పెద్దలు ఒక్క మేనత్త తప్ప (ఈలలు వెయడం పూర్వాచారం ప్రకారం, పోకిరీ చెష్ట, నిషిద్ధం) అయినా శివప్రసాద్ మానలేదు బాపట్ల హైస్కూలులోను ఉస్మానియా విశ్వవిద్యాలయం విద్యార్థిగా వున్నప్పుడు చిన్న పెద్ద సమావేశాలలో మొత్తం 350 ప్రదర్శనలిచ్చారు మద్రాసులో శ్రీ ఎం జి ఆర్ సమక్షంలోను, బొంబాయి, బెంగుళూరు ఢిల్లీలలోను కచ్చేరీలు చేశారు 1982 ఆగస్టులో శ్రీమతి ఇందిరా గాంధీ గృహంలో ప్రదర్శించారు 15 నిమిషాలు వింటాను వెరే పనులున్నాయి-అన్న శ్రీమతి గాంధీ దాదాపు గంటసేపు విన్నారు శివప్రసాద్ ఇంతకుముందు ఈలపాట క్యాసెట్‌ను విడుదల చెశారు దానిలో శ్రీ బాల మురళీకృష్ణ కంజీర వాయించారు అది చాల జనప్రియ మయింది అనంతరం ఆది శంకర అనే సంస్కృత చిత్రం తీసిన శ్రీ జి వి అయ్యర్ శివప్రసాద్‌కు ఆ చిత్రంలో నేపద్యంలో రెండు నిమిషాలు ఈలపాట పాడడానికి అవకాశ మిచ్చారు ఈలపాటతో ఏదో రంజింప జెయడం కాక దానికి ప్రత్యేక స్థానం కల్పించాలంటె శాస్త్రీయంగా సంగీతం అభ్యసించాలి- అని కొందరు హితైషులు సలహా ఇవ్వగా శివప్రసాద్ ప్రముఖ సంగీత విద్వాంసులు శ్రీ బాలమురళీకృష్ణ వద్ద కర్నాటక సంగీతంలోని శ్రీ బిస్మిల్లాఖాన్ వద్ద హిందూస్తానీ సంగీతంలోని మెళకువలను, తిరికిళ్ళను నేర్చుకున్నారు ప్రముఖ వేణు విద్వాంసులు శ్రీ ఎన్ ఎస్ శ్రీనివాసన్ (ఆకాశవాణి హైదరాబాదు) వద్ద శిక్షణ పొందుతున్నారు శ్రీ శ్రీనివాసన్ వేణువు వాయిస్తుంటే ఈయన ఈలతో దానిని అనుకరిస్తూ సాదన చెస్తుంటారు ఏ విద్య అయినా అపారమైనది నిరంతరం సాదన అవసరం ఈలపాటలో ప్రసిద్ధులైన శ్రీ రఘురామయ్య గారు మీ బాపట్ల వారేకదా ఆయన ప్రబావం మీపైన ఏమైనా వుందా?- అనడిగాను ఏమీ లేదన్నారు శివప్రసాద్ ఆయన ప్రాణాయామంతో ఊపిరి బిగబట్టి నోట్లో వెలు పెట్టి ఈలపాట పాడేవారు ఒక ఉచ్ఛ్వాసానికి మరొక ఉచ్ఛ్వాసానికీ మద్య ఎడం ఏర్పడెది నైరంతర్యం ఉండేది కాదు నేను ఊపిరి పీల్చి ఒక్క ఊపుతో పాడను సహజంగానె పెదవులు బుంగరించి పాడుతాను మా పద్ధతులు బిన్నం- అన్నారు శివప్రసాద్

లండన్, గయానా, అమెరికాల నుంచి ఈయనకు



శ్రీ కె. శివప్రసాద్

ఆహ్వానాలు వచ్చాయి తన కళ నిర్దుష్టంగా వుండడానికి విదేశాలలోని విద్వాంసులు మెచ్చడానికి ఈయన సాదన చెస్తున్నారు ఈలపాటకు ప్రపంచంలో ఒక ప్రత్యేక స్థానం కల్పించాలి తద్వారా పాశ్చాత్య దేశాలలో బారతీయ సంగీత ప్రచారం చేయాలి ఏ జూబిన్ మెహతా వంటి వారితోనో ఈలపాట ప్రదానంగా ఆర్కెస్ట్రా ఏర్పాటు చేయాలి మనదేశంలో ప్రస్తుతం అలాటి ఆర్కెస్ట్రా నిర్మించగలవారు శ్రీ ఈమని శంకర శాస్త్రి గారు ఆయన ద్వారా ఈలపాటకు విశేషఖ్యాతి కలిగించాలి –ఇవి నా లక్ష్యాలు– అన్నారు శివప్రసాద్ జూన్ 15వ తేదీ సాయంకాలం రవీంద్ర బారతిలో శివప్రసాద్ ఈల పాటల ఎల్ పి రికార్డు ఆవిష్కరణ జరిగింది ఈలపాటతో ఇలాటి రికార్డు తయారు చెయడం ప్రపంచంలోనే ఇదే ప్రధమం ఇలాటి గౌరవం తెలుగు వారికి దక్కడం గర్వకారణం ఈ ఎల్ పి రికార్డును కేంద్ర సమాచార ప్రసార శాఖామంత్రి శ్రీ వి ఎన్ గాడ్గిల్ ఆవిష్కరించారు ఆవిష్కరణోత్సవానికి శ్రీ అక్కినేని నాగేశ్వరరావు అద్యక్షత వహించారు మహారాష్ట్ర గవర్నర్ శ్రీ కోన ప్రబాకరరావు ముఖ్య అతిదిగా ఉన్నారు శ్రీ పి వి ఆర్ కె ప్రసాద్, శ్రీ జె వి సోమయాజులు ఆశీర్వదించారు న్యాయమూర్తి శ్రీమతి అమరేశ్వరి శివప్రసాద్‌కు మెమెంటో బహూకరించారు ఈ రికార్డులో నాటకురంజి రాగంలో వర్ణం హంసధ్వనిలో వాతాపి గణపతిం బజే, శ్రీరాగంలో ఎందరో మహానుబావులు, ఆబెరిలో నగుమోము తనివర్తనం, ఒక బజన్, మగుడి (నాగస్వరం లాంటిది) ఉన్నాయి శ్రీయుతులు తంజావూర్ ఉపేంద్రన్ మృదంగం హరిశంకర్ కంజీర, పేరి శ్రీరామమూర్తి వయొలిన్, డి ఎస్ ఆర్ మూర్తి ఘటం, ఎస్ కణ్ణన్ మోర్సింగ్ వాయించారు ఆవిష్కరణ సందర్భంలో శివప్రసాద్ శ్రీ బాలమురళీకృష్ణ రచితమైన మహాదేవసుతం, మరుగేలరా (జయంతి) అన్నమాచార్యుల నారాయణతే నమో నమో, జానపగీతం,

హిందూస్తానీలో రాగేశ్వం తోడిదున్ ఆలపించి శ్రోతలను ఆనందపరచారు శివప్రసాద్ శ్రీమతి గాంధీ బవనంలో ఈలపాట పాడినప్పుడు దానిని రికార్డు చెసి దూరదర్శన్‌లో ప్రసారం చేయమన్నారట శ్రీమతి గాంధీ దూరదర్శన్ వారికి ఈలపాట గాత్రమా, వాద్యమా అనే సందెహం వచ్చి, శివప్రసాదును ఏ విద్వాంసుల వర్గంలో చెర్చాలో విచికిత్స కలిగి ప్రసారం మానివెశారట మూడేళ్లయినా ఈ విచికిత్స తీరలేదేమో! ఈ దర్మ సందేహాన్ని కేంద్ర సమాచార ప్రసార శాఖామంత్రి శ్రీ గాడ్గిల్ (స్వయంగా విన్నారు గనుక) తీర్చి ప్రసారం జరిగేట్టు చూస్తారని ఆశించవచ్చు శివప్రసాద్ 1956 ఏప్రిల్ 26లో జన్మించారు మూడు పదులైనా నిండలేదు ఇంకా పది పదులు ఆరోగ్యంతో ఉండి ఈలపాటతో ప్రపంచాన్ని ఆనంద పరవశం చేస్తారని ఆశిస్తున్నాను

**ఉపశ్రుతి :–**

జూన్ 9న గాంది బవన్ ప్రకాశం హాలులో స్వాతంత్ర్య సమరయోదులకు సన్మానం జరుగుతున్నది ఈ సన్మానానికి అర్హత లేమిటండీ?– అనడిగారు నన్నొక శ్రోత స్వాతంత్ర్యోద్యమంలో జెయిలుకు వెళ్లడం ఇత్యాది– అన్నాను ఈ సమ్మాన్యులలో జెయిలు ముఖమైనా చూడని వారు కొందరున్నట్టున్నారే!– అని ఆయన సందేహం వెలిబుచ్చారు ఇదెక్కడి వెర్రెండీ మీకు? వారు సన్మానం ఏర్పాటు చేసిన వారి ముఖాలు చూసి వుంటారు– అన్నారు మరొక శ్రోత

–తిరుమల రామచంద్ర

*Printed and Published for Nageswara Rao Estates Private Ltd, by S Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3, Editor S Radhakrishna, Phones P B X 61247, 61248 & 75667*

# ఉత్తరాలు

( 4 వపేజీ తరువాయి)

## సీరియల్స్

డా॥ కె రవీంద్ర బాబుగారి 'శుశ్రుత నర్సింగ్ హోమ్' సీరియల్ ప్రారంభంలోనే ఆకట్టుకుంది అనడంలో అతిశయోక్తి లేదు రవి ఇందువదనల పరిచయం కంటే ఇందువదన, చంద్రహాస్‌ల పరిచయం ఆసక్తిదాయకంగా ఉంది తనకు ప్రేమ లేఖ వ్రాసిన చంద్రహాస్‌తో పరివర్తన తేవటానికి అనుకున్న టైముకు కరెక్టుగా వచ్చి అన్నంత పనీ చేసిన ఇందువదన ప్రవర్తన ఆశ్చర్యాన్ని కలుగ జేసింది

పాట్నీడి చక్రరావు, విశాఖపట్నం

* * *

నటి రాధ ముఖచిత్రంతో వెలువడిన సంచిక చాలా ఆకర్షణీయంగా ఉంది శుశ్రుత నర్సింగ్ హోమ్ సీరియల్ మొదటిలోనే చాలా బాగున్నది

దుంప వెంకటరమణ టెక్కలి

* * *

'జిగి–బిగి', ప్రారంభంలోనే చమువరులనే జిగి–బిగి చేసింది ముఖ్యంగా అమ్మాయి స్వార్థముతో అమాయకపు అబ్బాయిని, మోసగించిన తీరు వర్ణనాతీతం వెంటనే తగిన శాస్తిని సృష్టించిన రచయితగారు అభినందనీయులు

యన్ వూర్మిళా–వెంకటేశం,
కిరణ్‌కుమార్, కరీంనగర్

* * *

28–6–85 పత్రికలో కళ్యాణీ సోమరాజు గారు రచించిన ముసురు వెలిసింది సీరియల్ మొదటి భాగము చదివాను చాలా సహజంగా వుంది మూర్తి లాగా ప్రతి పురుషుడు ముందుకు వచ్చి ఆదర్శంగా వివాహాలు చేసుకుంటే ఆడపిల్లల తండ్రులు చాలా సంతోషిస్తారు కథలు చదివితే కలలలాగే మిగిలిపోతయి. 'నిజ జీవితంలో ఆచరిస్తే వాండ్ల కీర్తిని వేనోళ్ల కొనియాడుతారు.

ప్రతి యువకుడు ముందుకు వచ్చి కట్న కానుకలు లేకుండ కన్నె చెర విడిపించిన రోజున ఆడపిల్లల ఆనందమునకు అంతులేదు ప్రతి యువకుడు మూర్తి లాగ ముందుకు రావాలి

జి రాజ్యం నారాయణరావు, మచిలీపట్నం

* * *

ఆదూరి సావిత్రి గారి పడమట సంధ్యారాగం సీరియల్ చాలా బాగుంది ప్రతివారం క్రొత్త మలుపులు తిరుగుతూ ఆసక్తి కలిగిస్తోంది రచయిత్రి గారికి మా అభివందనములు

పి రాము, పి నిర్మల, గుంటూరు

* * *

సుచిత్రాదేవి ప్రేమించవే మనసా సువర్చలాదేవి రాగసంధ్య సీరియల్స్ రెండు ఒకేలాగ నడుస్తున్నాయి ఇంత చక్కని సీరియల్స్ రాసిన రచయిత్రులకు మా ధన్యవాదాలు

ఎ ఆర్ బి జ్యోతి, పాలకొండ

ఇటీవల
ఖరగ్‌పూర్ కొత్త కోలీలు అమ్మవారి ఉత్సవాలు జరిగినప్పుడు వీరబ్రహ్మేంద్రస్వామి వేషం కట్టిన చి. శిలపరశెట్టి ప్రసాద్‌బాబు.



## కథలు

కథలలో ఉదాత్తం బాగుంది రచయిత వర్ధనమ్మ పాత్రను పాఠకుల సానుభూతిని పొందేలా చిత్రించేరు బ్రతుకుతెరువు కోసం పసుపు కుంకుమలకు దూరమైన వర్ధనమ్మ ముత్తయిదువగా నటించి రంగనాయకి ఎదుట అర్హతలేని కొంగు వాచటం ఆమె దయనీయ పరిస్థితిని తెలియపరచి వర్ధనమ్మ పాత్రపై సానుభూతి చినుకులు పడేలా చేసింది ఇది రచయిత ప్రతిభకు నిదర్శనం

స్వరాజ్యలక్ష్మి, ఆనందగజపతిరావు పీరపట్నం

## న్యూఢిల్లీ లేఖ

'డా జయ్‌దుబాషీ న్యూఢిల్లీ లేఖ మీ పత్రికకు విలువను పోగొట్టుతూంది ఆయన గారు అన్ని విషయాలను సహృదయంతో విమర్శిస్తున్నారు అని మీరు పొరపడుతున్నారు శ్రీమతి ఇందిరాగాంధి గారి కుటుంబాన్ని పనికట్టుకుని విమర్శించడమె తన వంతు లాగ ఉంది ఆయన పారంలో కాబట్టి మీరు దయతో ఈ కాలంలో మరో సద్విషయాన్ని ప్రచురించి, మీ పత్రికను వ్యక్తిగత దూషణలకు తావివ్వని ఉన్నత పందాలకు తీసుకు పోతారని నా మనవి

పి సుబ్రమణ్యమ్, కొమరోల్

## అచ్చు పొరపాటు

21–27 జూన్ 85 లో శ్రీదేవి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్రవారపత్రికలో పాలకూర సీతాలత గారి 'ముసుగు' అనే కథలో 24 పేజీ 3 వ కాలమ్ 42 వ లైనులో 'వచ్చిన' అనే పదానికి బదులు 'చచ్చిన' అనే పదం పడింది

జాదవ శ్రీనివాసరావు, బద్వేలు

● అచ్చు పొరపాటుకి చింతిస్తున్నాము –సం

# సిరిలాక్ ప్రేమను అందివ్వండి!

సుమారు 4వ నెల నుంచి, మీ పాపాయికి పాలతోపాటు, ఘనపదార్థాలు కూడా అవసరమవుతాయి. బాబుకు సిరిలాక్ ప్రేమను అందించడానికి తగిన సమయం ఇదే.

**పోషకాహారపు లాభం :** ప్రతి సిరిలాక్ మోతాదు, మీ పాపాయికి కావలసిన పోషకాహారాలు—మాంసకృత్తులు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు, విటమిన్లు, ఖనిజాలను సమకూరుస్తుంది. మీ పాపాయి ప్రత్యేక అవసరాలకు తగినట్టు సమపాళ్లలో తయారయింది.

**త్వరితగతి లాభం :** మీ పాపాయికి ఎప్పుడు కావాలంటే, అప్పుడు, సెకన్లలో సిద్ధమవుతుంది. దీనిలో పాలు, పంచదార ఉండనే ఉన్నాయి. ఇక, మీరు, ముందు మరిగించి వుంచుకున్న నీటిలో దీన్ని కలపాలి. అంతే!

**రుచి లాభం :** మొదటి ఘన ఆహారం, కొత్త గమ్మత్తు రుచిని అనుభూతిని ఇస్తుంది. పాపాయికి దీని రుచి ఎంతో నచ్చుతుంది. ఇది, శుభారంభం కూడా. మీ పాపాయికి సమపాళ్లలో పోషకాహారాన్ని అందచేసేందుకూ, తయారీలో శుభ్రతను పాటించేందుకూ, డబ్బా మీది సూచనలను అనుసరించండి.

**పెరుగుదల పట్టిక ఉచితం !**
మీ పాపాయికి తన స్వంత పెరుగుదల పుస్తకం కోసం రాయండి-సిరిలాక్, పోస్ట్‌బాక్స్-3 కొత్త ఢిల్లీ-110008.

ఇప్పుడు కొత్త ప్యాకింగ్‌లో






# సంగీతంలో అతడు పలికించిన ప్రతినాదాన్ని గ్రహించి ముద్రించుకుంటుంది. తిరిగి మీరుకోరినపుడు యథాతథంగా పాడి వినిపిస్తుంది జీవితాంతము.



**అంతా సంగీతమయమే! మరే ఇతర శబ్దాలు ఉండబోవు.**

## koneru
### ఆడియో క్యాసెట్లు

ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన జపాన్ యంత్రాలపై తయారు చేయబడిన కోనేరు క్యాసెట్లు మీకు అంతర్జాతీయస్థాయి నాణ్యతను అందిస్తాయి.

**కోనేరుకు ఆ ప్రత్యేక ధ్వని తరంగాలు లభించడానికి గల కారణాలు:**

● మాగ్నటిక్ అణువులు టేపంతయు సమానంగా వ్యాపించి ఒకే మూసలో పోసినట్లు నిర్దిష్టంగా రూపొందించిన రూపకల్పన. ● నేపథ్యంలోని అతి తక్కువస్థాయి శబ్దతరంగాలను సైతము స్వచ్ఛంగా వినబడేవిధంగా తీర్చిదిద్దిన ప్రత్యేకత. ● మారోమ్రోగిపోయే అతి హెచ్చుస్థాయి శబ్ద తరంగాలను సైతము సున్నితంగా గ్రహించుకోగల అసమానత. ● రవాణాలో ఏ మాత్రము దెబ్బతినడానికి వీలుగాని కట్టుదిట్టమైన నిర్మాణము. ● టేపును వక్రమంగా, సున్నితంగా తిరుగునట్లుచేయు సిలికాన్ చేర్చబడ్డ రోలర్లు. ● ప్రత్యేకంగా పోతపోసిన లోహంతో నిర్మించిన సంపూర్ణ భద్రతగల ఫ్రేంనిర్మాణము. ● తెరచినపుడు క్యాసెట్ పడిపోకుండ ఆపేందుకు యంత్ర తాళపు సౌకర్యము.




తయారుచేయువారు: **శక్తి ఇంజనీరింగ్ కంపెని**, ఎలెక్ట్రానిక్స్ డివిజన్, 26-36-39 మ్యూజియం రోడ్డు, విజయవాడ 520 002.

CLARION/SEC 8513